

శ్రీః
శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమత్ సుందరకాండ - సౌందర్యదర్శనము

మొదటి భాగం

## శ్రీమత్ సుందరకాండ - సంగ్రహకథ

ఘండికోట బ్రహ్మాజీరావు

జనసేవా ప్రచురణ
(శ్రీమత్సుందరకాండకు పరిమితము)
విశాఖపట్నం 1992

Sreemath Sundarakanda - Saundarya Darsanam Part-I
Srimath Sundarakanda - Sangraha Katha

*by*
Ghandikota Brahmaji Rao

---

April 1992

**Price: Rs. 35/-**

Copies can be had of
**JANASEVA PUBLICATIONS**
(Limited to Sundarakanada Only)
46-18-11 Mandavaripeta,
Dondaparti
**VISAKHAPATNAM 530 016**

*Printed at*
Ramsha-Siriesha Publications
40, Industrial Estate
Samalkot 533 440

---



శ్రీమత్ సుందరకాండ–సౌందర్య దర్శనము
మొదటిభాగం.
శ్రీమత్ సుందరకాండ–సంగ్రహ కథ

ఈ భాగం
నా తల్లిదండ్రులు
కీర్తిశేషులు ఘండికోట లక్ష్మీనారాయణ
సుందరమ్మగార్లకు
భక్తితో అంకితమీయబడ్డది.

# విషయసూచిక

# శ్రీమత్ సుందరకాండ-సౌందర్య దర్శనము

## మనవి

వాల్మీకి విరచితమైన శ్రీమద్రామాయణంలో సుందరకాండ అయిదవది. కథా సంవిధానంలో, భాషలో, కవితా సౌందర్యంలో దీనిని మించినది లేదు. హనుమంతుని కార్యతత్పరత మానవకోటికి ఉత్తేజం కలిగించి విజయ సాధనకు తోడ్పడుతుంది. బాహ్య సౌందర్యమే కాకుండా అంతః సౌందర్యం కూడా విశదీకరింపబడిన సుందరకాండ భారతీయులందరికీ శిరోధార్యమైన పారాయణ గ్రంథము.

ఇంతకు పూర్వం మేము శ్రీ మత్సుందరకాండను సరళ వ్యాఖ్యానంతో, సచిత్రంగా, సంపూర్ణంగా ముద్రించి సహృదయుల కరకమలాలలో ఉంచాము.

ఇపుడు 'శ్రీమత్సుందరకాండ-సౌందర్య దర్శనము' అన్న గ్రంథాన్ని ఆరుభాగాలలో ప్రచురిస్తున్నాము. అవి (1) శ్రీమత్ సుందరకాండ-సంగ్రహ కథ. (2) రాక్షసులు (3) నరులు-వానరులు (4) సీతమ్మ మాయమ్మ (5) సీతా వృత్తాంతకోవిదుడు (6) శ్రీమత్ సుందరకాండ-మూలము-పదకోశ సహితము.

సరళమైన వచనంలో, సందర్భానుసారంగా శ్లోకాలను చేర్చి శ్రీమత్ సుందరకాండ గురించి విపులంగా చెప్పేదే ఈ గ్రంథం.

ఈ ఆరుభాగాలకు శ్రీ బాపుగారు దివ్యమైన ముఖచిత్రాలు, కవరు వెనుక శ్రీరామపట్టాభిషేక చిత్రం పలురంగులలో చిత్రించారు. ఇది తెలుగు వారి అదృష్టం.

-ఘండికోట బ్రహ్మాజీరావు

ప్రచురణ సంఘ కార్యదర్శి.

శ్రీః

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

# ఆముఖం

తతో రావణనీతాయా స్సీతాయాః శత్రు కర్శనః
ఇయేష పదమన్వేష్టుం చారణా చరితే పథి.

పై శ్లోకంతో శ్రీమత్ సుందరకాండ మొదలవుతుంది. శ్రీమద్వాల్మీకి రామాయణంలో సుందరకాండ అయిదవకాండ. బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ కాండలకు, యుద్ధకాండ, ఉత్తరకాండలకు పెట్టినపేర్లు ఆయాభాగాలలోని రామకథకు అనుగుణంగా ఉన్నాయి, కాని, సుందరకాండకు అందుకు భిన్నంగా పేరు పెట్ట బడింది. రామకథ ఈ కాండలో పరాకాష్ఠకు చేరుకుంటుంది. సౌందర్యంతో నిండిన ఈ కాండకు మరేదీ పేరు పెట్టక సుందరకాండ అని వాల్మీకి పేరుంచినాడు.

సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్
సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరః

సుందరకాండలో రాముడు సుందరుడు – కథాభాగం సుందరమైనది. సీతాదేవి సుందరి; అశోకవనం సుందరమైనది; కావ్యం సుందరమైనది; వానరుడు సుందరుడు; మంత్రభాగం సుందరమైనది. సుందరకాండలో సుందరం కానిది ఏముంది?

ఈ పరమ సౌందర్యాన్ని తెలుసుకోడానికి విశ్లేషణచేసి ఈ కాండను అధ్య యనం చేయవలసి ఉంది.

---

శ్రీః

# శ్రీమత్ సుందరకాండ – సౌందర్య దర్శనం

## సంక్షేప రామాయణకథ

శ్రీ మద్వాల్మీకి విరచితమైన రామాయణ మహాకావ్యంలో సుందరకాండ అయిదవది. సుందరకాండలోని చక్కదనాలను తెలుసుకోడానికి సంక్షేపంగానైనా రామాయణ కథను ఎరిగి ఉండాలి. బాలకాండ మొదటి సర్గలో సంగ్రహరామకథ చెప్పబడింది. సజ్జనుల సౌకర్యం కోసం దానిని యథాతథంగా ఇక్కడ అనుసంధానం చేయడం జరిగింది.

**తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరం**
**నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్ముని పుంగవమ్.**

ఎల్లప్పుడూ తపస్సు చేసేవాడు, వేదాధ్యయనం చేసేవాడు, మాటలెరిగిన వారిలో (అనగా పండితులలో) ఉత్తముడు, మునులలో శ్రేష్ఠుడు అయిన నారదుని, తపోనిధియైన వాల్మీకి ప్రశ్నించాడు.

“వర్తమాన కాలానికి చెందిన ఈ లోకమందు ఎవడు గుణవంతుడు? ఎవడు వీర్యవంతుడు? ఎవడు ధర్మజ్ఞుడు? ఎవడు కృతజ్ఞుడు? ఎవడు నిజం పలికేవాడు? ఎవడు దృఢవ్రతుడు?

“శీలం విషయంలో ఎవడు యోగ్యుడు? అన్ని ప్రాణులయందు మంచిని కోరేవాడెవడు? ఎవడు విద్వాంసుడు? ఎవడు చూడచక్కనివాడు?

“ఆత్మ విదుడెవడు? కోపాన్ని జయించినవాడెవడు? కాంతి మంతు డెవడు? అసూయలేని వాడెవడు? యుద్ధమందు ఎవనికి కోపం వస్తే దేవతలు కూడా భయపడతారు?

“ఇదంతా నేను వినగోరుతున్నాను. నాకు చాల కుతూహలంగా ఉంది. ఓయి మహర్షి – ఇటువంటి మానవుడిని నువ్వే తెలుసుకోగల సమర్థుడవు.”

త్రిలోకజ్ఞుడైన నారదుడు వాల్మీకి మాటలు విని, అతనిని పిలిచి, అన్నాడుః

"నేను చెప్పే ఈ మాటలను వినవలసింది"

నారదుడు చాల సంతోషించి ఈ విధంగా పలికాడు.

"ఓయి ముని! ఏ గుణాలను నువ్వు కీర్తించావో వాటిలో చాలగుణాలు లోకంలో లభించనటువంటివి. నువ్వు కోరిన మానవుని గురించి తెలుసుకొని నేను చెప్తున్నాను వినవలసింది.

"ఇక్ష్వాకు వంశంలో రాముడను అతడు జన్మించాడు. అతడు ప్రజల చేత కొనియాడబడేవాడు. నియతాత్ముడు (నిలుకడగల మనస్సు కలవాడు) మహావీర్యుడు (పరాక్రమశాలి.) ద్యుతిమంతుడు (కాంతి గలవాడు) ధృతిమంతుడు (ధైర్యము కలవాడు) వశి (ఇంద్రియాలు తన అధీనంలో ఉన్నవాడు).

" అతడు బుద్ధిమంతుడు; నీతిమంతుడు; వాగ్మి (యుక్తి యుక్తంగా మాట్లాడేవాడు); శ్రీమంతుడు (మంగళమూర్తి) శత్రు నిబర్హణుడు (శత్రువులను వధించేవాడు); విపులాంసుడు (విశాలమైన మూపుగలవాడు); మహాబాహువు; కంబుగ్రీవుడు (శంఖమువంటి మెడకలవాడు); మహాహనువు (చెక్కిళ్లపై భాగం గొప్పదిగా నున్నవాడు).

"మహోరస్కుడు (విశాలమైన వక్షః స్థలం కలవాడు); మహేష్వాసుడు (గొప్ప విల్లు కలవాడు); గూఢజత్రువు (పైకి కనిపించని మూపు ఎముకలు కలవాడు); అరిందముడు (శత్రువులను అణచువాడు); ఆజానుబాహువు (మోకాళ్ల వరకు పొడవుగానున్న చేతులు కలవాడు); సుశిరుడు (ఉత్తమమైన తలకలవాడు); సులలాటుడు (మంచి వెడల్పైన నుదురు కలవాడు); సువిక్రముడు (ఉత్తమమైన నడక గలవాడు)

"సముడు (చాల పొట్టిగా చాల పొడవుగా లేక సమమైన ఎత్తులోనున్నవాడు); సమవిభక్తాంగుడు (సరియైన రీతిలో విభజింప బడిన శరీరావయవములు కలవాడు; స్నిగ్ధవర్ణుడు (నిగనిగలాడు దేహచ్ఛాయ గలవాడు); ప్రతాపవంతుడు; పీనవక్షుడు (బలిసిన రొమ్ము కలవాడు) లక్ష్మీవంతుడు (శోభకల వాడు); శుభలక్షణుడు.

"ధర్మజ్ఞుడు; సత్యసంధుడు; ప్రజలకు మేలు చేయుటయందే అనురక్తుడు; కీర్తిని పొందినవాడు; అపారమైన జ్ఞానం కలవాడు; శుభ్రంగా ఉండువాడు; ఆశ్రితుల వశమందు ఉండేవాడు; సమాధిమంతుడు.

"ప్రజాపతి సముడు (బ్రహ్మతో సమానమైనవాడు), శ్రీమంతుడు, ధాత (ప్రపంచాన్ని పోషించేవాడు; లేక సమస్తమును ధరించినవాడు) సకల ప్రాణికోటిని రక్షించేవాడు; ధర్మాన్ని అధికంగా రక్షించేవాడు.

"తన ధర్మాన్ని రక్షించడమేకాక, తన వారినందరిని రక్షించేవాడు. నాలుగు వేదాల తత్త్వం, ఆరువేదాంగాల తత్త్వం తెలిసిన వాడు; ధనుర్వేదంలో నిష్ణాతుడు;

"అన్ని శాస్త్రాలను, వాటి అర్థాన్ని బాగా తెలిసినవాడు; తెలిసిన విషయాలను మరువనివాడు; ప్రతిభావంతుడు; ప్రజలందరికి ప్రియమైనవాడు; సాధువు (సజ్జనుడు); కలత పొందని మనస్సు కలవాడు; విచక్షణుడు.

"అటు వంటి అన్ని గుణాలుకల అతడు కౌసల్యాదేవికి ఆనందం పెంపొం దించే పుత్రుడు; గాంభీర్యంలో సముద్రము వంటి వాడు; ధైర్యమందు హిమ వత్పర్వతం వంటివాడు.

"పరాక్రమమందు విష్ణువుతో సమానుడు; చంద్రునివలె చూడచక్కని వాడు; కోపంలో ప్రళయాగ్ని వంటివాడు; ఓర్పునందు భూమితో సమానుడు. దానము నందు కుబేరుని వంటివాడు; సత్యమునందు వేరొక ధర్మదేవత వంటివాడు.

"ఇటువంటి గుణాలు కలవాడిని, నిజమైన పరాక్రమం కలవాడిని, పెద్దవాడైన వాడిని, ఉత్తమ గుణాలతో కూడిన వాడిని, ప్రియుడైన వాడిని, దశరథుని కొడుకైన రాముని, ప్రజల మేలుకే నియుక్తుడైన వాడిని, ప్రజలయొక్క ప్రియమైన కోరిక ననుసరించి, భూమి భర్తయైన దశరథుడు ప్రీతితో యువరాజునుగా చేయ దలచినాడు.

"యువరాజుగా రాముని చేయడం కోసం చేసిన ఏర్పాటులను అప్పుడు దశరథుని భార్యయైన కైకేయి చూసింది. ఒకప్పుడా రాణికి దశరథుడు వరమిచ్చి నాడు. ఆ వరాన్ని ఆమె అప్పుడడిగింది. రాముడిని వనవాసానికి పంపమని, భరతుడిని యువరాజుగా అభిషిక్తుని చేయమని ఆమె కోరింది.

"సత్యం పలుకుటయందు బద్ధుడైన దశరథుడు ధర్మమను త్రాటితో కట్టబడ్డవాడై ప్రియసుతుడైన రాముడిని అడవికి పంపించినాడు.

"కైకేయికి ప్రియం కలిగించడంకోసం తండ్రి యిచ్చిన ఆజ్ఞను వీరుడైన రాముడు అనుసరించాడు. తండ్రికి ప్రతిజ్ఞ నిచ్చాడు. ఆ ప్రతిజ్ఞను పాలించడానికి అరణ్యానికి పోయాడు.

"అడవికిపోతున్న రాముని వెంట అతనికి ప్రియుడైన సోదరుడు లక్ష్మణుడు వెళ్లినాడు. వినయసంపన్నుడు, సుమిత్రాదేవికి ఆనందం పెంపొందించేవాడు అయిన లక్ష్మణుడు అన్నయందు ఉత్తమమైన సోదర భావాన్ని చూపి, స్నేహంతో, ప్రేమ గలవాడై, అతనిని అనుసరించాడు.

"రాముని ప్రియమైన భార్య సీతాదేవి. ఆమె రాముడికి ఎల్లప్పుడు ప్రాణంతో సమానమైనది. ఆమె ఎప్పుడూ భర్త హితమే కోరుతుంది. జనక మహారాజు వంశమందు ఆమె జన్మించింది. తిలోత్తమవలె ఆమె సర్వాంగ సౌష్ఠవంగా సృష్టింప బడింది. అన్ని శుభలక్షణాలు కలది ఆమె. స్త్రీలయందు ఉత్తమురాలు. దశరథుని కోడలు ఆమె. ఏ విధంగా రోహిణి తన భర్తయైన చంద్రుని అనుసరిస్తుందో, ఆ విధంగానే సీతాదేవి కూడా రాముడిని అనుసరించింది.

"చాల దూరం వరకు పురజనులూ, తండ్రియైన దశరథుడూ రాముడిని అనుసరించారు.

"శృంగిబేరపురమందు గంగానదీతీరాన్న ధర్మాత్ముడైన రాముడు బోయవారికి రాజయిన గుహుని చేరుకొని, సారథియైన సుమంత్రుడిని విడిచి పెట్టినాడు.

"గుహుడితోను, లక్ష్మణుడితోను, సీతతోను కూడిన రాముడు సారథిని విడిచిపెట్టినాడు.

"సీతారామలక్ష్మణులు ముగ్గురూ అడవి నుండి అడవికి పోతూ, చాల నీరు కలనదులను దాటి, చిత్రకూటం చేరి, భరద్వాజ ముని యొక్క ఆజ్ఞచేత అంద మైన నివాసాన్ని (పర్ణశాలను) నిర్మించుకొని, అడవియందు విహరించుతూ దేవత లతో, గంధర్వులతో సమంగా, సుఖంగా నివసించారు.

"రాముడు చిత్రకూటం చేరినాడు. శోకంతో పీడింపబడిన దశరథమహా

రాజు, కొడుకు కోసం ఏడుస్తూ, స్వర్గానికి వెళ్లిపోయాడు.

"దశరథుడు మరణించగా, వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులు, రాజ్యం పాలించడానికి భరతుని నియమించారు. కాని, అతడు రాజ్యాన్ని అంగీకరించలేదు.

"వీరుడైన భరతుడు రాముని పాదాలను ప్రసన్నములుగా చేసికొనడానికి అడవికి పోయినాడు.

"భరతుడు అడవికి పోయి పెద్దవాడయిన అన్నయందు గౌరవ భావముంచి సత్యవ్రతుడూ, పరాక్రమవంతుడూ, మహాత్ములలో శ్రేష్ఠుడూ అయిన సోదరుడైన రాముడిని ప్రార్థించాడు.

" 'నీవే ధర్మం తెలిసిన రాజువు'. అని భరతుడు రామునితో అన్నాడు.

"రాముడు కూడా చాల ఉదారమైన స్వభావం కలవాడు. అనుకూలుడు. గొప్ప కీర్తికలవాళ్లలో ఉత్తముడు. మహాబలుడైన రాముడు తండ్రి ఆజ్ఞ ప్రకారం రాజ్యాన్ని కోరలేదు.

"రాముడు తన పాదుకలయందు రాజ్యానికి ప్రాతినిధ్యమిచ్చి, మరల మరల భరతునకు నచ్చ జెప్పి వెనుకకు పంపివేశాడు.

"రాముడిని అయోధ్యకు తిరిగి తేవాలన్న కోరిక తీరకుండానే, భరతుడు రాముని పాదుకలను సేవించి, రాముడు తిరిగి రాగలడన్న కోరికతో నందిగ్రామ మందు రాజ్యము చేసినాడు.

"భరతుడు మరలిపోగా, మంగళమూర్తి, సత్యసంధుడు, జితేంద్రియుడు అయిన రాముడు, నగరవాసులైన జనులు తిరిగి అక్కడికి వచ్చి బలవంత పెట్ట గలరని భావించి, ప్రతిజ్ఞా పాలనమందు మనసు నిలిపినవాడై, దండకారణ్యాలను ప్రవేశించాడు.

"మహారణ్యమైన దండకను ప్రవేశించి, రాజీవలోచనుడు (తామరరేకులవంటి కనులు కలవాడు) రాముడు, విరాధుడను రాక్షసుని సంహరించి, శరభంగ మహామునిని దర్శించాడు. సుతీక్ష్ణుని, అగస్త్యుడిని, అగస్త్యుని సోదరుడైన సుదర్శనమునిని రాముడు దర్శించాడు.

"అగస్త్యునికి దేవేంద్రుడు విల్లు, ఖడ్గం, అమ్ములు ఎన్ని తీసినా తరగని రెండు అమ్ముల పొదులను ఇచ్చాడు. వాటిని అగస్త్యుడు రామునికి ఈయగోరినాడు. రాముడు చాల సంతుష్టుడై వాటిని స్వీకరించాడు.

"వనచరులతో కలిసి రాముడు దండకాటవిలో నివసిస్తూ ఉన్నాడు. అసురులైన (చంపడమే స్వభావం కలవారైన) రాక్షసులను చంపమని కోరడానికి ఋషులందరూ రాముడిని సమీపించారు.

"దండకారణ్య నివాసులైన మునులు అగ్నితో సమానమైన వాళ్లు. రాక్షసులను యుద్ధంలో చంపుతానని రాముడు వారి ఎదుట ప్రతిజ్ఞ చేశాడు.

"దండకారణ్యంలో రాముడు నివసిస్తూ ఉన్నప్పుడు, జనస్థాన నివాసిని, కామరూపిణి అయిన శూర్పణఖ అన్న రాక్షసి, రాముడిచే వికృత రూపిణిగా చేయబడింది.

"శూర్పణఖ మాటలువిని, యుద్ధ సన్నద్ధులైన రాక్షసులనందరిని, ఖరుడు, త్రిశిరుడు, దూషణుడు మొదలగు రాక్షసులను, వారి అనుచరులను దండకారణ్యమందు రాముడు చంపివేసినాడు.

"ఆ వనమందు నివసించుతూ ఉన్న జనస్థాన నివాసులైన పధ్నాలుగు వేలమంది రాక్షసులను రాముడు చంపివేసినాడు.

"తన వారసుల చావును రావణుడు విని కోపంతో తెలివి తప్పినట్లయినాడు. మారీచుడను పేరుగల రాక్షసుని తనకు సహాయం చేయుమని రావణుడు కోరినాడు.

"బలవంతుడైన రామునితో నీకు విరోధం తగదు' అని చాలసార్లు మారీచుడు రావణుని నివారించాడు.

"మృత్యువుచే ప్రేరేపింపబడిన రావణుడు, మారీచుని ఆ వాక్యాన్ని లక్ష్యం చేయక, మారీచునితో కలిసి రాముని ఆశ్రమానికి వెళ్లినాడు.

"మాయావియైన మారీచుడు రాజపుత్రులైన రామలక్ష్మణులిద్దరినీ దూరానికి తీసుకొనిపోయాడు. రాముని భార్యను అపహరించి, రావణాసురుడు జటాయువుని చంపినాడు.

"జటాయువు గృధ్రరాజు. అతడు రావణునిచే దెబ్బతిన్నాడు. సీతాదేవి అపహరింపబడినదని అతని వలన విని, రాముడు దుఃఖం చేత బాగుగా పీడింపబడిన వాడై, ఇంద్రియాలు కలత చెందగా ఏడ్చినాడు.

"ఆ విధంగా దుఃఖంతో ఉంటూనే గ్రద్దయైన జటాయువునకు దహన సంస్కారం చేసి, అడవియందు సీతాదేవిని వెదకుతున్న రాముడు, వికారమైన రూపం కలవాడు, భయంకరంగా కనబడుతున్నవాడు అయిన కబంధుడను రాక్షసుని చూచినాడు.

"మహాబాహుడైన రాముడు, ఆకబంధుని వధించి, అగ్ని సంస్కారం చేయగా అతడు స్వర్గానికి పోయినాడు.

"ఆ కబంధుడు స్వర్గానికిపోతూ, 'ఓరామా! ధర్మాన్ని ఆచరించేది, సన్న్యాసిని, ధర్మసూక్ష్మాలను తెలిసినది అయిన శబరిని కలిసికొమ్ము' అని చెప్పినాడు.

"అపుడు మహాతేజశ్శాలి, శత్రువులను చంపువాడు అయిన రాముడు శబరి దగ్గరికి పోయినాడు. శబరిచేత చక్కగా దశరథపుత్రుడైన రాముడు పూజింప బడినాడు.

"పిమ్మట రాముడు పంపాసరస్సు తీరాన హనుమంతుడను వానరుని కలుసు కున్నాడు. హనుమంతుని మాటలననుసరించి సుగ్రీవునితో కూడ సమావేశమై నాడు.

"మహాబలుడైన రాముడు మొదటినుండి జరిగిన దంతా సుగ్రీవుడితో చెప్పాడు. సీతాదేవి యొక్క అపహరణం గురించి ఇంకా వివరంగాను చెప్పాడు.

"వానరుడైన సుగ్రీవుడు కూడా రాముడు చెప్పిన దంతా విని, తృప్తి పొందిన వాడై, రామునితో అగ్ని సాక్షిగా స్నేహం చేసుకున్నాడు.

"అటు పిమ్మట వానరరాజైన సుగ్రీవుడు, తన అన్నయైన వాలితో ఏ విధంగా విరోధం సంభవించిందో, దానినంతనూ స్నేహంతో రామునికి నివేదించి నాడు.

"రాముడు అపుడు వాలిని వధిస్తానని ప్రతిజ్ఞ చేసినాడు. వానరుడైన సుగ్రీవుడు, అన్నయైనవాలి బలం గురించి వివరించాడు.

"రాముని బలం తెలుసుకోడానికి సుగ్రీవుడు మహాపర్వతంతో సాటిగానున్న దుందుభి కళేబరాన్ని రామునికి చూపించాడు.

"దీర్ఘమైన బాహువులు కలవాడు, గొప్ప బలం కలవాడు అయిన రాముడు దుందుభి అస్థి పంజరాన్ని కాలిబొటన వ్రేలితో పూర్తిగా ఎత్తి, పదియోజనాల దూరానికి విసరివేసినాడు.

"అంతటితో సరిపెట్టక, రాముడు ఏడు సాలవృక్షాలను, పర్వతాన్ని, పాతాళాన్ని ఒకే బాణంతో చీల్చినాడు.

"అపుడు సుగ్రీవుడు తృప్తిచెందిన మనస్సు కలవాడై, రాముని యందు విశ్వాసం పొంది, రామునితో కలసి పర్వతాల మధ్యను గుహవలెనున్న కిష్కింధకు పోయినాడు.

"కోతులయందు శ్రేష్ఠుడు, బంగారం వలె పింగళవర్ణం కలవాడు అయిన సుగ్రీవుడు గొంతెత్తి గర్జించాడు.

"గొప్పదైన ఆశబ్దానికి వానర శ్రేష్ఠుడైన వాలి తనచోటు నుండి పైకి వెడలినాడు.

"వద్దని తార వారించుతున్నా, వాలి ఆమెను సమాధాన పరచి, సుగ్రీవునితో పోరుకు తలపడ్డాడు. అపుడు యుద్ధం జరుగుతుండగా ఒకే బాణంతో రాముడు వాలిని కొట్టినాడు.

"సుగ్రీవుని మాటల ననుసరించి యుద్ధమందు వాలిని చంపి, అటు పిమ్మట అతని రాజ్యమందు సుగ్రీవుని ప్రతిష్ఠించినాడు.

"వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు వానరులనందరినీ తీసుకొని వచ్చాడు. జనకుని కూతురైన సీతాదేవిని చూడడానికి వారిని అన్ని దిక్కులకూ పంపించాడు.

"అపుడు గ్రద్దయైన సంపాతి మాటల ప్రకారం, బలవంతుడైన హనుమంతుడు, నూరు యోజనాలు వెడల్పుగల ఉప్పుసముద్రం దాటినాడు.

"అక్కడ రావణునిచే పాలింపబడుతున్న లంకాపురిని చేరి, అశోకవనంలో ధ్యాన పరాయణ అయిన సీతాదేవిని దర్శించినాడు.

"రాముడు తనకు గురుతుగా నిచ్చిన అంగుళీయకాన్ని సీతాదేవి కిచ్చి, ఆమెకు రాముని వృత్తాంతమంతా తెలియజేసి, విదేహ రాజపుత్రిని ఓదార్చి హనుమంతుడు అశోకవనం యొక్క వెలుపలి ద్వారాన్ని తొక్కి వేసినాడు.

"హనుమంతుడు రావణుని సేనాపతులను అయిదుగురిని, మంత్రికుమారులను ఏడుగురిని చంపి, వీరుడైన యక్షకుమారుని నుగ్గు చేసి, ఇంద్రజిత్తుకు పట్టుబడ్డాడు.

"బ్రహ్మవరం ప్రకారం తాను బ్రహ్మాస్త్రం నుండి విముక్తుడనయ్యానని హనుమంతుడు తెలుసుకున్నాడు. అయినప్పటికీ అతడు రావణుడి దర్శనం కోరినవాడై, తనను బంధించిన రాక్షసులు పెట్టే బాధలను సహించాడు. అటు పిమ్మట, సీతాదేవి ఉన్న స్థలం తప్ప, మిగిలిన లంకా పట్టణాన్ని అంతటినీ దహించి, హనుమంతుడు రాముడికి సంతోషవార్త తెలియజేయడానికి తిరిగి వచ్చాడు.

"మహాబుద్ధి శాలియైన హనుమంతుడు మహాత్ముడైన రాముని సమీపించి అతనికి ప్రదక్షిణం చేసి, 'చూడబడినది సీత' అని ఉన్నదున్నట్లుగా నివేదించినాడు.

"పిమ్మట రాముడు సుగ్రీవునితో కలసి మహాసముద్ర తీరానికి పోయి, సూర్యునితో సమానమైన తేజోవంతములైన బాణాలతో సముద్రాన్ని కల్లోల పరచినాడు.

"నదులకు భర్తయైన సముద్రుడు నిజరూపంతో దర్శనమిచ్చాడు. సముద్రుని మాటలప్రకారం రాముడు నళునిచేత సముద్రంపై సేతువు కట్టించాడు.

"ఆ సేతువు ఆధారంగా, లంకాపురికిపోయి, యుద్ధమందు రావణుని చంపి సీతాదేవిని సమీపించి, ఆమెను ఏ విధంగా స్వీకరించవలెనని ఆలోచించి, హెచ్చుగా లజ్జించాడు.

"అపుడు రాముడు ప్రజల ఎదుట సీతను గూర్చి కఠినంగా మాట్లాడినాడు. ఆ సీతాదేవి పరుషములైన మాటలను సహింపలేనిదై అగ్నియందు ప్రవేశించింది.

"అగ్ని దేవుని పలుకుల వలన సీతాదేవి దోషం లేనిదని రాముడు తెలుసుకొని అందరు దేవతలచే పూజింపబడిన వాడై. చాలసంతోషించాడు.

"మహాత్ముడైన రాముడు చేసిన చాలగొప్ప పనిచేత, (రావణుని వధచేత,) జంగమస్థావరాలతో కూడిన మూడు లోకాలు, దేవతలు, ఋషులతో కలసి అందరూ, సంతోషము చెందినారు.

"రాక్షసులకు ప్రభువుగా విభీషణుని లంకయందు అభిషిక్తుని చేసి, తన పనిని నెరవేర్చిన రాముడు, మనస్తాపము పోయినవాడై చాల అధికంగా సంతోషించాడు.

"రాముడు దేవతలనుండి వరం పొంది, మూర్ఛపోయిన వానరులను తిరిగి లేపి, పుష్పకవిమానంలో తన స్నేహితులతో కలిసి, అయోధ్యకు ప్రయాణం చేసినాడు.

"సత్యపాలనయందు నిలకడగల లోకాభిరాముడైన శ్రీరాముడు భరద్వాజాశ్రమానికి పోయి, హనుమంతుని భరతుని దగ్గిరకి పంపించాడు.

"సుగ్రీవునితో కూడిన రాముడు తిరిగి జరిగిన కథను చెప్తూ పుష్పక విమానం ఎక్కి నంది గ్రామం చేరుకున్నాడు.

"పాప రహితుడైన రాముడు సోదరులతో కూడినవాడై నందిగ్రామ మందు జటలను విడిచి, సీతాదేవిని పొంది తిరిగి రాజ్యం పొందినాడు.

"లోకం గగుర్పాటు కలిగినంత సంతోషం పొందినది. సంతుష్టి చెందింది. వృద్ధి పొందింది. ఉత్తమమైన ధర్మమును పాలించింది. పీడలు లేనిదై, వ్యాధులు లేనిదై, కరువు వలన కలుగు భయం విడిచినదైనది.

"రాముడు రాజ్యం చేస్తుంటే పురుషులు తమ కొడుకుల అకాలమృత్యువును ఎప్పుడూ చూడలేదు. స్త్రీలు కూడా వైధవ్యం లేనివారై పతివ్రతలుగా ఉంటారు.

"రామరాజ్యంలో అగ్నిభయం కొంచెమైనను కలుగదు. జ్వరం వలన కూడా భయం కలుగదు. ఆకలి వలన భయం కూడా లేదు. దొంగల వలన భయముండదు.

"నగరాలు, రాష్ట్రాలు ధనధాన్యాలతో కూడి ఉంటవి. కృతయుగంలో ప్రజలు ఏ విధంగా ఉండేవారో, ఆ విధంగా ఎల్లప్పుడు చాల సంతోషంగా వారు ఇప్పుడు కూడా ఉన్నారు.

"మహాకీర్తివంతుడైన రాముడు నూర్లకొలది అశ్వమేధయాగాలు చేసి, హెచ్చుగా బంగారం దక్షిణలిచ్చి, పదివేలకోట్ల ఆవులను దానం చేసి, లెక్కింపశక్యం కాని ధనాన్ని బ్రాహ్మణులకు ఇచ్చి బ్రహ్మలోకానికి వెళ్లగలడు.

"రాముడు నూరురెట్లుగా రాజవంశాలను స్థాపిస్తాడు. లోకంలో నాలుగు వర్ణాలను తమతమ ధర్మాలయందు ప్రవర్తింపజేస్తాడు.

"రాముడు పదివేల సంవత్సరాలు, మరొక పదివందల సంవత్సరాలు, అనగా పదకొండువేల సంవత్సరాలు రాజ్యాన్ని సేవించి బ్రహ్మలోకం చేరుకుంటాడు.

"పవిత్రమైనది, పాపాలను పోగొట్టునది, పుణ్యం కలిగించునది, వేదాలతో సమానమైనది అయిన ఈ రామచరితాన్ని ఎవడు చదువుతాడో అతడు సమస్త పాపాలనుండి విముక్తుడవుతాడు.

"రామాయణమను ఈ కథను ఏనరుడు చదువుతుంటాడో అతడు కొడుకుల తోను, మనుమలతోను, తనవారితోను భోగాలనుభవించి మరణానంతరం స్వర్గాన్ని పొందుతాడు.

"ఈ రామాయణాన్ని బ్రాహ్మణుడు చదివితే సకలవిద్యలు నేర్చినట్లు ఉత్తమంగా మాట్లాడే వాడవుతాడు. క్షత్రియుడే చదివితే భూలోకానికి ప్రభువవు తాడు. వైశ్యుడు చదివితే సరకులమ్ముటలో లాభాన్ని పొందుతాడు. శూద్రుడు చదివినట్లయితే గొప్ప ధనాన్ని పొందుతాడు."

## సంక్షేపరామాయణం సమాప్తం.

శ్రీః

# శ్రీమత్ సుందరకాండ – సౌందర్య దర్శనం

## సంగ్రహ సుందరకాండ కథ

రావణుడు అపహరించిన సీతాదేవి ఎక్కడ ఉంటుందో ఆ చోటును వెదక డానికి, శత్రువులను రూపుమాప సమర్థుడైన హనుమంతుడు, చారణులు తిరిగే ఆకాశమార్గానపోదలచాడు.

సాగరం మకరాలయం – శతయోజన విస్తీర్ణమున్నది. దీనిని దాటడానికి హనుమంతుడు మహేంద్ర పర్వతం చేరుకున్నాడు. సూర్యుడికి, మహేంద్రుడికి, వాయుదేవుడికి, బ్రహ్మకు, పంచభూతాలకు ప్రణామం చేసి అతను బయలు దేర సంకల్పించాడు. తూర్పు వేపు తిరిగి తన తండ్రి అయిన వాయుదేవుడికి ముందు నమస్కరించాడు. మనసార రామునికి వందనం చేశాడు. లక్ష్మణుడికి అంజలి ఘటించాడు. నదులకు, సముద్రాలకు శిరసుతో నమస్కరించాడు. తన బంధువు లైనవానరులను కౌగిలించుకొని, వారికి ప్రదక్షిణం చేశాడు. శ్రీరాముని అభ్యుదయం పెంపుజేయడం కోసం, పర్వదినాలలో సముద్రం ఏ విధంగా పెంపు జెందుతుందో ఆ విధంగా హనుమంతుడు కొలతకు మించినట్లుగా శరీరాన్ని పెంచాడు, మహామేఘం వలె పెద్ద ధ్వని చేశాడు. తోకను గుండ్రంగా చుట్టాడు. ఆకాశం మీదికి ఎగురబోతూ గరుత్మంతుడు పామును విదలించినట్లు వంకరగా నున్న తన తోకను విదలించాడు. పెద్ద ఇనుప గుదియలవలె ఉన్న తనభుజాలను పర్వతం మీద నొక్కి పట్టి ఉంచాడు. నడుము సన్నం చేశాడు. కాళ్లను కుదించాడు. ఈ విధంగా తన బాహువులను, మెడను సంకోచ పరిచాడు.

హనుమంతుడిలో సహజంగానే తేజస్సు, బలం, పరాక్రమం అధికంగా ఉన్నాయి. అతను ఆకాశాన్ని చూస్తూ హృదయమందే ఉచ్ఛ్వాస నిశ్వాసాలను బంధించాడు. కాళ్లతో కొండను అదిమి పట్టాడు. చెవులు ముడుచుకున్నాడు. పైకి ఎగురబోయే ముందు పక్కనున్న వానరులతో ఈ విధంగా పలికాడు.

"రాముడు విడిచిన బాణం ఏ విధంగా వాయు వేగంతో ప్రయాణం చేస్తుందో, ఆ విధంగా నేను కూడా రావణుడు పాలించే లంకానగరానికి పోతాను. లంకలో సీతాదేవి కనిపించక పోతే, అదే వేగంతో స్వర్గానికి పోతాను. ఒక వేళ అక్కడకూడా ఆమె కనిపించకపోతే, ఏమీ శ్రమపడకుండా సులువుగా రాక్షసరాజైన రావణుని కట్టి తెస్తాను. అన్ని విధాల కార్యం సాధించి సీతాదేవితో తిరిగి వస్తాను. లేని పక్షంలో రావణునితో సహా లంకను పెకలించితెస్తాను."

వానరులతో ఈ విధంగా చెప్పి, మరే ఆలోచనలేకుండా హనుమంతుడు పైకి ఎగిరిపోయాడు.

మహాతేజస్వి, మహాశరీరం కలవాడు, మహావానరుడు అయిన హనుమంతుడు ఆధారం లేని ఆకాశమార్గం మీద ఎగురుతూ రెక్కలున్న పర్వతం వలె ప్రకాశించాడు.

తొందరగా ఎగురుతున్న హనుమంతుని చూసి దేవతలు, గంధర్వులు, దానవులు పూలవానలు కురిపించారు. ఋషులు నుతించారు. దేవతలు గంధర్వులు పాడారు.

ఏ మాత్రం శ్రమలేకుండా తొందరగా పోతూ ఉన్న హనుమంతుడిని చూసి నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు స్తోత్రము చేశారు. పక్షులు కూడా నుతించాయి.

సముద్రుడు ఇక్ష్వాకు వంశ గౌరవం కోరేవాడు. అతడీ విధంగా తలచాడు.

"నేను ఈ కపీంద్రునికి సహాయం చేయకపోతే అందరూ నన్ను ఆడిపోస్తారు. నేను ఇక్ష్వాకుల ప్రభువైన సగరుడిచేత పెంచబడినవాడిని. ఇతడు ఇక్ష్వాకు వంశజుడైన రామునికిదూత. ఇతడు కష్టపడరాదు. ప్రయాణం నడుమ హనుమంతుడు విశ్రమించేటట్లు చేయడం నా కర్తవ్యం.

సముద్రుడు మనసులో ఉన్నతములైన ఆలోచనలు చేసి తనలో దాగి ఉన్న బంగారు శిఖరాలు కల మైనాకుడితో ఈ విధంగా అన్నాడు.

"ఓ పర్వతశ్రేష్ఠుడా! హనుమంతుడు సీతాదేవిని వెదకుట అనే రామకార్యం మీద నీమీద నుంచిపోతున్నాడు. ఇక్ష్వాకు వంశజుడైన రాముడిని సేవించే హను మంతుడికి నేను సహాయం చేయాలి. నాకు ఇక్ష్వాకులు పూజనీయులు. నీకు

ఇంకా హెచ్చుగా పూజింపదగినవారు. హనుమంతుడు మనకు అతిథి. పూజింప దగినవాడు. కాబట్టి నువ్వు నీటి నుండి మీదకురావలసింది. నీమీద ఈ వానరుడు విశ్రమించు గాక!".

పర్వతోత్తముడైన మైనాకుడు తన బంగారు శిఖరాలతో నూరుమంది సూర్యుల కాంతితో ప్రకాశించాడు. పైకి లేచి తన ముందు నిలిచిన పర్వతాన్ని హనుమంతుడు చూశాడు.

ఉప్పు సముద్రం మధ్య అది ఒక ఆటంకమని హనుమంతుడు తలచాడు. పైకి బాగా లేచిన మైనాకుని హనుమంతుడు రొమ్ముతో పడవేశాడు. పడగొట్ట బడిన మైనాకుడు హనుమంతుని వేగం తెలుసుకొని, పులకించి, ఆనందించాడు. అతడు మనుష్య రూపాన్ని ధరించి, తన శిఖరమందే నిలబడి, ప్రీతుడై వానరునితో అన్నాడు.

"వానరోత్తమా! ఇతరులు చేయలేనిపని నువ్వు చేస్తున్నావు. రాముని కుల మందు పుట్టిన వారిచేత సముద్రుడు పెంపొందాడు. అతడు రాముని హితం కోరి నిన్ను ఆదరిస్తున్నాడు. ఆతిథ్యమివ్వడానికి నేను సముద్రునిచేత ప్రేరేపింపబడ్డాను. అందుచేత నా శిఖరాల మీద కొంచెం సేపు విశ్రమించి వెళ్లవలసింది. మంచి వాసన కలవి, రుచికరమైనవి అయిన ఈ కందమూలాలను, పండ్లను తిని కొంతసేపు విశ్రమించవలసింది.

"ఓయి వానర ముఖ్యుడా! మాకు కూడా నీతో సంబంధం లేకపోలేదు. ధర్మాన్ని ఆచరించడానికి ఎవడు శ్రద్ధచూపుతాడో, అతనికి అతిథి అనేవాడు మూఢుడైనా, తెలియనివాడైనా పూజించదగ్గవాడు. అటువంటప్పుడు నీ వంటి మహనీయుడు అతిథిగా లభిస్తే ఇక చెప్పేదేముంది?

"ఓయి వానరశ్రేష్ఠుడా! నువ్వు దేవతలలో గొప్పవాడూ, మహాత్ముడూ అయిన వాయుదేవుడి పుత్రుడివి. వేగంలో అతనికి నువ్వేసాటి. నిన్ను పూజిస్తే వాయుదేవుడు పూజలనందుతాడు. అందుచేత నువ్వు నాకు పూజింపదగినవాడవు.

"నాయనా? పూర్వం కృతయుగంలో కొండలకు రెక్కలుండేవి. అవి గరుత్మంతుడివలె, వాయువువలె వేగంతో అన్ని దిక్కులకు పోతుండేవి. పర్వతాలు

ఎగిరి ప్రయాణం చేస్తుంటే దేవతలు, ఋషులు, జనులు అందరూ, ఆ పర్వతాలు తమ మీదపడతాయన్న సందేహంతో భయాన్ని పొందేవారు. దేవేంద్రుడు కోపించి, కొండలరెక్కలను వజ్రాయుధంతో నరికివేశాడు. అతడు నామీద వజ్రాయుధాన్ని ఎత్తి సమీపించాడు. మహాత్ముడైన వాయుదేవుడు తొందరగా అక్కడ నుండి నన్ను ఉప్పు సముద్రంలోకి విసరివేశాడు. నా రెక్కలు పోకుండా, చెక్కు చెదరకుండా, నీ తండ్రి నన్ను రక్షించాడు. మహాగుణవంతుడైన వాయుదేవుడు నాకు గౌరవించ దగినవాడు. అందుచేత నిన్ను నేను గౌరవిస్తున్నాను. ఇదే నీతో నాకు గల సంబంధం. నువ్వు సంతోషించిన మనస్సుతో మా కోరికను అంగీకరించ తగుదువు."

హనుమంతుడు ఈ విధంగా బదులు పలికాడు.

"నువ్వు చేసిన ఆతిథ్యానికి సంతోషిస్తున్నాను. నీ ఆతిథ్యాన్ని స్వీకరించ లేదని కోపించకు. నేను నిర్దిష్ట కాలంలో చేయవలసిన పనిని తొందరగా చేయాలి. పగలు కూడా గడచిపోతున్నది. మధ్యేమార్గంలో నేనుండి పోరాదు."

హనుమంతుడు ఈ విధంగా చెప్పి, పర్వతాన్ని తాకి, నవ్వుతూ ఆకాశం మీదికి ఎగిరిపోయాడు.

ఆ పర్వతాన్ని చూస్తూ నిరాధారమైన నిర్మలాకాశంలో వాయుతనయుడు ప్రయాణం చేశాడు.

మైనాకుడు చేసిన పనిని చూసి దేవతలు సంతోషించారు. దేవేంద్రుడు కూడా సంతోషించాడు.

దేవేంద్రుడు సంతోషించి డగ్గుత్తికతో మైనాకుడితో అన్నాడు:

"నీ పనికి చాల సంతోషిస్తున్నాను. నీకు నేను అభయమిస్తున్నాను. ఇక మీద హాయిగా ఉండవలసింది. హనుమంతుడు నూరు యోజనాల మార్గాన్ని అతిక్రమించిపోతూ ఉంటే మేమందరం భయం పొంది ఉండగా, మంచి వాడవైన నువ్వు అతనికి సహాయం చేశావు. రామదూతకు నువ్వు ఉపకారం చేసినందుకు నేను చాల సంతోషిస్తున్నాను."

దేవేంద్రునిచేత వరమీయబడిన మైనాకుడు ఆ విధంగానే ఉండిపోయాడు.

హనుమంతుడు క్షణకాలంలో సముద్రాన్ని దాటుతూ ముందుకుపోయాడు.

ఆకాశం మీద పోతున్న హనుమంతుడిని చూసి దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, సూర్యునివలె ప్రకాశిస్తున్న నాగమాత అయిన సురసతో ఇట్లన్నారు.

"ఇతడు వాయుదేవుని పుత్రుడు. మంగళమూర్తి. సముద్రంమీద ఎగురుతున్నాడు. హనుమంతుడని పేరుగల ఇతనిని, ఒక క్షణం ఆటంకం కలిగించి, నువ్వు నిలుపవలసింది. అందుకోసం ఘోరమైన రాక్షసరూపాన్ని ధరించవలసింది. భయంకరమైన కోరలు, గోరోచనపు వన్నె కలకళ్లు, ఆకాశంతో సమానమైన నోరు ధరించి అతనిని ఆపవలసింది. ఇతని బలమెంతో, ఎంత పరాక్రమవంతుడో తెలుసుకొన కోరుతున్నాం. అతడు నిన్ను ఉపాయం చేతనే జయించాలి. లేకపోతే దుఃఖం పొందుతాడు."

సముద్ర మధ్య మందు సురస నిలిచి, అసహజము, వికృతము, ఎల్లరకూ భయం కలిగించేది అయిన రాక్షస శరీరం ధరించింది. ఎగురుతున్న హనుమంతుడికి అడ్డు నిలిచి ఆమె ఇట్లు పలికింది:

"ఓయి వానరశ్రేష్ఠుడా! దేవతలు నిన్ను నాకు ఆహారంగా నిర్దేశించారు. నిన్ను తినివేస్తాను. నా నోటిలో ప్రవేశించు."

హనుమంతుడు ఆమెకు ప్రణామం చేసి పలికాడు.

"దశరథపుత్రుడైన రాముడు, తమ్ముడైన లక్ష్మణునితోను, భార్య అయిన సీతతోను దండకారణ్యమును ప్రవేశించాడు. రాక్షసులకు బద్ధశత్రువైన ఆ రాముడు మరొక పనియందు నిమగ్నుడై ఉన్నప్పుడు, యశోవంతురాలైన అతని భార్యను రావణుడు అపహరించాడు. నేను రాముని దూతనై సీతాదేవి కడకుపోతున్నాను. నువ్వు రాముని రాజ్యమందే ఉన్నావు. అతనికి నువ్వు సహాయం చేయవలసిన దానివి. దానికి నువ్వు ఒప్పుకోకపోతే, సీతాదేవిని చూసిన తరువాత, రాముడిని కూడా చూసి వస్తాను. అపుడు నీ నోటిలో ప్రవేశిస్తాను. ప్రతిజ్ఞ చేసి సత్యమే చెప్తున్నాను.",

అపుడు సురస పలికింది:

"ఓయీ! నన్ను దాటి ఎవరూ పోరాదు. ఇది నాకు బ్రహ్మవలన లభించిన వరం. నువ్వు నానోటిలో ప్రవేశించి మరీపోవలసింది"

"నువ్వు నన్ను తినగోరితే నోరు తెరువ వలసింది." అన్నాడు హనుమంతుడు.

హనుమంతుడు పదియోజనాల పొడవు, పదియోజనాలు వెడల్పు కల వాడయాడు. అతడలా పెరగడం చూసి సురస తన నోటిని ఇరవై యోజనాలకు విస్తరించింది. ఆ విధంగా హనుమంతుడు తొంబదియోజనాల వరకు పెరిగాడు. సురసతననోటిని నూరు యోజనాల వరకు చాచింది.

నరకంతో సమానమైన తన నోటిని సురస తెరువగా, బుద్ధిమంతుడైన వాయుసుతుడు దానిని చూసి, తన శరీరాన్ని బాగా చిన్నదిగా చేసి, బొటనవేలు ప్రమాణం కలవాడై, ఆ నోటిలో ప్రవేశించి తొందరగా వెలికి వచ్చాడు. ఆకాశమందు నిలిచి శ్రీమంతుడైన హనుమంతుడీమాట అన్నాడుః

"ఓ దాక్షాయణి! నీకు నమస్కారం! నీ నోటిలో నేను ప్రవేశించాను. ఇక సీతాదేవి ఎక్కడ ఉంటుందో అక్కడికిపోతాను. నీకు బ్రహ్మ యిచ్చిన వరం కూడా సిద్ధించింది."

సురసాదేవి తన నిజరూపం ధరించి వానరుడితో పలికిందిః

"ఓయి ఋజువర్తనంకలవానరశ్రేష్ఠుడా! సంతోషంగా వెళ్లు. నీ కోరిక సిద్ధిస్తుంది. మహాత్ముడైన రామునితో సీతాదేవిని కూర్చు!"

"బాగు!బాగు!" అని భూతాలు అప్పుడు హనుమంతుని ప్రశంసించాయి.

వాయు మార్గమైన ఆకాశం మీద గరుత్మంతునివలె హనుమంతుడు ప్రయాణం చేశాడు.

సముద్రాన్ని దాటుతున్న హనుమంతుడిని చూసి సింహిక అన్న రాక్షసి సంతోషంతో ఉప్పొంగి ఈ విధంగా తలచిందిః

"ఎంతో కాలం తరువాత నాకు ఆహారం లభించింది. ఈ మహాప్రాణి చాలాకాలం తరువాత నాకుచిక్కింది."

ఆ సింహిక హనుమంతుని నీడను పట్టుకొని లాగింది. తన నీడ లాగ బడుతూ ఉంటే హనుమంతుడు ఈ విధంగా తలచాడు:

"ఏ విధంగా సముద్రంలో పెద్ద ఓడ ప్రతికూలమైన గాలిచేత వెనుకకు ఈడ్వబడుతుందో, ఆ విధంగా నేను పరాక్రమమంతా కోల్పోయి తొందరగా వెనుకకు లాగబడుతున్నాను."

సముద్రంనుండి పైకి లేస్తున్న మహాప్రాణి నొకదానిని హనుమంతుడు చూశాడు. సుగ్రీవుడు దాని గురించే చెప్పాడు. ఆ జంతువు మహాబలం కలదని, నీడను పట్టిలాగుతుందని అతను చెప్పాడు. ఆ మహాసత్త్వం సింహిక అని హనుమంతుడు తెలుసుకున్నాడు.

వర్షాకాలంలో మేఘం వలె హనుమంతుడు తన దేహాన్ని పెంచాడు. సింహిక తన నోటిని చాచి ఆ కపిని తరుమజొచ్చింది. హనుమంతుడు ఆమె పెద్ద నోటిని, ప్రాణ స్థానాలను దర్శించాడు. ఒక్క క్షణం తన శరీరం చిన్నదిగా చేసి తెరిచిన ఆమె నోటియందు ప్రవేశించాడు.

హనుమంతుడు సింహిక ప్రాణస్థానాలను వాడియైన గోళ్లతో చీల్చి వేగంగా పైకెగసిపోయాడు. హృదయం చీల్చబడిన సింహిక ఆర్తయై నీళ్లలో పడిపోయింది. ఆమెను చంపడానికే బ్రహ్మ హనుమంతుడిని సృష్టించాడు.

ఆకాశమందు తిరుగుతున్న భూతాలు హనుమంతుడిని ప్రశంసించాయి.

పిమ్మట హనుమంతుడు ఆకాశం చేరుకొని ప్రయాణం సాగించాడు.

నూరుయోజనాలు గడచిన తరువాత అతడు ఒడ్డును చేరి అన్ని వేపులను చూసి, తోటల సమూహాన్ని దర్శించాడు. వానర శ్రేష్ఠుడైన హనుమంతుడు పైన ఎగురుతునే లంకాద్వీపాన్ని మలయపర్వతమందలి తోటలను చూశాడు. అతడు సముద్రాన్ని, దాని తీరమందున్న మడుగులను, మడుగుల పక్కనున్న సాగర తీరమందలి చెట్లను, సాగరుని భార్యలైన నదుల ముఖాలను చూశాడు.

చాల పెద్ద మేఘం వలె ఆకాశాన్ని అడ్డగిస్తున్నట్లున్న తన దేహాన్ని చూసుకొని, బుద్ధిశాలియైన హనుమంతుడు ఈ విధంగా తలచాడు:

"నా వేగాన్ని, పెరిగిన నా శరీరాన్ని రాక్షసులు చూశారంటే, నేనెవడినో

తెలుసుకోవాలని కుతూహలం చూపిస్తారు."

అపుడు హనుమంతుడు పర్వతం వలెనున్న తన శరీరాన్ని చిన్నదిగా చేసుకొని, అజ్ఞానం తొలగిపోయిన జీవుడివలె, తన సహజరూపాన్ని ధరించాడు.

హనుమంతుడు తన శరీరాన్ని చిన్నదిచేసి, సముద్రతీరంచేరి, లంబగిరి శిఖరంపై నున్న లంకను చూసి, మృగాలను పక్షులను భయపెడుతూ పర్వతం మీద దిగాడు.

దానవులు, పన్నగులు ఉన్నట్టిది, పెద్ద అలలతో కూడినది, అయిన మహాసముద్రాన్ని బలంతో దాటి, తీరాన్ని చేరి, అక్కడ అమరావతి వలె ఉన్న లంకా పట్టణాన్ని హనుమంతుడు దర్శించాడు.

మహాబలుడైన హనుమంతుడు దాట శక్యంకాని సముద్రాన్ని దాటి ఏ శ్రమా లేని వాడై త్రికూట శిఖరమందున్న లంకను దర్శించాడు.

అతడు లంబగిరి మీద నిలిచి కొండ శిఖరమందున్న లంకను చూశాడు. అగడ్తలతోను, వాటిలో ఉండే తామరపూలతో, కలువలతోను అలంకరింపబడి రావణునిచే పాలింపబడుతున్న లంకను యశోవంతుడైన హనుమంతుడు చేరాడు.

సీతను అపహరించితేవడం చేత రావణుడు లంకను బాగా రక్షిస్తున్నాడు ఘోరములైన ధనస్సులను ధరించి, అంతటా సంచరించుతున్న రాక్షసులు లంకను కాపాడుతున్నారు.

హనుమంతుడు ఘనంగా రక్షింపబడుతున్న లంకను, సముద్రాన్ని చూసి, భయంకరమైనవాడు, శత్రువు అయిన రావణుని తలచుకొని ఈ విధంగా విచారించాడు.

"ఇక్కడికి ఇతరవానరులు వచ్చినా ప్రయోజనం లేదు. దేవతలు కూడా యుద్ధంలో లంకను జయించలేరు. రావణుడు పాలిస్తున్న ఈ లంక చాల క్లిష్టమైనది. చొరరానిది. మహాబాహువైన రాముడు ఇక్కడికి వచ్చినా దీనిని ఏం చేయగలడు? రాక్షసులు అసురప్రకృతులు. వారికి సాంత్వము చెల్లదు. పోనీ దానమనుకున్నా లాభం లేదు. బలదర్పితులు కాబట్టి భేదం కూడా పనిచేయదు. వీరు బుద్ధి, పరాక్రమం కలవారు. వీరిని యుద్ధంలో నిగ్రహించడం కష్టమే.

"వానరులలో గొప్పవారైన నలుగురికే ఈ లంకను చేరడం సాధ్యమవుతుంది. వాలిపుత్రుడైన అంగదుడు, నీలుడు, రాజయిన సుగ్రీవుడు, నేను - ఈ నలుగురమే ఇక్కడికి చేరగలం.

"సీతాదేవి బ్రతికి ఉందో లేదో ముందు తెలుసుకొని, ఆమెను చూసి, తరువాత కర్తవ్యం ఆలోచిస్తాను."

హనుమంతుడు రాముని అభ్యుదయమందు ఆసక్తి కలవాడు. ఒక్క క్షణం అతను కొండశిఖరంపై కూర్చుండి ఆలోచించాడు.

"ఈ రాక్షసుల నగరం ఈ రూపంతో నేను ప్రవేశించకూడదు. రాక్షసులచేత ఈ నగరం రక్షింపబడుతున్నది. వాళ్ళు తీవ్రమైన ఉత్సాహం కలవారు. మహాశక్తి సంపన్నులు. బలవంతులు - సీతాదేవిని వెదకేటప్పుడు వీరి నందరిని వంచించాలి.

"అంతపెద్ద వాడినీకాక అంతచిన్నవాడినీ కాక - వీటికి భిన్నమైన రూపంలో రాత్రివేళ లంకాపురిని ప్రవేశించి, మహత్కార్యం నేను సాధించేకాలం సంప్రాప్త మయింది."

దేవతలకు దానవులకు ఎదిరించడానికి వీలులేనట్టి విధంగా నిర్మింపబడిన ఆ నగరాన్ని చూస్తూ, మాటిమాటికి నిశ్వసిస్తూ హనుమంతుడు ఆలోచించాడు.

"రాక్షసేశ్వరుడు, దురాత్ముడు అయిన రావణుడు చూడకుండా ఏ ఉపాయం చేత జనకుని కూతురైన సీతాదేవిని చూడగలను? ఆత్మ విదుడైన రాముని కార్యం ఏ విధంగా చేస్తే నశించదు? జానకీదేవి ఒంటరిగా ఉండగా నేనొక్కడిని ఏ విధంగా చూడగలను?

"అనాలోచితంగా కొందరు పనులు చేస్తారు. దాదాపు పూర్తి అయిన పనులు కూడా వారి చేతుల్లో నశిస్తాయి. సూర్యోదయమవుతున్నప్పుడు చీకటి ఏ విధంగా నశిస్తుందో, ఆ విధంగా అనాలోచితంగా దూత చేసిన పనులు నశిస్తాయి. దూతలు తాము పండితులమని భావించి పనులను నాశనం చేస్తారు.

"రామకార్యం చెడకుండా ఎలా అవుతుంది? నా మనస్సు సంక్షోభం పొంద కుండా ఎలా ఉంటుంది? నేను సముద్రాన్ని దాటడం వృథాకాకుండా ఎలా ఫలి స్తుంది?

"నన్ను రాక్షసులు చూస్తే రామునికార్యం వ్యర్థమవుతుంది. నేను రాక్షస రూపం ధరిస్తే, రాక్షసులకు తెలియకుండా ఎక్కడా ఉండడానికి వీలుపడదు. మరే రూపం దాల్చినా వాళ్ళు సులువుగా తెలుసుకుంటారు. ఈలంకలో గాలికూడా రాక్షసులకు తెలియకుండా వీచదు.

"స్వంతమైన నా రూపంతో ఇక్కడ దాగుందునా తప్పక వినాశాన్ని పొందుతాను. అందుచేత సంకోచపరచిన రూపంతో, రాత్రివేళ లంకలో ప్రవేశిస్తాను. రావణుని భవనమంతా వెదకి జనకసుతయైన సీతాదేవిని కనుగొంటాను."

సూర్యుడస్తమించి రాత్రికాగానే హనుమంతుడు తన శరీరాన్ని చిన్నదిగా చేసి, పిల్లి అంతవాడై, చూపరులకు ఆశర్యం కలిగించాడు.

పెద్దపెద్ద రాజమార్గాలు కలది, సుందరమైనది లంక. ప్రదోష కాలంలో దానిని ప్రవేశింప హనుమంతుడుద్యమించాడు.

అక్కడ భవనాలు బారులు తీర్చి ఉన్నవి. వాటి స్తంభాలు బంగారంతోను వెండితోను చేసినవి. కిటికీలు కూడా బంగారంతో చేసినవే. వీటి అన్నిటితో లంక గంధర్వ నగరంతో సమానంగా ఉంది.

మహావానరుడైన హనుమంతుడు ఊహించనలవికానిది, అద్భుతమైన ఆకారం కలది అయిన లంకను చూసి ఒకసారి దుఃఖించి, మరోసారి ఆనందించి, సీతాదేవిని చూడాలని ఉవ్విళ్లూరాడు.

అపుడు చంద్రుడు కూడా లంకతో స్నేహం చేస్తున్న వాడివలె చుక్కల నడుమ వెలుగుతూ, తన వెన్నెలతో లోకాన్ని ప్రకాశింపజేస్తూ, అనేకవేల కిరణాలతో ఉదయించాడు.

శంఖం వంటి ధవళకాంతిగలవాడు, పాలరంగుతోను, తామరతూళ్లరంగుతో ఒప్పేవాడు, సరస్సు నుండి పైకెగురుతున్న హంసకు మల్లే ఉన్నవాడు అయిన చంద్రుడిని ఆవానరశ్రేష్ఠుడు చూశాడు.

మేధావియైన మారుతాత్మజుడు ఎత్తుగా నున్న లంబగిరి శిఖరం మీద తన బలాన్ని సమకూర్చుకున్నాడు.

మనోహరములైన వనాలతోను, జలాశయాలతోను నిండినది, రావణుని చేత పాలింపబడుతున్నది అయిన లంకాపురిని మహాబలశాలియైన వానరశ్రేష్ఠుడు రాత్రివేళ ప్రవేశించాడు.

లంక శరత్కాలపు మేఘాలవలె తెల్లగా నున్న భవనాలతో శోభిల్లుతూ ఉంది. బలిష్ఠులైన సైనికులతో కుబేరపురమైన అలకవలె ఉన్నది. మంగళకరమైనది, సర్పాల సంచారం కలిగిన భోగవతీ నగరం వలె నున్న లంక రహస్యంగా కాపాడబడు తున్నది.

లంక, మెల్లగా వీచే గాలులతో, ఇంద్రుని పట్టణమైన అమరావతి వలె ఉంది. బంగారపు ప్రాకారం చేత పరివేష్టితమై ఉంది.

చిరుగజ్జల మోతగల టెక్కాలతో అలంకరింపబడిన ప్రాకారాన్ని తొందరగా హనుమంతుడు చేరుకొని సంతోషం పొందినాడు.

క్రౌంచపక్షుల ధ్వనులతోను, నెమళ్లకూతలతోను, రాజహంసల సంచారం తోను, వాద్యధ్వనులతోను, ఆభరణాల చప్పుళ్లతోను అంతటను లంక మారు మ్రోగుతున్నది.

ఆ లంకసుందరమైనది, ఉత్తమోత్తమమైనది, సంపదలచేత సమృద్ధిని పొందినది, మంగళకరమైనది, రాక్షసులరాజైన రావణుని నగరమది. దానిని చూసి బలవంతుడైన హనుమంతుడు ఈ విధంగా ఆలోచించాడుః

"ఈ లంకానగరాన్ని, ఎప్పుడూ ఆయుధాలు ధరించిన రావణుని సైనికులు రక్షిస్తున్నారు. దీని నెవరూ బలంతో జయించలేరు.

"ఈ లంకాపురి కుముదుడికి, అంగదుడికి, మహావానరుడైన సుషేణుడికి, మైందునికి, ద్వివిదునికి బాగా తెలిసే ఉంటుంది.

"సూర్య పుత్రుడైన సుగ్రీవుడికి, కుశపర్వణుడనే వానరునికి, ఋక్షునికి, కేతుమాలునికి, నాకు, ఈ నగరం చేరదగినది."

అపుడు మహాభుజుడైన హనుమంతుడు రాఘవుని పరాక్రమాన్ని, లక్ష్మణుని విక్రమాన్ని సమీక్షించి సంతుష్టుడయాడు.

మహాబలుడు, కపిశ్రేష్ఠుడు అయిన మారుతి లోనికి ప్రవేశిస్తూ ఉంటే లంకా నగరాధిదేవత తన నిజ రూపాన్ని ధరించి చూసింది.

రావణునిచేత పాలింపబడుతున్న ఆ లంక హనుమంతుని చూసి, అతని ఎదుట వికృతమైన ముఖంతోను, కళ్లతోను కనిపించింది.

ఆ లంక వానరశ్రేష్ఠుడైన వాయుపుత్రుని ముందు నిలిచి, చాలపెద్దగా ధ్వనిచేస్తూ అతనితో ఈ విధంగా పలికింది.

"అరణ్య వాసివైన కోతీ! నువ్వెవడవు? ఏ పనిమీద ఇక్కడికి వచ్చావు? నీ ప్రాణాలు ఉన్నంతలో నిజం చెప్పవలసింది. రావణుని సేనలచేత రక్షింపబడి అంతటను కాపాడబడుతున్న ఈ లంక నువ్వు ప్రవేశించరానిది."

తన ఎదుట నిలిచిన ఆమెతో హనుమంతుడిట్లన్నాడు.

"వికృతమైన కన్నులతో పురద్వారమందు నిలుచున్న నువ్వెవతెవు? భీకరమైన రూపంతో నన్ను ఎందుకోసం అడ్డగించి, బెదిరిస్తున్నావు?"

హనుమంతుని వాక్యాన్ని విని, కామరూపిణియైన లంక కోపగించి పరుషమైన వాక్యాన్ని హనుమంతుడితో పలికింది.

"మహాత్ముడు, రాక్షసరాజు అయిన రావణుని ఆజ్ఞను నేను పాలించే దానను. నన్ను దాట నీకు శక్యం కాదు. నేనీ నగరాన్ని రక్షిస్తున్నాను. నన్ను లక్ష్యం చేయకుండా నువ్వు నగరంలోకి ప్రవేశించడానికి వీలులేదు. నువ్వీ దినం నాచేతులలో చచ్చి, ప్రాణాలు విడుస్తావు. దీర్ఘంగా నిద్రిస్తావు. ఓయి, వానరుడా! నేను స్వయంగా లంకనే. నేనీ నగరాన్ని అన్ని వేపుల నుండి కాపాడుతున్నాను. ఇదే నీకు చెప్తున్నాను."

హనుమంతుడు లంకమాటలు విని యుద్ధానికి సిద్ధపడి పర్వతం వలె ఆమె ఎదుట నిలిచాడు. స్త్రీ రూపంలో చాలవికారంగా కనబడుతున్న ఆ లంకను హనుమంతుడు చూసి ఇలా అన్నాడు.

"కోట బురుజులు , ప్రాకారాలు, బహిర్ద్వారాలు కల లంకానగరాన్ని నేను చూస్తున్నాను. అందుకోసమే నేనిక్కడికి వచ్చాను. నాకు చాల ఆశ్చర్యం కలుగు

తున్నది. లంకలోని వనాలు, ఉపవనాలు, అరణ్యాలు, ముఖ్యమైన ఇళ్లు చూడడానికే నేను వచ్చాను."

హనుమంతుడి మాటలు విని కామరూపిణియైన లంక పరుషంగా మాట్లాడింది.

"వానరాధమా! దుర్బుద్ధికలవాడా! రాక్షసరాజు చేత పాలింపబడుతున్న ఈ పట్టణాన్ని నేడు నువ్వు చూడడానికి వీలులేదు."

హనుమంతుడు రాక్షసియైన లంకతో ఇట్లు పలికాడు:

"ఓ మంగళరూపిణీ! ఈ నగరాన్ని దర్శించి, వచ్చినతోవనే నేను వెళ్లిపోతాను."

అపుడా లంక భయం పుట్టించే మహా శబ్దంచేసి, వేగంగా, తన అరచేతితో కపివరుడైన హనుమంతుడిని కొట్టింది.

లంకచే కొట్టబడిన హనుమంతుడు మహాశబ్దం చేశాడు. అతను విపరీతమైన కోపంతో తన ఎడమ చేతి వ్రేళ్లను ముడిచి, పిడికిలి పట్టి ఆమెను కొట్టాడు.

ఆమె స్త్రీయని తలచి హనుమంతుడు ఆమెపై మిక్కిలి కోపించలేదు. హనుమంతుని పిడికిలి పోటుతో ఆమె వికారం చెందిన శరీర భాగాలు కలదై, వికృతి చెందిన ముఖం చూపిస్తూ వేగంగా భూమిమీద పడిపోయింది. ఆమె స్త్రీయని తలచి తేజస్వియైన హనుమంతుడు ఆమె మీద దయదలచాడు. అపుడు లంక మరింత భయంతో, డగ్గుత్తికతో గర్వముడిగిన మాటలను పలికింది:

"ఓయి మహాభుజుడవైన హనుమంతుడా! వానరశ్రేష్ఠుడా! నా యందు ప్రసన్నుడవుకావలసింది. నన్ను రక్షించు.

"ఓయి సౌమ్యుడా! ధైర్యవంతులు, మహాబలులు స్త్రీలను చంపరాదన్న నియమం పాటిస్తారు. నేనే నీకు కనిపిస్తున్న లంకాపురిని. పరాక్రమవంతుడవైన నీచేత ఓడిపోయాను. వాస్తవంగా జరిగినదొకటి చెప్తున్నాను,వినవలసింది.

"నాకు బ్రహ్మ స్వయంగా యిచ్చిన వరమొకటి ఉంది. 'ఎప్పుడైతే ఎవడో ఒక వానరుడు పరాక్రమించి నిన్ను వశం చేసుకుంటాడో అపుడు రాక్షసులకు

భయపడవలసిన కాలం వచ్చిందని నువ్వు తెలుసుకోవలసింది' ఓయి సౌమ్యుడా! ఇపుడు నిన్ను చూస్తుంటే ఆ కాలం సంప్రాప్తమయిందని తెలుస్తున్నది.

"బ్రహ్మ ఆనతి సత్యమైనది. దానికి తిరుగులేదు. సీతాదేవి కారణంగా దురాత్ముడైన రావణరాజుకు, అందరు రాక్షసులకు వినాశకాలం దగ్గిర పడింది కాబట్టి, ఓ వానరశ్రేష్ఠుడా! రావణునిచే పాలింపబడుతున్న లంకాపురిని ప్రవేశించు. ఏయే కార్యాలను నువ్వు చేయగోరుతున్నావో వాటి నన్నిటిని ఆచరించు. రాక్షస రాజు చేత పాలింపబడుతున్నది, మంగళకరమైనది, శాపముచే కొట్టబడినది అయిన లంకాపురిని ప్రవేశించి సుఖంగా అంతటనూ తిరుగుతూ పతివ్రతయైన సీతాదేవిని వెదుకవలసింది."

మహాతేజస్సు కల హనుమంతుడు శ్రేష్ఠురాలు, కామరూపిణి అయిన లంకను జయించి, లంకానగరం ప్రవేశించి, ఎక్కడయితే ద్వారం లేదో ఆ చోట ప్రాకారాన్ని దాటాడు. తన ఎడమపాదం శత్రువుల శిరస్సుపై ఉంచినట్లు, రాత్రివేళ మారుత పుత్రుడైన హనుమంతుడు లంకలో ప్రవేశించాడు.

ముత్యాలతోను, పూవులతోను ప్రకాశిస్తూ ఉన్న రాజమార్గం పట్టి లంకా పురిలో వెళ్లాడు.

లంక యందలి గృహాలు వాద్యఘోషలు కలవి. నవ్వుల ధ్వనులతో కూడినవి. ఐరావతమువలె తెల్లనివి. వజ్రాలతో అలంకరింపబడిన కిటికీలు కలవి.

అక్కడి యిళ్లు తెల్లని మేఘాలవంటివి. చిత్ర విచిత్రములైనవి. పద్మమూ, స్వస్తికమూ వీటితో కూడినవి. వర్ధమానమనులక్షణం కలవి. అటువంటి యిళ్లతో లంక, అంతటా అలంకరింపబడి ఉంది.

రంగు రంగుల మాలికలతోను, ఆభరణాలతోను వెలుగొందు ఆ లంకను, వానరరాజైన సుగ్రీవునికి హితం కూర్చువాడు, శ్రీమంతుడు అయిన హనుమంతుడు శ్రీరాముని కోసం చూశాడు, సంతోషించాడు కూడా.

ఒక యింటి నుండి మరో యింటికిపోతూ, పలు ఆకారాలున్న భవనాలను అక్కడక్కడ చూశాడు.

రొమ్ము, కంఠం, శిరస్సు - ఈ మూడు చోట్ల నుండి పుట్టిన స్వరాలతో

శోభిల్లు మధురగీతాన్ని మదవతులు, అప్సరలవలె ఉన్నవారు అయిన స్త్రీలు పాడగా విన్నాడు హనుమంతుడు.

మహాత్ముల భవనాలయందు మొలనూళ్ల చప్పుడు, కాలియందెలధ్వని, మేడమెట్లెక్కుతున్న ఆడువారి మట్టెలచప్పుడు అతను విన్నాడు.

చేతులను వ్యత్యస్తంగా చేసుకొని భుజాలను తట్టినప్పుడు వచ్చే ధ్వనిని, సింహనాదాలను, రాక్షసగృహాలలో జపం చేస్తున్నప్పుడు చదివే మంత్రాలను హనుమంతుడు విన్నాడు.

స్వాధ్యాయ నిరతులు, యతుధనుని పుత్రులు అయిన రాక్షసులను, గర్జిస్తూ రావణుని కీర్తిని పాడుతున్న వారిని, అతడు చూశాడు.

రాజమార్గం చుట్టూ నిలిచిన గొప్ప రాక్షసులను, నగరమధ్యభాగంలో నున్న చాలమంది చారులను అతడు చూశాడు.

దీక్షలో నున్నవారిని, జడలుదాల్చినవారిని, బోడితలలవారిని, ఎద్దుతోలు కట్టుకున్న వారిని, పిడికిలినిండ దర్భలనే ఆయుధాలను పట్టుకున్న వారిని, హోమాలు చేస్తున్న వారిని అతడు చూశాడు.

భయంకరమైన వారిని, వివిధాకృతులు కలవారిని, అందమైన వారిని చక్కని తేజస్సు కలవారిని, పలురకాల ఆయుధాలు ధరించినవారిని, పలు వేషాలు ధరించిన వారిని, ఏమరుపాటు లేకుండా నగరమధ్య భాగాన్ని, అంతఃపురం ఎదుటను రక్షిస్తున్న లక్షమంది సైనికులను హనుమంతుడు చూశాడు.

కొండ కొనపై నున్నది, గొప్ప బంగారు బహిర్ద్వారాలు కలది, విఖ్యాతి చెంది నది అయిన రాక్షసేంద్రుని ప్రాసాదాన్ని హనుమంతుడు చూశాడు.

యతుధనుని పుత్రులైన రాక్షసులు వేలకొలది రక్షించుతున్నట్టి రావణుని యింటి రహస్యద్వారాన్ని మహావానరుడైన హనుమంతుడు ప్రవేశించాడు.

పిమ్మట బంగారంతో చేసినది, చాలవెలగల ముత్యాలు, మణులు – వీటితో అంతటను అలంకరింపబడినది, మేలైన నల్లని అగరు, చందనం పూయ బడినది అయిన రావణుని అంతఃపురం హనుమంతుడు ప్రవేశించాడు.

జనుల పాపాలను పోగొట్టేవాడు, మహాసముద్రాన్ని కూడా వృద్ధి చేసేవాడు, సకల ప్రాణులను ప్రకాశింపజేసేవాడు, ఆకాశం మీద పోతున్నవాడు అయిన చంద్రుని హనుమంతుడు చూశాడు.

వెండి పంజరంలో హంస ఏ విధంగా ఉంటుందో, మందరపర్వత గుహలో సింహం ఎలా ఉంటుందో, మదించిన ఏనుగునెక్కిన వీరుడెలా ఉంటాడో, ఆ విధంగా ఆకాశమందున్న చంద్రుడు అధికంగా ప్రకాశించాడు.

వాడియైన కొమ్ములు కల తెల్లని ఎద్దువలె, ఎత్తైన శిఖరం కల తెల్లని పెద్ద కొండవలె, బంగారు తొడుగు దంతాలకు వేసిన ఐరావతం వలె సకల కళాపరిపూర్ణుడైన చంద్రుడు ప్రకాశించాడు.

వీనులకు సుఖం కలిగించే వీణాది వాద్యాలు వినిపిస్తున్నవి. పతివ్రతలైన స్త్రీలు భర్తలతో నిద్రిస్తున్నారు. మిక్కిలి ఆశ్చర్యం, భయం కలిగించే ప్రవృత్తికల రాక్షసులు కూడా విహరించడానికి మొదలు పెట్టారు.

బుద్ధిమంతుడైన హనుమంతుడు రాక్షసుల గృహాలను చూశాడు. రథాలు, అశ్వాలు, ఉత్తమాసనాలు - ఇవికాక వీరలక్ష్మితో కూడా ఆయిళ్లు నిండి ఉన్నవి.

రొమ్ములు విరుచుకుంటున్న వాళ్లు, భార్యలశరీరాలపై చేతులు కాళ్లు మొదలైన అవయవాలను వేసినవాళ్లు, చిత్రచిత్రములైన రూపాలను ధరించిన వాళ్లు, బలిష్ఠములైన విండ్లను ఎక్కుపెట్టి తిరుగువాళ్లు అయిన రాక్షసులను హను మంతుడు చూశాడు.

కొందరు స్త్రీలు శరీరాలకు చందనం పూసుకుంటున్నారు. మరికొందరు మళ్లా నిద్రిస్తున్నారు. చక్కని ముఖాలు కల కొంతమంది వనితలు నవ్వుతున్నారు. మరికొందరు కోపం చెంది నిట్టూరుస్తున్నారు.

ఘీంకరిస్తున్న మహాగజాలచేత, బాగుగా పూజింపబడిన సత్పురుషుల చేత, తమకు సరియైన ప్రతిద్వంద్వులు లేరని విశ్వసిస్తున్న వీరులచేత, నిట్టూరుస్తున్న పాములు నిండిన మడుగువలె ఆ పట్టణం కనిపించింది.

అపుడు కపిశ్రేష్ఠుడు హనుమంతుడు ప్రియులను పొందిన మనోహారిణు

లైన స్త్రీలను, చాలసంతుష్టలైన సుందరాంగులను, ప్రముదితలైన పరమ సౌందర్య వతులను చూశాడు.

రాక్షస స్త్రీల ముఖపంక్తులు చంద్రకాంతి చేత ప్రకాశవంతములుగా ఉన్నవి. వారి చక్కని నేత్ర సముదాయం వంకరయైన కనుబొమలతో ఉన్నది. వారి ఆభరణాల సమృద్ధిని, మెరుపు తీగలవలె అందమైన హారాలనూ హనుమంతుడు చూశాడు.

అంతేకాని, పరమసౌందర్యవతి, సన్మార్గ నిష్ఠమైన రాజకులమందు పుట్టినది, పూచిన తీగవలె చక్కని పుట్టుకగలది, తన సంకల్పముచేతనే జన్మించినది అయిన సీతాదేవిని మాత్రం హనుమంతుడు చూడలేకపోయాడు.

సనాతనమైన పాతివ్రత్యమనే ధర్మమార్గాన్ని అవలంబించినది, రాముని చూడగోరినది, మన్మథావేశాన్ని పొందినది, తననే తలచే రాముని హృదయమును ప్రవేశించినది, ఉత్తమ స్త్రీలలో శ్రేష్ఠురాలు, రామవిరహమనే తాపం చేత పీడింప బడినది, పూర్వం శ్రేష్ఠమైన నిష్కమనే ఆభరణాన్ని కంఠమున ధరించినది, ఇపుడు ఎడతెగని కన్నీరే ఆభరణముగా కలది, సుందరమైన కనురెప్ప వెండ్రుకలు కలది, చక్కని కంఠస్వరం కలది, అడవిలో నృత్యం చేస్తున్న మయూరివలె ఉన్నది, స్పష్టముగా అగుపడని చంద్రరేఖవలె ఉన్నది, ధూళిచేత కప్పబడిన బంగారు కడ్డీవలె ఉన్నది, బాణంలోపలికి గుచ్చుకోగా దానిని పెరికివేసేటప్పుడు లోపల ఒక ముక్క ఉండిపోయి పైనున్న గాయం మందులచే మానిపోతే ఎలా బాధగా ఉంటుందో ఆ విధంగా కనిపిస్తున్నది, గాలికి ముక్కలుగా చేయబడిన మేఘరేఖ వలె ఉన్నది, మనుష్యులకు రాజూ మాటాడు వారిలో గొప్పవాడూ అగు రాముని భార్య అయిన సీతాదేవిని చాలకాలం వెదకి, ఆమె కనిపించక పోగా హనుమంతుడు మందుడివలె దుఃఖితుడైనాడు.

కామరూపం ధరించిన హనుమంతుడు విమానాలయందు సీతాదేవిని కానక, మరల లంకనంతటిని తొందరగా తిరిగాడు. అపుడు రాక్షస రాజు భవనం ప్రవేశిం చాడు. ఘోర రూపులైన రాక్షసులు ఆభవనాన్ని రక్షిస్తున్నారు.

వెండితో నిర్మింపబడినవి, బంగారంతో అలంకరింపబడ్డవి, వివిధ వర్ణాలు కలవి ఆ భవన బహిర్ద్వారాలు. పలు విధాలైన గదులతోను, సుందరమైన ద్వారా

లతోను కూడినది ఆ భవనం. అక్కడ ఏనుగుల మీద ఎక్కినవాళ్ళు, శూరులు, శ్రమను పొందనివారు అయిన ప్రధాన పురుషులున్నారు. అక్కడ గుఱ్ఱాలు వధింప శక్యం కానివి, రథాలకు పూన్చ దగినవి. అక్కడి రథాలు సింహాల చర్మాల తోను, పులితోళ్లతోను కప్పబడ్డవి, దంతంతోను, బంగారంతోను, వెండితోను నిర్మింపబడినవి, ఎల్లప్పుడూ తిరగడంచేత శబ్దం చేస్తున్నవి. విచిత్రములైనవి.

ఆ రాక్షసరాజైన రావణుని నివాసం అనేక రత్నాలతోకూడినది, శ్రేష్ఠము లైన ఆసనాలు, గదులు కలది; మహారథులైన రాక్షసులకు ఆవాసమైనది; మహా రథముల గొప్ప శబ్దం కలది; సుందరములూ మహాకృతికలవీ అయిన నానా విధ జంతువులు పక్షులు వేనకు వేలుగా అంతట సంచరించుతున్నది; సుశిక్షితులు, బాహ్య రక్షకులు అయిన రాక్షసులచేత బాగా రక్షింపబడినది; ముఖ్యులు అభిజాతలగు సుందరస్త్రీలు అంతటా నిండి ఉన్నది; సంతుష్టలైన ఉత్తమస్త్రీలనే రత్నాలు కలది; ఉత్తమమైన ఆభరణాల సముదాయం చేత సముద్ర ఘోషవలె ధ్వనిస్తున్నది.

ఇంకా ఆ భవనం ఛత్రచామరాది లాంఛనాలు కలది; శ్రేష్ఠములైన అగరు చందనాది లేపన ద్రవ్యాలు కలది; మహారణ్యం సింహాలతో ఉన్నట్లు గొప్ప జనులతో నిండినది; భేరులు, మృదంగాలు - వీటి మ్రోత కలది; శంఖధ్వనితో ఘోషించుతున్నది; నిత్యం గంధపుష్పాదులతో అర్చింపబడుతున్నది; పర్వాల యందు హోమాలు జరిగేటట్టిది; ఎప్పుడూ రాక్షసుల చేత పూజింపబడేది; అటువంటి భవనాన్ని మహావానరుడైన హనుమంతుడు చూశాడు.

లంకకే ఆ భవనం ఆభరణమని హనుమంతుడు తలచాడు. దానికి దగ్గరగా అతడు సంచరించాడు. రాక్షసుల గృహాలలో ఒకదాని నుండి మరొక దానికి పోయి, వారి ఉద్యానవనాలు ఒకటి తరువాత ఒకటి చూశాడు.

"ఎవరో రాక్షసస్త్రీలు సీతాదేవిని రక్షిస్తూ ఉంటారు. మైథిలి ఎటువంటి రూపం కలది? ఇంతకు ముందు విదేహ రాజైన జనకుని కూతురిని నేను చూడలేదే! కొన్ని చేష్టలచేత, అనుమానాలచేత సీతాదేవిని తెలుసుకోవలసి వస్తుంది." ఈ విధంగా అపుడు హనుమంతుడు ఆలోచించాడు. రామునికి ప్రియమైన కోరిక ననుసరించి సీతాదేవిని వెదకాడు.

రాక్షసుల ఇంటినుండి ఇంటికి, ఉద్యానవనాలను, వానరుడు వెదకాడు.

జంకు లేకుండా గృహాలను చూస్తూ అతడు సంచరించాడు.

మహావేగవంతుడైన హనుమంతుడు ప్రహస్తుని ఇంటి వద్ద దిగాడు. పిమ్మట మహాపార్శ్వుని ఇంటివద్ద దిగాడు; తరువాత మేఘంవలె ఉన్నతుడైన కుంభకర్ణుని యింటికి పోయినాడు. పిమ్మట విభీషణుని ఇంటికి, మహోదరుని యింటికి విరూపాక్షుని యింటికి ఆ మహావానరుడు ఎగిరాడు.

విద్యుజ్జిహ్వుని భవనానికి, విద్యున్మాలి భవనానికి, వజ్రదంష్ట్రుని భవనానికి ఆ మహాకపి పోయాడు.

జంబుమాలి, సుమాలి, రశ్మికేతువు, సూర్య శత్రువు – వీరి భవనాలకు వానరోత్తముడు వెళ్లాడు.

పిమ్మట వజ్రకాయుడు, ధూమ్రాక్షుడు, సంపాతి, విద్యుద్రూపుడు, భీముడు, ఘనుడు, విఘనుడు, శుకనాసుడు, వక్రుడు, శఠుడు, వికటుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, నాది, విద్యుజ్జిహ్వుడు, ఇంద్రజిహ్వుడు, హస్తిముఖుడు, కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు, ఉగ్రవక్త్రుడు, ఘోరుడు, ఘోరరావుడు – మొదలైన రాక్షసుల గృహాలకు వరుసగా పోయి, వారి వైభవోపేతములైన భవనాలయందు వారి పెంపు చెందు సంపదలను ఆ మహాయశశ్శాలియైన హనుమంతుడు చూశాడు.

శ్రీమంతుడైన హనుమంతుడు రాక్షసుల భవనాలనన్నిటినీ దాటి, తిరిగి రావణుని భవనానికి పోయాడు.

రావణుడు నిద్రిస్తూ ఉండగా హనుమంతుడు చూశాడు. వికారమైన చూపులు గల రాక్షస స్త్రీలను చూశాడు. వాళ్లు వివిధాయుధాలను ధరించి రాక్షస రాజు గృహమందు కనిపించారు. వివిధములైన సైన్యాలు ఆ భవనానికి కాపలా ఉన్నవి. అక్కడ కావలికాస్తున్న రాక్షసులు మహాకాయులు. అక్కడ చాలవేగంతో పోగల గుఱ్ఱాలున్నవి. ఉత్తమమైన జాతులలో పుట్టిన గజాలున్నవి.

బాలసూర్యునివలె వెలుగొందుతున్న వేయిసేనలను హనుమంతుడు రావణుని గృహంలో చూశాడు.

అనేకాకృతులు కల పల్లకీలను, విచిత్రములైన లతాగృహాలను, చిత్రశాలలను,

క్రీడాభవనాలను, క్రీడాపర్వతాలను, సుందరమైన రతిగృహాన్ని, పగలు సుఖమిచ్చే దివాగృహాన్ని, వాయుపుత్రుడు చూశాడు.

రావణుని ధనాగారం అతని పరాక్రమ రూపమైన కర్మకు ఫలమైనదిగా ఉంది. అది భూతాధిపతియైన శివుని భవనం వలె ఉంది. ఆ భవనమందలి మంచాలు, పీటలు బంగారంతో చేసినవి. మనోహరమైనవి, విశాలమైన ఆ భవనం కుబేరభవనం వలె ఉంది.

అందెల రవళితోను, మొలనూళ్ల సవ్వడితోను, మద్దెల మ్రోతలతోను మహా ధ్వనికలది, అనేక ప్రాసాదములతో కూడినది, వందలాది స్త్రీ రత్నములతో నిండినది, విశాలమగు కక్ష్యలుకలది అయిన రావణుని మహాగృహం హనుమంతుడు ప్రవేశించాడు.

భూమిపై సర్వగుణాలతో గొప్పగా నిర్మింపబడినట్టి లంకాపతియైన రావణుని గృహాలను హనుమంతుడు దర్శించాడు.

పెదప మేఘం వలె ఉన్నది, మనోహరమైనది, శ్రేష్ఠమైనది అయిన గృహాన్ని (పుష్పకాన్ని) చూశాడు. ఆ మహాగృహం భూమి మీద వ్యాపించిన స్వర్గంవలె ఉంది. ఆకాశం మీద హంసలచే మోయబడుతున్న ఉత్తమ విమానం వలె శోభిల్లు తున్నది ఆ పుష్పకం.

అనేకరత్నాలతో ఆశ్చర్యంగొలుపుతున్న శ్రేష్ఠమైన విమానాన్ని హను మంతుడు చూశాడు. ఆ విమానం మీద ఏనుగులు చిత్రింపబడి ఉన్నవి. పద్మాలను చేతులలో దాల్చిన సుందరమైన హస్తాలతో ఒప్పుతున్న లక్ష్మీదేవిని ఆ ఏనుగులు అభిషేకిస్తున్నట్లు చిత్రింపబడి ఉంది.

చక్కనిది, మంగళకరమైనది అయిన రావణభవనం చేరి, ఆశ్చర్యచకితుడై, పైకి వచ్చి, ఆ రావణభవనం సుగంధభరితమై  సుందరంగా కనపడడం చేత మరల హనుమంతుడు అక్కడికి పోయాడు.

హనుమంతుడు లంకానగరంలో తిరుగుతూ, పూజింపబడునది, భర్త యొక్క గుణాల గొప్ప దనం చేత అతని యందు అనురాగము కలది అయిన జనకుని కూతురైన సీతాదేవిని చూడలేక చాలా దుఃఖించాడు.

ఇట్లు అనేక విధాలుగా ఆలోచిస్తున్నవాడు, నిశ్చితమైన బుద్ధి కలవాడు,

సదాచార సంపన్నుడు, చక్కని దృష్టి కలవాడు, అయిన హనుమంతుని మనసు సీతాదేవిని చూడక చాల చింతాక్రాంతమయింది.

వాయుపుత్రుడు ఆ భవనం మధ్యను ఒక పెద్ద విమానాన్ని చూశాడు. ఆ విమాన సౌందర్యం చెప్పనలవి కాదు. అటువంటిది మరొకటి నిర్మించడం సాధ్యం కాదు. విశ్వకర్మ దానిని ప్రశంసించాడు. అది భూమికి సమీపంలో వాయుమార్గంలో అంతరిక్షంలో ఉండి సూర్యుని గమన మార్గంలోనున్న మచ్చవలె ప్రకాశించింది.

ఆ విమానంలో ప్రయత్నపూర్వకంగా నిర్మించని భాగమంటూ లేదు. అన్ని విధాల అర్హమైన రత్నాలు పొదగనితావు లేదు. అందులో నున్న విశేష నిర్మాణం దేవ భవనాలలో కూడా కనిపించదు. అక్కడ రచనా విశేషం లేనిచోటు లేదు.

తపోనుష్ఠానం చేత, పరాక్రమంచేత రావణుడు దానిని సంపాదించాడు. మనస్సు అనుకున్నట్లు ఆ విమానం ఏ చోటికైనా ప్రయాణం చేయగలదు.

ప్రభువు యొక్క అభిప్రాయాన్ని మనసులోని నిలుపుకొని తొందరగా పోయేది, వాయువేగం కలది, మహాత్ములు, పుణ్యవంతులు, మహాధన సంపన్నులు, కీర్తిశాలురు, మహానందం పొందినవారు – వీరందరి నివాసమైన దేవేంద్ర మందిరం వలె ఆ విమానముంది.

వసంతకాలపు పూల సమూహం వలె సుందరమైనది, వసంతమాసం కంటె మనోహరంగా కనిపిస్తున్నది అయిన శ్రేష్ఠమైన పుష్పక విమానాన్ని హనుమంతుడు దర్శించాడు.

హనుమంతుడు, రావణుని నివాసమైన ఆ మహాభవనం మధ్యను విశాలంగా నున్న ఉత్తమమైన భవన మొకటి చూశాడు. ఆభవనం అర ఆమడ వెడల్పు, ఆమడ పొడవు కలదై, చాల మేడలతో కూడి ఉంది.

వెడల్పు కన్నులు గల సీతాదేవిని వెదకుతూ హనుమంతుడు అంతటా తిరిగాడు. ఉత్తమములైన రాక్షస గృహాలన్నీ చూసి, చివరకతడు రావణుని యిల్లు చేరుకున్నాడు.

నాలుగు దంతాలు, మూడు దంతాలు కల ఏనుగుల చేత పరివేష్టితమై, ఆయుధాలు ధాల్చిన రాక్షసుల చేత ఆ భవనం కాపాడబడుతూ ఉంది.

ఆ భవనంలో రావణుని భార్యలైన రాక్షస స్త్రీలు, పరాక్రమించి రావణుడు చెరపట్టి తెచ్చిన రాజకన్యలు, ఉన్నారు.

మొసళ్లతో పెద్ద చేపలతో కూడినది, తిమింగిలాలతోను చేపలతోను కలచి వేయబడ్డది, గాలి హెచ్చుగా వీచినపుడు పాములవలె పైకి లేచిన అలలు కలది అయిన సముద్రం ఏ విధంగా సంక్షుభితమై ఉంటుందో, ఆ విధంగా ఆ భవనం కనిపిస్తుంది.

యక్షుల రాజైన కుబేరుడు, యముడు, వరుణుడు – వీరి దగ్గిర ఎటువంటి సంపద ఉందో అటువంటిదికాని, అంతకుమించినది కాని రాక్షసుల ఇండ్లలో ఉంది.

రావణుని మహాభవనంమధ్య పుష్పకవిమానాన్ని హనుమంతుడు చూశాడు. ఆ విమానాన్ని స్వర్గలోకంలో విశ్వకర్మ బ్రహ్మకోసం నిర్మించాడు. తరువాత కుబేరుడు తపస్సు చేసి బ్రహ్మదేవుడి నుండి ఆ విమానాన్ని సంపాదించాడు. తన పరాక్రమంతో రావణుడు కుబేరుడిని ఓడించి దానిని పొందాడు. తోడేళ్ల చిత్రాలతోను, బంగారంతో, వెండితో నిర్మింపబడిన స్తంభాలతో ఆ విమానం మిక్కిలి శోభించింది. దానికి బంగారు మెట్లున్నాయి; చక్కని వేదికలున్నాయి; బంగారంతోను, స్ఫటికంతోను చేసిన కిటికీలున్నవి. రక్త చందనం చేత శ్రేష్ఠమూ, శుభకరమూ అయిన సువాసనకలది, లేత సూర్యునితో సమానమైన కాంతి కలది, చక్కని ఆకారాలు కల వివిధములైన మిద్దెలతో అలంకరింపబడినది అయిన దివ్యమైన పుష్పక విమానాన్ని హనుమంతుడు అధిరోహించాడు. అక్కడ కూర్చుండి మద్యములూ, పిండివంటలూ, అన్నమూ మొదలైన వాటి నుండి పుట్టిన చక్కని వాసనను ఆఘ్రాణించాడు. ఆ వంటకాల సుగంధము వాయుదేవుని దివ్యమైన రూపం ధరించినట్లుంది. ఆ సువాసన మహాసత్త్వుడు, బంధువులలో ఉత్తమ బంధువైన ఆ మహాశక్తి వంతుని 'ఇక్కడికి రావలసింది' అని పిలిచి నట్లుగా ఉంది. ఎక్కడ రావణుడున్నాడో అక్కడి నుండే పిలుపు వచ్చినట్లయింది.

అటు పిమ్మట మంగళకరమైనది, విశాలమైనది అయిన నివాసశాలను హనుమంతుడు దర్శించాడు. ఆ శాల రావణునికి ప్రియము గూర్చే భార్యవంటి ఉత్తమ స్త్రీవలె ఉంది.

ఆ శాల విలువైన కంబళాలు పరచినది, రాక్షసరాజు నివసించేది, హంసవలె తెల్లనిదైనా, స్వచ్ఛమైనదైనా, అగరుధూపం చేత బూడిదరంగులో కనిపిస్తున్నట్టిది. పలురకాలైన పూలదండలతో చిత్రచిత్రవర్ణాలు కలదై వసిష్ఠుని నందినీ ధేనువు వలె ప్రకాశించుతున్నది.

మనసుకు ఆనందం కలిగించేది, చూచువారి ముఖాలకు కాంతివంతమైన రంగును ఇచ్చేది, దుఃఖాన్ని పోగొట్టేది, దివ్యమైనది, సంపదలను కలిగించేది పంచేంద్రియాలకు ఉత్తమమైన అనుభూతులు కలిగించేది అయినట్టి ఆ భవనం రావణుని చేత పాలింపబడి, తల్లివలె తృప్తిని కలిగిస్తుంది.

"ఇది స్వర్గం. ఇది దేవతలుండే లోకం- ఇది ఇంద్రుని పురమైన అమరావతి కావచ్చు. లేకపోతే ఇది బ్రహ్మయొక్క స్థానం కావచ్చు" ఈ విధంగా వాయు పుత్రుడు తలచాడు.

అక్కడ బంగారు పాత్రలలో బాగా వెలుగుతున్న దీపాలను అతడు చూశాడు. ఆ దీపాలు, బాగా నేర్పరులైన జూదగాళ్లచేత జూదంలో ఓడిపోయిన మామూలు జూదగాళ్లవలె నిశ్చలంగా ఉన్నాయి. దీపాల వెలుగు, రావణుని తేజస్సు, ఆభరణాల కాంతి – వీటన్నిటితో ఆ శాల జ్వలిస్తున్నట్లు హనుమంతుడు తలచాడు.

అటు పిమ్మట హనుమంతుడు పలురకాలైన రంగులు కల బట్టలు, పూల దండలు ధరించి, వివిధములైన వేషాలతో అలంకరింపబడిన వేయిమంది స్త్రీలను, చిత్రకంబళం మీద కూర్చున్నవారిని చూశాడు.

అర్ధరాత్రి గతించింది. మత్తుగా వాళ్లు నిద్రపోయారు. ఆ స్త్రీలు రాత్రిని వివిధ క్రీడలతో గడిపి గాఢమైన నిద్రలో మునిగారు. హంసలు, తుమ్మెదలు చప్పుడు చేయనట్టి పెద్ద తామరకొలను ఏ విధంగా ఉంటుందో, ఆ విధంగా కదలికలు లేకుండా నిదురించిన ఆ స్త్రీజనం అందంగా కనిపించింది.

రావణుని యొక్క ఆ నివాసశాల ఆ స్త్రీలతో ప్రకాశిస్తూ నక్షత్రాలతో శోభించే శరత్కాలపు నిర్మలాకాశం వలె కనిపించింది. రాక్షసరాజు ఆ స్త్రీలచే చుట్టబడినవాడై తారకలచేత పరివృతుడైన మంగళకరుడగు చంద్రుడివలె శోభించాడు.

ఆకాశం నుండి (స్వర్గం నుండి) ఇంకా అనుభవించవలసిన పుణ్యాం కొంచెం

ఉండగానే ఆ స్త్రీలు నేలను పడి, ఈ రూపాలు ధరించి అందరూ కలిసి ఉన్నట్లు హనుమంతుడు భావించాడు.

ఆ స్త్రీలు మధుపానం చేత, క్రీడలచేత ఒడళ్లు మరచి నిద్రిస్తున్నారు. వారిలో కొందరు పెట్టుకున్న తిలకాలు చెరిగిపోయాయి. కొందరి కాలిఅందెలు స్థానాలు తప్పాయి. ఆ ఉత్తమ స్త్రీలు ధరించిన హారాలు పక్కకు జారి పడ్డాయి. కొందరి మొలనూళ్లు వదులయి, కట్లు వదులయిన ఆడగుఱ్ఱాలవలె వాళ్లు కనిపించారు.

కొందరు చక్కని కుండలాలు ధరించారు. వారు దాల్చిన పూలదండల దారాలు తెగిపోయాయి. మహారణ్యంలో పూసిన పూలు, వికసించిన లతలు గజేంద్రునిచే నలిపి వేయబడ్డట్లు ఆ దండలు కనిపించాయి.

కొందరు వనితలు ధరించిన పెద్ద పెద్ద ముత్యాలున్న హారాలు చంద్రుని కిరణాల వలె తెల్లనివై వారి స్తనాల మధ్యను, నిద్రపోతున్న హంసలవలె కనిపించాయి. మరికొందరు వనితలు వక్షః ప్రదేశాలలో ధరించిన బంగారు హారాలు చక్రవాక పక్షులవలె ఉన్నాయి.

విశాలమైన మొలలుకల ఆ స్త్రీలు నదులవలె ప్రకాశించారు. ఆ నదులు హంసలు, కారండవములు నిండినవి; చక్రవాకాలచేత శోభను పొందుతున్నవి. ఆ నదులలో ముడుచుకున్న మొగ్గలు వికసించిన పద్మాలు ఉన్నవి. ఆ స్త్రీల కాలిగజ్జెలు మొగ్గలవలె ఉన్నవి. వారి బంగారు ఆభరణాలే రేకులు విడిన తామరపూలు- నదులలో మొసళ్లు ఉంటాయి. ఆ విధంగా స్త్రీలలో శృంగారభావాలున్నవి. యశస్సే తీరముగా గల నదులవి.

కొంతమంది స్త్రీల మృదువైన శరీరభాగాలందు, స్తనాగ్రాలపైన ఆభరణాల ముద్రలు చెరగకుండా ఉన్నవి - వారు భూషణాలు తీసివేసిన తరువాత కూడా ఆముద్రలు, ఆభరణాలు పెట్టుకున్నట్లే కనిపించాయి.

వారి ముఖాలనుండి వచ్చే ఊర్పులు సహజంగా సువాసన కలవి. సుఖాన్నిచ్చేవి. చక్కెర, మద్యాల వాసనలు కలవి - అవి రావణునిపై ప్రసరించాయి. కొంతమంది రావణుని భార్యలు సవతుల ముఖాలను రావణుని ముఖమనుకొని మరల మరల ఆఘ్రాణించారు.

ఆ స్త్రీలు నగలు, బట్టలు, పూలసరాలు యథోచితంగా అంతకు ముందు ధరించినవారే. కాని, ఆ సమయంలో మాత్రం ఒకరి మీద ఒకరు పడి, అవయవాలను ఒకరిమీద ఒకరు వేసుకొని ఉండడంచేత, ఏ ఆభరణాలు ఎవరివో, ఏ బట్టలు ఎవరివో, ఏ దండలు ఎవరివో స్పష్టంగా ఎవరు కూడా తెలుసుకోలేరు.

రావణుడు సుఖంగా నిద్రిస్తున్నాడు. అక్కడ నున్న బంగారపు ప్రమిదలలోని దీపాలు కదలకుండా, నిశ్చలంగా వివిధ కాంతులుగల ఆ రావణస్త్రీలను రెప్పపాటు లేకుండా చూస్తున్నట్లున్నవి. (రావణుడు మేల్కొని ఉంటే అతని స్త్రీలను ఆ దీపాలు ఆ విధంగా చూడలేవేమో!)

రాజర్షుల స్త్రీలు, పితరుల వనితలు, దైత్యుల అంగనలు, గంధర్వకాంతలు, రాక్షసకన్యలు - అందరూ రావణుని కామించి అతనికి లొంగిపోయారు.

యుద్ధాన్ని కోరే ఆ రావణుని చేత ఆ స్త్రీలందరు ఎత్తుకొని రాబడ్డవాళ్లే. వారిలో కొందరు మదవతులు అతనిని మోహించి తామే వచ్చారు. ఆ వనితలలో ఎవరూ బలాత్కారంగా తేబడిన వాళ్ళు కారు - రావణుని గుణగణాలను వాళ్లు మెచ్చుకున్నవాళ్లే - వాళ్ల అంగీకారంతోనే రావణుడు తెచ్చాడు. ఆ స్త్రీలలో, రావణుడు తేక ముందు, మరొకరిని కామించిన వనిత కాని, మరొక ప్రియుడున్న భామిని కానిలేదు. ఆ స్త్రీలలో ఉత్తమకులమందు పుట్టని మహిళ లేదు. తక్కువ అందం కల తరుణి లేదు. నేర్పులేని నీరజాక్షిలేదు. రావణునికి సేవచేయని వనిత లేదు - బలహీనురాలు ఎవతెయూ కాదు - ఒకతె కూడా భర్తచేకోరదగనట్టిది లేదు.

"ఏ విధంగా రాక్షసరాజుభార్య భర్తతో కలసి ఉన్నదో, ఆ విధంగా శ్రీరాముని ధర్మపత్నియైన సీతాదేవి భర్తతో కలసి ఉంటే బాగుండేది" అని సాధు బుద్ధియైన వానర శ్రేష్ఠుడు తలచాడు.

మరల హనుమంతుడు దుఃఖతుడై ఆలోచించాడు: "సీతాదేవి ఉత్తమ గుణాలు కలది. ఆ విషయం నిర్ధారితమైనది. ఆమెను తెచ్చి మహాత్ముడైన లంకేశ్వరుడు కష్టమైనది, ఆర్యులు కానివారు చేసేటటు వంటిది అయిన పనిచేశాడు."

ఆంజనేయుడు రావణుని భవనం పరిశీలనచేస్తూ, అచట స్ఫటికమయమూ

రత్నాలచే అలంకరింపబడినదీ, శ్రేష్ఠమైనదీ, దేవతల శయనాగారంవలె ఉన్నదీ అయిన పడకటింటిని చూశాడు. అందులో, చాల ధనం వెచ్చించి తెచ్చిన విలువైన మంచాలున్నవి. అవి వైడూర్యాలు తాపినట్టివి. కొంతభాగం దంతంతోను, మరికొంత భాగం బంగారంతోను చేయబడి, చాలరంగులు కలిగి ఉన్నవి. వాటిపైన చాల ధరచేసే పరుపులు వేయబడి ఉన్నాయి.

అక్కడ ఒక చోట మంచానికి శిరోభాగంలో తెల్లని గొడుగొకటి ఉంది. అది చంద్రునివలె కనిపిస్తున్నది; శ్రేష్ఠమైన పూల దండలతో అలంకరింపబడి ఉంది. ఉత్తమమైన శయనాసనం బంగారపు పూత పూసినది. అశోక పుష్పాల మాలలతో అలంకరింపబడ్డది.

చామర గ్రాహిణులు మంచం చుట్టూ ఉండి విసురుతున్నారు. మంచమున్న ఆ చోట పలురకాలైన సువాసలు అలముకున్నాయి. ఉత్తమమైన దూపం అంతటా గుబాళించింది.

ఆ మంచం మీద ఉత్తమమైన పరుపు పరచి ఉంది. దాని మీద పొట్టేలుతోలు కప్పారు. శ్రేష్టమైన పూలదండలతో అది అంతటా అలంకరింపబడింది.

ఆ పర్యంకం మీద రావణుడు నిద్రిస్తున్నాడు. అతడు మేఘంవలె నల్లని వాడు. శ్రేష్ఠమైన కుండలాలతో ప్రకాశిస్తున్నాడు. అతని కన్నులు ఎఱ్ఱటివి. మహాబాహువతడు; బంగారు జరీవస్త్రాలను ధరించాడు. అతడు సువాసన కల రక్త చందనం ఒంటి నిండా పూసుకున్నాడు. అందుచేతనే సంధ్యాకాలంలో ఆకాశం మీద మెరపుతీగలతో కూడిన ఎఱ్ఱటి మేఘంవలె కనిపిస్తున్నాడు. దివ్యమైన ఆభరణాల నతడు ధరించాడు. సుందరుడూ, కామరూపీ అయిన రావణుడు చెట్లు తోటలు పొదలతో కూడి నిద్రిస్తున్న మందరపర్వతం వలె ఉన్నాడు.

అతడు రాత్రివేళ విశేషంగా క్రీడించాడు. శ్రేష్ఠమైన ఆభరణాలతో అలంకరింప బడినాడు. రాక్షసకన్యలకతడు ప్రియుడు, రాక్షసులకు ప్రియము గూర్చేవాడు. బాగా త్రాగి, క్రీడించి, కాంతివంతమైన పర్యంకం మీద గాఢంగా నిద్రిస్తున్న రావణుని మహావానరుడు దర్శించాడు.

బుసకొడుతున్న సర్పంవలె నిశ్వాసాన్ని వదలుతున్న రావణుని సమీపించి, వానరశ్రేష్ఠుడు భయపడినట్లు ఉద్వేగాన్ని పొంది వెనక్కుపోయాడు.

అపుడు మెట్లను వదలి మరొక వేదికనెక్కి రాక్షసశార్దూలుడైన రావణుని మహాకపి చూడసాగాడు.

రావణుడు నిద్రిస్తూ ఉన్న ఉత్తమశయనము మదపుటేనుగు శయనించిన విశాలమైన ప్రస్రవణపర్వతంవలె ఉంది.

హనుమంతుడు, బంగారు అంగదాలను ధరించి ఇంద్ర ధ్వజంవలె ఉన్న రావణుని భుజాలను చూశాడు. ఐరావతం యొక్క దంతాల కొనలతో పీడింపబడి నప్పుడు ఏర్పడిన గాయపు మచ్చలు కలవి, వజ్రాయుధముచే పడిన గాట్లు గలవి; బలిసిన మూపులు కలవి, విష్ణు చక్రం వలన ఏర్పడిన గాయపు మచ్చలు కలవి, బలిసినవి, ఒకదాని నొకటి పోలినవి, పొసగినవి, బలం కలిగినట్టివి, మంచి లక్షణాలు కల గోళ్ల బొటన వ్రేళ్లు, అరచేతులు కలవి, దృఢమైనకీళ్లు కలిగినవి, ఇనుప గుదియల వంటి ఆకారం కలిగినవి, గుండ్రములైన ఏనుగు తొండాలవలె ఉన్నవి, శుభ్రంగా నున్న రావణుని పర్యంకమందు ఐదుపడగల పాములవలె చాచ బడినవి, కుందేటి నెత్తుటివలె ఎఱ్ఱగా, చాల చల్లగా, మంచి వాసన వేస్తూ ఉన్న శ్రేష్ఠమైన చందనం పూయబడినవి, చక్కగా అలంకరింపబడినవి, ఉత్తమ స్త్రీలచేత మర్దింపబడుతున్నవి, శ్రేష్ఠమైన సుగంధం కలవి, యక్షులను, పన్నగులను, గంధర్వులను, దేవతలను, దానవులను యుద్ధంలో పీడించేవి అయిన రావణుని బాహువులను, పర్యంకం మీద నున్న వాటిని, హనుమంతుడు చూశాడు. ఆ బాహువులు మందర పర్వతం నడుమ నిద్రిస్తున్న మహా సర్పాలవలె ఉన్నవి.

రాక్షసరాజైన రావణుని భుజాలు బలిసి ఉన్నాయి. ఆ బాహువులతో అతడు రెండు శిఖరాలతో కూడిన మందరపర్వతం వలె శోభించాడు.

మామిడి పూలు, పొన్నపూలు – వీటి సుగంధమూ, పొగడపూల చక్కని వాసనా, మృష్టాన్నరసాల వాసనా, మద్యగంధమూ – ఇవన్నీ కలసిన నిశ్వాసములు నిదురిస్తున్న ఆదానవసింహుని పెద్ద ముఖం నుండి వెలువడుతూ ఆ యింటిని నింపుతున్నట్లున్నవి.

ముత్యాలు మణులు పొదగబడి బంగారంతో చేయబడిన కిరీటం రావణుడు పండుకొని ఉండడం చేత కొంచెం పక్కకు తొలగింది. అతని ముఖం కుండలాల కాంతితో ప్రకాశిస్తున్నది. బలిసిన అతని వక్షస్సు విశాలంగా ఉంది. దాని నిండా రక్త చందనమలది ఉంది. హారాలతో ఆవక్షం శోభిస్తూ ఉంది.

తెల్లని ఉత్తరీయం విలాసంగా అతడు పైన వేసుకున్నాడు. నెత్తుటి వలె ఎఱ్ఱనైన పట్టుబట్ట కప్పుకున్నాడు - చాల అర్ఘమైనది, బాగుగా చుట్టబడినది, ఉత్తమమైనది అయిన పీతాంబరాన్ని ధరించాడు.

మినుముల పోగువలె అతడు నల్లగానున్నాడు. పామువలె నిట్టూరుస్తున్నాడు. గంగానది యొక్క గొప్పదైన నీటి ఒడ్డున శయనించిన ఏనుగువలె ఉన్నాడు.

నాలుగు బంగారు ప్రమిదలలో వెలిగే దీపాలు నలుదిక్కుల వెలుగులు చిమ్ముతూ ఉంటే, అతని సర్వాంగాలు కాంతివంతాలై, మెరుపుల గుంపుతో భాసించే మేఘంవలె అతను కనిపిస్తున్నాడు.

ఆ మహాత్ముని భార్యలు అతని పాదాలచెంతనున్నారు, రాక్షసాధిపతియైన రావణుని అతని ప్రియ భార్య యొక్క గృహమందు హనుమంతుడు చూశాడు.

రావణుని ప్రియభార్యలు చంద్రునివలె ప్రకాశవంతమైన ముఖాలు కలవారు. చక్కని కుండలాలచేత అలంకరింపబడినవాళ్లు - వాడని, నలగని పూల దండలు ఆభరణాలుగా గల ఆ స్త్రీలను హనుమంతుడు చూశాడు.

ఆ ప్రియ భార్యలు నృత్తమందు, వాద్యాలయందు నేర్పు కలవారు. రాక్షసేంద్రుని భుజాల మధ్య ఒడిలోను లాలింపబడుతున్నారు. ఆ స్త్రీలు ఉత్తమమైన ఆభరణాలను ధరించారు.

ఆ ప్రియ భార్యల ముఖాలు చంద్రునితో సమానమైనవి. వాటికి అందమైన చెవితమ్మెలున్నవి. వీటన్నిటితో ఆ విమానం నక్షత్రాలతో కూడిన ఆకాశం వలె కనిపించింది.

రావణునికి అందించే కలశాన్ని ఒకామె పట్టుకొని నిద్రిస్తూ ఉంటే, ఆ నీరు ఆమె మీదపడి వసంతకాలంలో పూలదండ వాడి పోకుండా నీటితో తడిపినట్లు కనిపించింది.

తామరరేకుల వంటి కన్నులు కలది, పున్నమిచందమామ వంటి ముఖం కలది, మదంచేత స్వాధీనం తప్పిన అవయవాలు కలది అయిన ఒకతె చక్కని పిరుదులు కల మరొక స్త్రీని కౌగిలించుకొని గాఢంగా నిద్రించింది.

విచిత్రములైన వాద్యాలను ఉత్తమ స్త్రీలు, కాముకులును కామినులు ఏ విధంగా తమస్తనాలతో పీడిస్తారో, ఆ విధంగా కౌగిలించుకొని బాగా నిద్రపోయారు.

ఆ స్త్రీలకు ఎడంగా ఏకాంతమందు మంగళకరమైన పర్యంకమందు నిద్రిస్తున్న మరొక స్త్రీని హనుమంతుడు చూశాడు.

ముత్యాలు, మణులు పొదిగిన ఆభరణాలతో అలంకరింపబడిన ఆమె తన యొక్క శోభతో ఆ భవనమంతటిని అలంకరిస్తున్నదా అన్నట్లుంది.

తెల్లనిది, బంగారంతో సమానమైన కాంతి గలది, రావణునికి ప్రియురాలు, అంతఃపురప్రధానురాలు, చక్కని రూపం కలది అయిన మండోదరి అక్కడ నిద్రిస్తూ ఉంటే వానరుడు చూశాడు.

మహాభుజుడైన వాయుసూనుడు అలంకారాలతో నున్న ఆమెను చూసి, రూపం యౌవనం ఆస్తిగా గల సీత అని తర్కించాడు.

వానరశ్రేష్ఠుడు గొప్ప సంతోషంతో ఆనందించాడు. జబ్బలు చరుచు కున్నాడు-తోకను ముద్దుపెట్టుకున్నాడు. ఆనంద పారవశ్యం పొందాడు. ఆడాడు, పాడాడు; ఇటు అటు తిరిగాడు; స్తంభాలను ఎక్కాడు. నేలను పడిపోయాడు. కోతులకు సహజమైన చేష్టలన్నీ చేశాడు.

మండోదరియే సీత అన్న భావాన్ని హనుమంతుడు విడిచి పెట్టి, సీతాదేవి గురించి మరొక ఆలోచన కలవాడయాడు.

రాముడిని ఎడబాసిన సీతాదేవి నిద్రించదు; భోజనం చేయదు; అలంకరిం చుకోదు; పానీయాలు త్రాగదు. ఇంకొక మనుష్యుడు, దేవతలరాజు ఇంద్రుడైనా అతని దగ్గిరికి పోదు. ఎందుచేతనంటే రామునికి సాటియైన వాడు దేవతలలో ఎవడేనా ఉన్నాడా?

ఆ స్త్రీ మరెవరో అయి ఉంటుందని హనుమంతుడు నిశ్చయానికి వచ్చి పానభూమికి వెళ్లినాడు. మద్యం త్రాగే ఆ స్థలంలో కొందరు స్త్రీలు క్రీడలతో అలసిపోయారు. మరికొందరు పాడి అలసిపోయారు. కొందరు నృత్యము చేసి అలసిపోయారు. ఇంకా కొందరు మద్యం త్రాగి బడలిపోయారు. ఇతర స్త్రీలు ముఖ్యమైన పడకల మీద పండుకున్నారు. నగలతో అలంకరింపబడిన వారు, సౌందర్యం గురించి మాట్లాడుతున్న వారు, ఆ సమయానికి సరిపడిన పాటలు పాడుతున్నవారు, దేశానికి కాలానికి సరిపడేటట్లు వ్యవహరించేవారు, ఉచితమైన మాటలు ఆడేవారు అయిన వేయి మంది స్త్రీలను భోగించి నిదురిస్తున్న రావణుని

హనుమంతుడు చూశాడు. వారి మధ్య మహాభుజుడైన రావణుడు ప్రకాశిస్తున్నాడు.

రావణుడు ఎలా ఉన్నాడంటే ఆలమందలో ఉత్తమ గోసమూహం మధ్య ఆబోతులా ఉన్నాడు. ఆ రాక్షసరాజు ఆ స్త్రీలచే పరివేష్టింపబడి అరణ్యంలో ఆడ ఏనుగులచే చుట్టబడిన మహాగజంవలె కనిపించాడు.

మహాత్ముడైన రావణుని పానభూమిని, అన్ని కోరికలకు అనుగుణములైన వస్తువులు కలదానిని, వానరశ్రేష్ఠుడు రాక్షసాధిపతి ఇంటియందు చూశాడు. అక్కడ లేళ్లు, దున్నలు, వరాహాలు - వీటి మాంసాలు వేరువేరుగా ఉన్నవాటిని అతడు దర్శించాడు. విశాలమైన వెండి పాత్రలలో, సగమే తిని నటువంటి నెమళ్లను కోళ్లను వానరుడు చూశాడు. వరాహాలు, ఖడ్గమృగాలు - పెరుగు సౌవర్చలమనే లవణంతో కూడిన వీటి మాంసాలను, ముళ్ల పందులు, లేళ్లు, నెమళ్ళు (ఇవి కూడా పెరుగుతోను ఉప్పు తోను కూడినవి) వీటి మాంసాలను హనుమంతుడు చూశాడు.

చక్కగా వండబడిన పలురకాలైన కొక్కెరలను, ఒకే ఎముక ఉన్న చేపలను బాగా వండిన మేకలను, లేహ్యాలను, పలువిధాలైన పానీయాలను, ఎన్నో రకాలైన భోజన పదార్థాలతోను, ఆ విధంగానే పులుపు ఉప్పు హెచ్చుగా గల పదార్థాలతోను అక్కడక్కడ విడివిడిగా పడియున్న మిక్కిలి విలువైన హారాలు అందెలు బాహుపురులతోను, పెద్ద పానపాత్రలయందుంచబడిన పలురకాలైన పండ్లతోను, అంతటను అలంకారార్థమై చల్లబడిన పూవులనే కానుకలతోను ఆ ప్రదేశము అత్యధికముగా శోభిల్లుతూ ఉంది.

ఆ పానభూమిలో పలురకాలైన మద్యాలున్నవి. కొన్ని సహజమైనవి, కొన్ని కృత్రిమమైనవి, కొన్ని చక్కెరతో చేసిన ఆసవాలు, కొన్ని మధూక పుష్పాలతోను, కొన్ని పూదేనెతోను, కొన్ని ఫలరసాలతోను చేసినవి. ఆ ఆసవాలకు అక్కడక్కడ వేరువేరుగా పలురకాలైన సుగంధ ద్రవ్యాలు చేర్చబడినవి.

బంగారు పాత్రలు కొన్ని, మరికొన్ని స్ఫటికపాత్రలు - బంగారు చెంబులు కొన్ని, వీటన్నిటితోను పానభూమి సుందరంగా ఉంది. అక్కడ కొన్ని వెండి బిందెలలోను, బంగారపు కలశాలలోను, మణిమయ పాత్రలలోను, నిండుగా నున్న మద్యాన్ని ఆ మహాకపి చూశాడు.

కొన్ని పాత్రలలో మద్యం కొద్దిగానే ఉంది. మరికొన్ని పాత్రలలో పూర్తిగా త్రాగబడి ఏమీ మిగులలేదు. కొన్ని త్రాగకుండా ఉండడంచేత నిండుగా ఉన్నాయి.

అక్కడ అనేక విధాలైన పాన్పులు, శుభ్రంగా ఉన్నవి కనిపించాయి. కొంత మంది ఉత్తమ స్త్రీలు ఒకరినొకరు కౌగిలించుకొని నిద్రిస్తున్నారు.

చల్లని గంధం, తీయని వాసన గల మద్యం, పలురకాలైన మాలలు, వివిధమైన ధూపాలు, వీటి సుగంధాలను మోసుకుపోతూ వాయువువీచింది. ఆ గాలి పుష్పకవిమానంపైకి వచ్చింది.

ఆ రావణుని గృహమందు గల స్త్రీలలో కొందరు నల్లనివాళ్ళు, కొందరు నలుపు తెలుపులు కలిసిన రంగుకలవాళ్లు; కొంతమంది బంగారపు రంగులో ఉన్నారు. వారు మదనక్రీడలలో అలసిపోయి నిద్రావశులయారు.

రావణాంతఃపురాన్ని కొంచెమైనా విడువకుండా మహాతేజశ్శాలియైన వానరుడు చూశాడు. కాని జనకరాజపుత్రియైన సీతాదేవిని మాత్రం చూడలేక పోయాడు. ఆ అంతఃపురకాంతలను అపుడు చూస్తూ అతడు గొప్పదైన విచారం పొందాడు. ధర్మలోపం చేసినట్లు అతనికి అనుమానం కలిగింది. "బాగా నిద్రపోతున్న ఇతరుల భార్యలను చూడడం నాకు మిక్కిలి ధర్మలోపం కలిగిస్తున్నది. కాని, ఇతరుల భార్యలను చూడడమనేది కామాది విషయాలకు సంబంధించినది కాదు. ఇక్కడ ఈ పరదారల స్వీకారం (రావణుడు భార్యలను అనుభవించడం) నాచే చూడబడింది."

తదేక దృష్టితో కార్య నిశ్చయం చేసిన ఆ హనుమంతుడికి తిరిగి ఆలోచన కలిగింది.

"రావణుని విశ్వాసాన్ని చూరగొన్న స్త్రీలందరూ నాచేత హెచ్చుగా చూడ బడ్డారు. దానివలన నా మనసులో ఎట్టి చెడ్డతలపు కలుగలేదు. అన్ని ఇంద్రియాలు పనిచేయడానికి మనసే కారణం. శుభకార్యాలయందుకాని, అశుభకార్యాలయందు కాని ఆ మనసు నాయందు చెదరకుండా స్థిరంగా ఉంది. నేను వేరొక చోట విదేహ రాజపుత్రిని వెదకడం శక్యం కాదు. వెదకినప్పుడు స్త్రీల మధ్యనే స్త్రీలు కనిపిస్తారు కదా! ఏ జాతికి ప్రాణి చెందుతుందో ఆజాతిలోనే దానిని వెదుక

వలసి ఉంది. తప్పి పోయిన ప్రమదను ఆడలేళ్లలో వెదకుట శక్యం కాదు. నేను చాల పరిశుద్ధమైన మనస్సుతో ఆమె కోసం వెదకాను. రావణుని అంతఃపుర స్త్రీ లందరూ కనిపిస్తున్నారు. కాని, జానకీదేవి మాత్రం కనిపించడం లేదు."

వీర్యవంతుడైన హనుమంతుడు దేవగంధర్వకన్యలను, నాగకన్యలను చూశాడు. కాని జానకిని చూడలేదు. ఆ వానరుడు ఆమెను గాంచక, ఇతరులైన ఉత్తమ స్త్రీలను చూస్తూ, అచట నుండి తొలగి, ఆలోచింపసాగాడు. శ్రీమంతుడైన మారుతి మరల అధికంగా ప్రయత్నం సాగించాడు.

హనుమంతుడు పానభూమిని విడిచి, తిరిగి రావణాంతఃపురంలో వెదుక సాగినాడు.

మారుతి రావణగృహమధ్యంలో లతాగృహాలను, చిత్రశాలలను, రాత్రి నివాసా నికి తగిన యిళ్లను సీతాదేవిని చూడాలన్న కోరికతో సంచరించాడు. కాని, చక్కని కన్నులు కల సీతాదేవిని మాత్రం చూడలేకపోయాడు.

అపుడు మహాకపియైన హనుమంతుడు రాముని ప్రియురాలైన సీతాదేవిని కానక ఇట్లు తలచాడుః

"నేను వెదకినా మిథిలా రాజపుత్రి కనిపించలేదు. సీతాదేవి తప్పక చనిపోయి ఉంటుంది. తన శీలాన్ని కాపాడుకోవడంలో నిమగ్న అయినది, సన్మార్గంలో ప్రవర్తించేది అయిన సీతాదేవి, రాక్షసులలో ముఖ్యుడైనవాడూ, దురాత్ముడూ అయిన రావణుని చేత చంపబడి ఉంటుంది. చక్కదనం లేనివారు, వికృతమైన వేషం కలవారు, తేజోవిహీనులు, వికారమైన పెద్దకన్నులు కలవారు, పెద్దముఖాలవారు అయిన రాక్షసరాజు స్త్రీలను చూసి జానకి భయంతో చనిపోయిందేమో! సీతాదేవిని చూడకుండా, పౌరుషాన్ని కూడా పొందకుండా, చాల కాలం వానరులతో గడపి, సుగ్రీవుని చెంతకు నేను పోయే దారి కనిపించదు. సుగ్రీవుడు బలవంతుడైన వానరుడు; తీవ్రమైన దండన విధించవలసినవాడు.

"అంతఃపుర మంతటినీ చూశాను. రావణుని స్త్రీలను చూశాను. సాధ్వియైన సీతాదేవి మాత్రం కనిపించలేదు. నేను పడిన కష్టమంతా వ్యర్థమైంది. నేను కిష్కింధకు పోతే అక్కడనున్నవానరులందరూ నాతో అంటారు, 'నువ్వు లంకకు

పోయావు. అక్కడ నువ్వేం చేశావో చెప్పు'. జనకసుతను చూడకుండా నేనేం చెప్పగలను? నేనిక్కడ కాలం గడిపి జాగుచేస్తే, వాళ్లు తప్పకుండా ప్రాయోప వేశం చేస్తారు.

"వృద్ధుడైన జాంబవంతుడు ఏమంటాడు? యువరాజైన అంగదుడే మంటాడు? అక్కడనున్న వానరులేమంటారు? సముద్రం దాటి వెళ్లి వచ్చిన నన్ను గూర్చి వాళ్లేమంటారు?

"ఉత్సాహమే సంపదకు మూలం, ఉత్సాహమే అధికమైన సుఖానికి ఆధారం. ఉత్సాహమే ఎల్లప్పుడూ, అన్ని పనులలోను నరుని సాఫల్యానేటట్లు చేస్తుంది. అతడు ఏయే పనులు చేస్తాడో వాటిని ఉత్సాహమే సఫలం చేస్తుంది. కాబట్టి ఉత్సాహ పూర్వకమైన ఉత్తమ ప్రయత్నం చేస్తాను.

"పానశాలలు వెదికాను, పూదోటలను కూడా వెదికాను; చిత్రశాలలను వెదికాను; క్రీడాగృహాలను వెదికాను; ఉద్యానవనాల మధ్య నున్న వీధులను వెదికాను; విమానభాగాలను అంతటా వెదికాను.

"రావణుడు పాలించే ప్రదేశాలనన్నిటిని తిరిగి వెదకుతాను" ఈ విధంగా హనుమంతుడు తలచి, తిరిగి వెదకడం మొదలు పెట్టాడు.

భూమి లోపల యిండ్లను, చతుష్పథమండపాలను, ఇళ్లకు దూరంగా స్వేచ్ఛా విహారంకోసం నిర్మించిన గృహాలను వెదకుట ప్రారంభించాడు. ఎగురుతూ, దూకుతూ, నిలబడుతూ, నడుస్తూ, మళ్లీ మళ్లీ తలుపులు తెరుస్తూ మూస్తూ లోపలికి ప్రవేశిస్తూ, పైకి వెలువడుతూ, క్రిందికి దుముకుతూ, పైకి గెంతుతూ అన్ని విధాల మహాకపి సంచరించాడు.

రావణాంతఃపురంలో హనుమంతుడు పోవని చోటు నాలుగంగుళాల మేర కూడా లేకపోయింది. ప్రాకారాల మధ్య నున్న వీథులు, చతుష్పథాలలోని మంటపాలు, దిగుడు బావులు, కొలనులు – వీటనన్నిటినీ అతడు చూశాడు.

వివిధములైన ఆకారాలలో, అందం లేని రూపాలతో, వికృతమైన ఆకారాలు కల రాక్షసులు అక్కడ కనిపించారు. కాని, జనకసుతయైన సీతాదేవిమాత్రం కనిపించలేదు.

సాటిలేని చక్కదనం కల ఉత్తమవిద్యాధర స్త్రీలను హనుమంతుడు చూశాడు. కాని, అక్కడ, రాముని ఆనందింపజేసే సీతాదేవి లేదు.

ప్రశస్తములైన జఘనాలూ, నిండు చంద్రుని వంటి ముఖాలూ కల నాగ కన్యలను హనుమంతుడు చూశాడు; కాని, అక్కడ చక్కని నడుము కల సీతాదేవి మాత్రం కనిపించలేదు.

వెదకి వెదకి, రాక్షసరాజు చేత బలవంతంగా తేబడిన దేవకన్యలను అక్కడ హనుమంతుడు చూశాడు. కాని జనకునికి ఆనందం కలిగించే సీతాదేవి మాత్రం కనిపించలేదు.

ధీమంతుడు, వాయుదేవుని పుత్రుడు, మహాభుజుడు అయిన హనుమంతుడు ఇతరులైన ఉత్తమ స్త్రీలను చూసి, మళ్లా విషాదం పొందాడు.

వానరోత్తముల ప్రయత్నం, సముద్రం దాటడం- ఈ రెండూ వ్యర్థమవడం చూసి వాయుపుత్రుడు తిరిగి చింతించాడు.

హనుమంతుడు విమానం నుండి దిగి, శోకంతో కొట్టబడిన మనసు కల వాడై అపుడు విచారం పొందాడు.

హరియూథపుడు విమానం నుండి ప్రాకారానికి దుమికి మేఘం మధ్యను మెరుపువలె వేగంగా పోయాడు. రావణుని యింటి నుండి వెలుపలికి వచ్చి, సీతాదేవిని ఎక్కడా కానక ఈ మాటలు పలికాడు:

“రామునికి ప్రియమైన పని చేయడానికి లంకనంతా పూర్తిగా వెదికాను. విదేహరాజపుత్రీ, సర్వాంగసుందరీ అయిన సీతాదేవిని చూడలేకపోయాను. నీటి గుంటలు, చెరువులు, సరస్సులు, సెలయేళ్లు, నదులు, నీటిపట్టులకు సమీపంలో ఉండే తోటలు, చొరరాని చోట్లు, కొండలు, లంక అంతా వెదికాను. కాని సీతాదేవి నాకు కనిపించలేదు.

“ఇచట, రావణుని గృహంలో సీత ఉందని సంపాతి చెప్పాడు. ఆ గద్దల రాజు మాట ప్రకారం ఆమెను నేనిక్కడ చూడలేకపోయాను. సీతాదేవి ఏమయి ఉంటుంది?

"ఆమె మనసు వశం తప్పి దుష్టుడైన రావణుని చేరి పోయిందా? రావణుడు సీతాదేవిని ఎత్తుకొని వేగంగా రామబాణాలకు భయపడి ఎగురుతుంటే మధ్య నెక్కడైనా పడిపోయిందా? లేదా, సిద్ధులు చరించే ఆకాశమార్గంలో సిగ్గుపడిన ఆమె సముద్రాన్ని చూసి బెదరిన గుండెతో పడిపోయిందా? రావణుడు పోతున్నప్పుడు అతని తొడల వేగానికి గాని, అతని బాహువులచే పీడింపబడి కాని, విశాలాక్షి పూజ్యురాలు అయిన సీతాదేవి ప్రాణాలను విడిచి పెట్టిందేమో! రావణుడు పైపైకి సముద్రం మీద ఎగురుతుంటే అతని భుజాలనుండి తొలగిపోయి సముద్రంలో పడిపోయిందా? అహో! క్షుద్రుడైన ఈ రావణుని నుండి తన శీలాన్ని రక్షించుకుంటూ, ఆ శత్రువు చేత తపస్విని అయిన సీతాదేవి భక్షింపబడిందేమో! లేక రావణుని భార్యలు, నల్లని కనులు కల ఉత్తమ స్వభావమున్న సీతాదేవిని తిని వేశారేమో! పూర్ణచంద్రుని వంటి ముఖం కలది, తామరరేకులవంటి కనులు కలది, రాముని ముఖాన్నే తలంచుచున్నది అయిన సీతాదేవి దీనురాలై చనిపోయి ఉంటుంది. 'ఓ రామా! ఓ లక్ష్మణా! ఓ అయోధ్యా!' అంటూ మైథిలి చాలసార్లు విలపించి దేహాన్ని విడిచిపెట్టిందేమో! లేక రావణుని గృహంలో బంధింపబడి, సీతాదేవి పంజరంలో నున్న చిలుకవలె దుఃఖిస్తూ ఉంటుంది.

"జనకుని పుత్రి, రామునికి భార్య, చక్కని నడుము కలది, కలువరేకుల వంటి కనులు కలది అయిన సీతాదేవి ఏవిధంగా రావణునికి వశమయింది? జానకీదేవి దాచబడ్డా, సముద్రంలో పడిపోయినా మన రామునికి ఈ విషయం చెప్ప రానిది. రామునికి చెప్పితే దోషం కలుగుతుంది; చెప్పకపోతే దోషం కలుగుతుంది.

"కనుక నేను ఏం చేయాలి? ఈ పని నాకు చాలవిషమంగా పరిణమించింది. పరిస్థితులు ఇలా ఉండేటప్పుడు కాలోచితమైన కార్యం ఏ విధంగా ఉంటుంది?"

హనుమంతుడు తిరిగి ఆలోచించాడుః

"నేను కాని సీతాదేవిని చూడకుండా సుగ్రీవుని పురమైన కిష్కింధకు పోతే నేనేం ప్రయోజనం సాధించినట్లు? నేను సముద్రం దాటడం వ్యర్థమే కదా! లంకలో ప్రవేశించి రాక్షసులను చూడకుండాపోతే నా ప్రయత్నం నిష్ఫలమేకదా! సుగ్రీవుడు, అతనితో నున్న వానరులు నన్ను చూసి ఏమంటారు? దశరథరాజ పుత్రులు రామలక్ష్మణులున్న కిష్కింధకుపోయి శ్రీరాముని సమీపించి, చాల దుఃఖ

కరమైన వార్తను 'చూడలేదు సీతాదేవిని నేను' అని చెప్పినట్లయితే అతడు ప్రాణాలను విడిచి పెడతాడు. చెవులకు ఇంపు కానిది, భీషణమైనది. భయంకరమైనది, వాడియైనది, ఇంద్రియ క్షోభం కలిగించేది, సీతాదేవి గురించి చెప్పరానిది అయిన మాటను రాముడు విని మరి బ్రతుకడు. రాముడు చాల కష్టమైన స్థితిలో ఉండి, చనిపోవడానికి నిశ్చయించాడని చూసి, అన్నయందు ఆసక్తి కలవాడు, మేధావి అయిన లక్ష్మణుడు మరి బ్రతుకడు. అన్నదమ్ము లిద్దరూ చనిపోతే భరతుడు కూడా మరణిస్తాడు. భరతుడు చనిపోగా చూసి శత్రుఘ్నుడు కూడా బ్రతికి ఉండడు. పుత్రులు చనిపోగా చూసి తల్లులు, కౌసల్య, సుమిత్ర, కైకేయి సందేహం లేకుండా చనిపోతారు. చేసిన మేలు మరువనివాడు, సత్యమే వ్రతంగా కలవాడు, కోతులకు రాజా అయిన సుగ్రీవుడు రాముని ఆదురవస్థను చూసి అక్కడే ప్రాణాలు విడుస్తాడు. చెడిన మనసు కలది, బాధ పొందినది, దీనురాలు, సంతోషం లేనట్టిది, తపస్సు చేసేటట్టిది, పతి చనిపోయిన దుఃఖం చేత పీడింపబడినది అయిన రుమ ప్రాణాలు విడుస్తుంది. తార కూడా రాజయిన సుగ్రీవుడు చనిపోగా, ప్రాణాలు వదులుతుంది. తల్లిదండ్రులు చనిపోయి, సుగ్రీవుడు నశించి ఉండగా పుత్రుడైన అంగదుడు ఏ విధంగా జీవించగలడు?

"ప్రభువైన సుగ్రీవుడు మరణించడం చేత దుఃఖపీడితులైన వానరులు పిడికిళ్లతో కొట్టుకొని రాళ్లకు తలలు బాదుకుంటారు. మంచి మాటలతో బహుమానాలతో, గౌరవాలతో, కీర్తిశాలియైన వానరరాజా సుగ్రీవునిచే లాలింపబడుతున్న వనౌకసులు ప్రాణాలు విడుస్తారు. అడవులందు కాని, కొండలమీద కాని, కట్టుబాట్లలోకాని, తిరిగి కపిశ్రేష్ఠులందరూ కలసి క్రీడలు జరుపుకోలేరు. ప్రభువు చనిపోయాడనే దుఃఖం చేత పీడింపబడిన వానరులు తమ పుత్రులు, భార్యలు, మంత్రులు అందరితో కలసి, కొండ చివరల నుండి మిట్టపల్లాలుగా నున్న భూమి మీద పడిపోతారు. విషం త్రాగుతారు. ఉరిపోసుకుంటారు. లేకపోతే అగ్నిలో ప్రవేశిస్తారు. వానరులు, ఉపవాసముండి కాని, ఆయుధాలతో పొడుచుకొని కాని చచ్చి పోతారు. నేను కిష్కింధకు పోతే భయంకరమైన ఏడుపే మిగులుతుంది. ఇక్ష్వాకుల వంశం నశించుతుంది. వానరులకు నాశనం సంభవిస్తుంది. కాబట్టి నేను ఇక్కడి నుండి కిష్కింధానగరానికి పోను. సీతాదేవిని దర్శించకుండా నేను సుగ్రీవుని చూడడం సాధ్యం కాదు. నేను వెళ్లక ఇక్కడనే ఉండిపోతే ధర్మాత్ములు, మహారథులు

అయిన రామలక్ష్మణులు, మానవంతులైన వానరులు, సీతాదేవిని చూడగలమన్న ఆశతో జీవిస్తారు.

"నేను మాత్రం చేతికందినవి, నోటి కందినవి తింటూ, చెట్ల మొదళ్లను నివసిస్తూ, సీతాదేవిని చూడలేనివాడనై వానప్రస్థుడనవుతాను. లేదా, బాగా దుంపలు, పళ్లు, జలాలు లభించే సముద్రతీరంలో చితిని పేర్చి, ప్రజ్వలిస్తున్న అగ్నిలో ప్రవేశిస్తాను. లేదా, ఒక చోట కూర్చొని సన్న్యాస సాధన చేస్తున్న నా శరీరాన్ని కాకులు, ఘాతుకమృగలు భక్షిస్తాయి. చనిపోడానికి మహర్షులు చెప్పిన మార్గం ఇదేనని తలుస్తాను.

"సీతాదేవిని చూడకపోతే నీళ్లలో మునిగిపోతాను.

"మొదట లంకను జయించడం వలన ఉత్తమమైన ప్రారంభం కలది, చంద్రోదయం చేత రమ్యమైనది, నాకీర్తితో నిండి నట్టిది, యశస్సును కలుగు జేసేది అయిన ఈ రాత్రి, సీతాదేవిని చూడలేకపోవడం చేత నిష్ఫలమయి, నాకు దీర్ఘరాత్రిగా పరిణమిస్తుంది.

"లేకపోతే నియమవంతుడనై చెట్ల మొదళ్ల నివసించి తాపసిగా నైనా అవు తాను. నల్లని కన్నులు కల సీతాదేవిని చూడకుండా ఇక్కడ నుండి నేను మరలిపోను. సీతాదేవిని చూడకుండా నేను వెళ్లిపోతే అంగదుడు, అతనితో నున్న సర్వవానరులు బ్రతుకరు.

"నేనీ విధంగా క్షీణించి మరణించడానికి యోగ్యుడను కాకపోతే, చిరకాలం జీవించవలసినవారున్న అశోకవనాన్ని చూస్తాను.

"మరణిస్తే ఎన్నో దోషాలు సంభవించుతవి. బ్రతికి ఉంటే శుభాలను చూడ వచ్చు. అందుచేత నేను ప్రాణాలను ధరిస్తాను. బ్రతికి ఉంటే తప్పకుండా శ్రేయస్సు కలుగుతుంది."

ఈ విధంగా హనుమంతుడు చాల విధాలుగా దుఃఖాన్ని మనసులో ఉంచుకొని విచారం నుండి ఒడ్డు చేరుకోలేకపోయాడు.

"పది తలలు కల మహాబలుడైన రావణునైనా వధిస్తాను. అతడు అపహరించి

తెచ్చిన సీతాదేవి అలాగే ఉండనీ! లేకపోతే సముద్రం మీదుగా ఎగిరి యజ్ఞ పశువును అగ్నికి సమర్పించినట్లు రావణుని రామునికి అప్పజెప్తాను" ఈ విధంగా, సీతాదేవిని చూడలేకపోయిన హనుమంతుడు చింతించాడు.

హనుమంతుడు నిశితమైన ఆలోచనతోను, విచారంతోను నిండిన మనసు కలవాడై, ఈ విధంగా ఆలోచించాడు:

"రాముని భార్యా, యశస్వినీ అయిన సీతాదేవిని ఎంతవరకు చూడగలనో అంతవరకు ఈ లంకాపురిని మరల మరల వెదకుతాను. సంపాతి మాటలను బట్టి రాముడిని ఇక్కడికి తెచ్చినట్లయితే ఆ రాఘవుడు భార్యను కానక వానరుల నందరినీ కాల్చివేస్తాడు. అందుచేత ఇక్కడనే నేను ఆహారనియమాన్ని పాటించి, ఇంద్రియాలను అదుపులో నుంచి నివసిస్తాను. నేను కారణంగా అందరు నరులు, వానరులు నశించరాదు.

"ఈ అశోకవనం మహావృక్షాలతో కనిపిస్తూ ఉంది. ఈ వనం నేను వెదుకలేదు. దీనిలోకి ప్రవేశిస్తాను. వసువులను, రుద్రులను, అట్లే ఆదిత్యులను అశ్వినులను, మరుత్తులను నమస్కరించి, రాక్షసులకు శోకాన్ని పెంపొందిస్తూ అశోకవనాన్ని ప్రవేశిస్తాను. రాక్షసుల నందరినీ జయించి, తపస్సు చేసే వారికి సిద్ధినిచ్చినట్లే, ఇక్ష్వాకు కులానికి ఆనందమిచ్చే సీతాదేవిని రామునికి సమర్పిస్తాను."

విచారం చేత వ్యాకులపాటు చెందిన ఇంద్రియాలు కలవాడై, ఒక క్షణం ధ్యానించి, వాయుపుత్రుడూ మహాతేజశ్శాలీ అయిన హనుమంతుడు లేచి నిలబడ్డాడు.

"నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై
నమోఽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యః
నమోఽస్తు చంద్రార్క మరుద్గణేభ్యః.

రామునికి నమస్కారము లక్ష్మణునికి నమస్కారము - జనకుని పుత్రియైన ఆ సీతాదేవికి నమస్కారము- రుద్రునికి, ఇంద్రునికి, యమునికి, వాయువుకు నమ స్కారము. చంద్రుడికి, సూర్యుడికి, మరుద్గణాలకు నమస్కారము."

ఇట్లు వానరులందరికీ, సుగ్రీవుడికి హనుమంతుడు నమస్కరించి అన్ని

దిక్కులు పరికించి చూసి, అంతకు పూర్వమే మంగళకరమైన అశోకవనాన్ని మనసుతోనే ప్రవేశించి, అటు పిమ్మట చేయవలసిన పనిని గురించి ఆలోచించాడు.

"అశోకవనంలో చాలమంది రాక్షసులు తప్పకుండా ఉంటారు. చాల చెట్లు కూడా ఉంటాయి. అన్ని విధాల సంస్కారం పొందిన ఈ అశోకవనం వెదుక దగ్గది. ఇక్కడ నున్న చెట్లకు రాక్షసులు తప్పకుండా కాపుంటారు. భగవంతుడూ, అంతటనూ వ్యాపించిన వాడూ అయిన వాయువు కూడా చెట్లను బాగా కదలుస్తూ వీచడు.

"నాకోసం, రాముని ప్రయోజనం సాధించడం కోసం, రావణుని కోసం, నేను చిన్నదైన శరీరాన్ని దాల్చాను. దేవతలు ఋషిగణాలతో కలసి, నాకు కార్యసిద్ధిని చేకూర్తురు కాక! తనంతటతానే జన్మించిన వాడు భగవంతుడు అయిన బ్రహ్మ, దేవతలు, అగ్ని, వాయువు, వజ్రాయుధం ధరించిన దేవేంద్రుడు, పాశం చేత ధరించిన వరుణుడు, చంద్రుడు, సూర్యుడు, మహాత్ములైన అశ్వినీ దేవతలు, మరుత్తులు, శివుడు - వీరందరూ నాకు కార్యసిద్ధిని కలిగించుదురు గాక! సకల భూతాలు, ఆ భూతాలకు ప్రభువైన విష్ణువు నాకు సిద్ధిని కూర్చుదురు గాక! అట్లే నాకు కనిపించనివారు, దారిలో కనిపించే వారు అయిన దేవతలు కార్యసిద్ధిని కలిగింతురుగాక!

"ఉన్నతమైన నాసిక గలది, తెల్లని పలువరస గలది, అనవద్య అయినది, శుభ్రమైన చిరునవ్వు కలది, తామరేకులవంటి కన్నులుకలది, నిర్మలుడైన చంద్రుని వలె ఆహ్లాదకరమైన దర్శనము కలది అయిన సీతాదేవి ముఖాన్ని నేనెప్పుడు చూస్తాను? నీచుడు, పాపి, క్రూరకార్యాలు చేసేవాడు, భయంకరుడైనా ఆభరణాలతో అలంకరింపబడినవాడు అయిన రావణుని చేత బలవంతంగా పీడింపబడిన తపస్విని, అబల అయిన సీతాదేవి ఎప్పుడు నాకంట బడుతుంది?"

మహాతేజశ్శాలియైన హనుమంతుడు కొంచెం సేపు ఆలోచించి సీతాదేవిని మనసులో తలచి, ఆ భవనం యొక్క ప్రాకారం పైకి ఎగిరాడు. ప్రకారం మీద కూర్చున్న మహావానరుడు వసంతమాసారంభమందు పూసిన చివుళ్లు కల పలు రకాలైన చెట్లను చూశాడు.

మామిడి చెట్లతో కప్పబడ్డది, వందలకొలది తీగలచే చుట్టబడ్డది అయిన

వనంలోకి నారి నుండి విడువ బడ్డ బాణానికి మల్లే హనుమంతుడు ప్రవేశించాడు.

మృగాలు పక్షులు కలది, మనుష్యులు ఆనందించే వసంతకాలంలో మదించిన నెమళ్లతో నున్నది, ఎన్నో రకాల పక్షులు కలది అయిన అశోకవనంలో అనవద్యయైన రాజకుమారి, వరారోహ అయిన సీతాదేవిని హనుమంతుడు వెదకుతూ హాయిగా నిద్రపోతున్న పక్షులను మేలు కొలిపాడు.

వేగవంతుడైన హనుమంతునిచే చెట్లన్నీ వేగంగా కదల్చబడ్డవి. పూవులు పళ్లు చెట్లనుండి జారిపడ్డవి. ఆ చెట్లు ఎలా ఉన్నవంటే జూదంలో వస్త్రాలను, ఆభరణాలను ఓడిపోయిన ధూర్తులవలె ఉన్నవి. జుట్టు ముడివీడి, ఒంటికి పట్టించుకున్న రంగులు తొలగి, చుంబింపబడిన దంతాలు పెదవులు కల యువతి దంతక్షతాలతోను, నఖక్షతాలతోను ఏ విధంగా ఉంటుందో ఆ విధంగా అశోకవనం కనిపించింది. హనుమంతుడితోకతోను, చేతులతోను, కాళ్లతోను బాగా మర్దింపబడి, బాగా విరిగిన వృక్షాలు కల అశోకవనం, అన్ని విధాల నలిగిన యువతివలె కనిపించింది.

వర్షాకాలంలో వింధ్య పర్వతం మీద ముసురు కున్న మేఘాల గుంపులను ఏ విధంగా వాయువు చెదరగొడుతుందో ఆ విధంగా హనుమంతుడు వేగంగా పెద్ద లతల గుంపులను చెదరగొట్టాడు.

అశోకవనంలో హనుమంతుడు సంచరిస్తూ మనోహరాలైన మణికుట్టి మాలను, వెండి బంగారు రేకులతో కప్పిన నేలలను చూశాడు. తామరపూలతోను, కలువలతోను నిండి ఉన్న దిగుడు బావులను చూశాడు.

అప్పుడతడు మేఘం వలె చాల ఎత్తైన శిఖరమున్న పర్వత మొకటి చూశాడు. ఆ కొండ కొమ్ము చాల విచిత్రంగా ఉంది. అంతటా శిఖరాలు దానిని చుట్టి ఉన్నాయి. కొండనుండికిందికి పడుతున్న నదిని అతడు చూశాడు. ఆ దృశ్యం ప్రియుడి ఒడి నుండి లేచి కిందపడుతున్న ప్రియురాలివలె ఉంది.

కొన్ని చెట్లకొమ్మలు ఆనదిలోకి వంగి ఉన్నవి. ఆ దృశ్యం కోపంతో పోతున్న వనితను బంధుజనులు ఆపుతున్నట్లుంది. ఆనది కొంత దూరం పోయి తిరిగి వచ్చింది. పతి మీద కోపం విడిచి ప్రసన్నురాలై తిరిగి వచ్చిన కాంతవలె ఆనది కనిపించింది.

హనుమంతుడు ఆ నదికి సమీపంలో పలురకాలైన పక్షుల గుంపులు కల తామర కొలనులను చూశాడు. మణులు తాపిన మెట్లు కలది, ముత్యాల పొడి వంటి ఇసుక కలది, కృత్రిమంగా నిర్మించినది అయిన దిగుడు బావిని హనుమంతుడు చూశాడు.

అక్కడొక శింశుపా వృక్షముంది. దాని చుట్టూ పలురకాలైన జంతు సమూహాలున్నవి. చిత్రములైన వనాలు విచిత్రంగా కనిపిస్తున్నవి. విశ్వకర్మచే నిర్మింపబడిన మేడలు చుట్టూ ఉన్నవి. కృత్రిమమైన ఉద్యానవనాలు ఆ చుట్టు పట్ల అలంకరిస్తున్నవి. అక్కడ ఏ చెట్లు ఉన్నవో, అవి పూలు పూస్తున్నాయి. పళ్లతో నిండి ఉన్నాయి. ఆ చెట్ల క్రింద గొడుగు లున్నాయి – వాటికింద బంగారు వేదికలు నిర్మింపబడి ఉన్నాయి. అనేక లతలు, పందిళ్లు అక్కడ ఉన్నాయి. శింశుపా వృక్షం చాల ఆకులతో చుట్టబడి ఉంది– బంగారు వర్ణంలో ఉంది. దానిని హనుమంతుడు చూశాడు.

హనుమంతుడు గోతులతోను, ఊటలతోను కూడిన భూమిభాగాలను అగ్నివలె మెరుస్తున్న బంగారు రంగుకల శింశుపావృక్షాలను మరికొన్నిటిని చూశాడు. ఆ బంగారు చెట్ల కాంతులలో, ఏ విధంగా మేరు పర్వతపు కాంతులతో సూర్యుడు ప్రకాశించుతాడో ఆ విధంగా హనుమంతుడు ప్రకాశించి, ఆ వీరుడైన వానరుడు తాను బంగారపు కాంతి కలవాడనని తలచాడు. చుట్టూ ఉన్న బంగారు చెట్ల మీద గాలి వీచగా, వందలకొలది మువ్వలసవ్వడి వినిపించగా, ఆ శింశుపా వృక్షాన్ని చూసి హనుమంతుడు ఆశ్చర్యపడ్డాడు. పూచిన చిగురులు కలది, మనోహరమైనది, లేత కొత్త చివుళ్లు కది, ఆకులతో నిండినది అయిన శింశుపా వృక్షాన్ని హనుమంతుడెక్కి ఈ విధంగా తలచాడు.

"రాముని చూడవలెనని ఉవ్విళ్లూరుతున్న సీతాదేవిని ఇక్కడ చూస్తాను. దుఃఖంచేత పీడింపబడి ఇక్కడిక్కడే అప్రయత్నంగా తిరుగుతున్న ఆమెను చూస్తాను. మనోహరమైన ఈ అశోకవనం నిశ్చయంగా పాపాత్ముడైన రావణునిదే. ఇది సంపెంగ చెట్లతోను, గంధపు చెట్లతోను, పొగడ చెట్లతోను అలంకరింప బడి ఉంది. పక్షులు సేవిస్తున్న ఈ తామర తీగ చాల అందంగా ఉంది. రాముని పట్టపు రాణియైన సీతాదేవి తప్పక దీని దగ్గిరికి వస్తుంది. సీతాదేవి అడవులందు తిరుగుటలో

నేర్పు కలది. కాబట్టి తప్పక ఇక్కడికి వస్తుంది. చక్కనిది, ఉత్తమమైన శరీర వర్ణం కలది, సంధ్యా కాలాన్ని ఎదురుచూసేది అయిన జానకీదేవి మంగళకరమైన జలాలు కల నదికి సంధ్యోపాసనకు తప్పక వస్తుంది."

మహాత్ముడైన హనుమంతుడు ఈ విధంగా తలచి, రాజయిన రాముని భార్య కోసం ఎదురుచూస్తూ, చక్కగా పూసిన శింశుపావృక్షపు దట్టమయిన ఆకులమధ్యను దాగి అంతా చూస్తూ కూర్చున్నాడు.

హనుమంతుడు శింశుపావృక్షం మీద కూర్చుండి అక్కడ నుండి సీతాదేవిని వెదకుతూ భూమి నంతటినీ పరిశీలిస్తూ తన దృష్టిని ప్రసరించాడు.

అన్ని ఋతువులలో పూచేపూలతోను, పండ్లతోను నిండిన చెట్లతో మనోహరముగ నున్నది, పుష్పించిన అశోకవృక్షాల కాంతిచేత సూర్యోదయపు వెలుగులు కలది, జ్వలిస్తున్నట్లున్నది అయిన అశోకవనమును అక్కడ కూర్చున్న మారుతి చూశాడు.

పూవులనే వందలకొలది రత్నాలతో ఆ వనము నాలుగు సముద్రాలకు మించిన అయిదవ సముద్రంవలె కనిపించింది. ఆ వనం ప్రసిద్ధమైన గంధమాదన పర్వతం వలె శోభించింది.

ఆ అశోకవనమందు, దగ్గరలోనే ఉన్న భవనమును వానరశ్రేష్ఠుడు చూశాడు. ఆ భవనం మధ్యను వేయిస్తంభాలున్నవి; కైలాసపర్వతం వలె తెల్లగా వెలుగుతున్నది. ఆ భవనపు మెట్లు పగడాలతో పొదగబడ్డవి. వేదికలు బంగారంతో నిర్మింపబడి మెరుస్తున్నవి. ఆ భవనం స్వచ్ఛంగా ఉండి ఆకాశాన్ని తగులుతున్నట్లుంది.

అక్కడ మాసిన బట్టలు ధరించినది, రాక్షసస్త్రీల చేత చుట్టబడినది, ఉప వాసాల చేత చిక్కినది, దీనురాలు, మాటిమాటికి నిట్టూర్పులు విడుస్తున్నది, శుక్ల పక్షపు తొలి భాగంలో కనిపించే చంద్రరేఖవలె నిర్మలంగా ప్రకాశించుతున్నది చూడడంతోనే ఆమె సీతయని గుర్తించడం కుదరకపోయినా చక్కని ప్రకాశముగల ఆమెను, పొగలచే కమ్మబడిన అగ్ని శిఖవలె ఉన్నదని అనుకుంటారు.

సీతాదేవి కట్టిన ముఖ్యమైన వస్త్రం పసుపు పచ్చగా నుండి మాసిపోయింది. ఆమె ఒకే వస్త్రం కట్టుకుంది. మురికితో కూడి, ఆభరణాలు లేకుండా తామర పూలు లేని కొలను వలె ఆమె ఉంది.

సిగ్గుతోను, దుఃఖంతోను దహింపబడినది, శోభతరిగిపోయి దయనీయ స్థితిలో నున్న సీతాదేవి కుజగ్రహం చేత పీడింపబడిన రోహిణి వలె కనబడుతున్నది.

కన్నీరు నిండిన ముఖంతోను, దైన్యంతోను, భోజనం చేయక పోవడం చేత చిక్కిపోయి తన స్థితికి విచారిస్తూ ఎల్లప్పుడూ దుఃఖంలోనే మునిగిన సీతాదేవిని, తనకు ఇష్టులైన వారిని కానలేక రాక్షసస్త్రీలగుంపులనే చూస్తున్న ఆమెను, తోటి లేళ్లనుండి విడిపోయి వేటకుక్కలచేత చుట్టబడిన ఆడులేడివలె ఉన్నదానిని, వర్షాకాలం గడచిన తరువాత దట్టమైన అరణ్యాలు కల భూమి వలె కనిపించినదానిని, సుఖాలను అనుభవించుటకు తగిన దానిని, దుఃఖం చేత పీడింప బడుతున్న దానిని, కష్టాలను అనుభవించడం తెలియని దానిని, చాల హెచ్చుగా మురికితో నున్న దానిని, సన్నగిల్లిన దానిని, వెడల్పు కన్నులుకల దానిని, చూసి చెప్పబోయే కారణాలచేత ఆమె సీతాదేవి అని హనుమంతుడు తర్కించాడు.

ఆనాడు కామరూపం ధరించిన రాక్షసునిచే అపహరింపబడినప్పుడు ఆమె ఏ రూపంలో ఉందో ఇప్పుడు కూడా అదే రూపంలో ఉంది. ఆమె పున్నమి నాటి చంద్రుని వంటి ముఖంతోను, చక్కని కనుబొమ్మలతోను, సుందరములైన గుండ్రనైన స్తనములతోను, తన కాంతి చేత అన్ని దిక్కులచీకట్లను పోగొడుతున్న దేవిని, నల్లటికురులు కలదానిని, బాగుగా కూర్చున్న దానిని, తామరరేకులవంటి కనులు కలదానిని, మన్మథుని రతీదేవి ఎట్లుంటుందో ఆ విధంగా నున్న దానిని, పున్నమి చంద్రుని వెన్నెల ప్రపంచమంతటికి ఏ విధంగా ఇష్టమైనదో అటువంటి దానిని, నియమవతియైన తపస్వినివలె భూమి మీద కూర్చున్న ఉత్తమ శరీరం కలదానిని, సర్పరాజు భార్యవలె హెచ్చుగా నిట్టూర్చుతున్న దానిని, భయపడిన దానిని, గాఢమైన శోకంచేత ప్రకాశించని దానిని, పొగక్రమ్మిన అగ్ని శిఖవలె శోభించని దానిని, సందేహం కలధర్మశాస్త్రం వలె నున్న దానిని, క్షీణించిన సంపద వలె కనిపిస్తున్న దానిని హనుమంతుడు చూశాడు. సడలిపోయిన శ్రద్ధ వలెను, విఫలమైన ఆశవలెను సీతాదేవి కనిపించింది.

ఇంకా ఆమె, అడ్డు తగిలిన కార్య సిద్ధివలె, మలినమైన ఆలోచనవలె, మిథ్యాపవాదంచేత పతనమైన యశస్సువలె కనిపించింది.

కృశించిన దానిని, మురికియైన శరీరం కలదానిని, ప్రతిపదియైన విద్యవలె

నున్న దానిని, రాముని సమాగమానికి ఆటంకం కలుగుటచేత బాధపడుతున్న దానిని, రాక్షసుడు అపహరించుటచేత సన్నబడిన దానిని, అబలను, పిల్లలేడి కనుల వంటి కనులు కలదానిని, ఇటు అటు భయంతో చూస్తున్నదానిని, కన్నీరు బాగా నిండిన నల్లని వంకర చెందిన కనురెప్పలు కలదానిని, అప్రసన్నమైన ముఖంతో మాటిమాటికి నిట్టూర్చుతున్న దానిని, మురికితో కూడిన దానిని, దీనురాలిని, అలంకారాలు ధరించడానికి యోగ్యత కలదైనా ఆభరణాలు లేనిదానిని, నక్షత్రాల ప్రభువైన చంద్రుడి యొక్క కాంతి కాలమేఘంచేత కప్పబడినట్లు ఉన్న దానిని చూసి, ఆమె సీతాదేవియేనా అన్న సందేహం హనుమంతుడికి మళ్ళీ కలిగింది.

అభ్యానం లేకపోవడం చేత తరిగిన విద్యవలె ఆమె కనిపించింది. అలంకారాలు లేని ఆమెను హనుమంతుడు చూసి మిక్కిలి కష్టంతో సీతాదేవి అనిపోల్చుకున్నాడు.

శరీరం సంస్కారంలేక (స్నానాదులులేక) అలంకారాలు లేని కవివాక్కువలె నున్న దానిని, కొని యాడదగిన దానిని, విశాలమైన కనులు కలదానిని, రాజ కుమారిని సీతాదేవియని హనుమంతుడు భావించాడు.

రాముడు సీతాదేవి శరీరం మీద ఏయే ఆభరణాలను కీర్తించాడో ఆ ఆభరణసముదాయం చెట్టుకొమ్మని అలంకరించడం హనుమంతుడు చూశాడు.

"చక్కని కుండలాలు, కర్ణాభరణాలు, మణులు, పగడాలు పొదిగిన హస్తా భరణాలు, చాల కాలం నుండి ధరించకపోవడంచేత నలుపెక్కినవి, ఆ ఆభర ణాలు ఉండుచోట్ల వాటి ముద్రలు కలవి-రాముడు ఏ ఆభరణాల గురించి చెప్పి నాడో అవే ఇవని నేననుకుంటాను. ఆమె ఋశ్యమూక పర్వతం మీద ఏ ఆభర ణాలను జార విడిచిందో అవి కనిపించడంలేదు. ఆమె ఏ నగలను జారవిడు వలేదో అవే ఇవి అని నేననుకుంటాను. దీనికి సందేహం లేదు. పసుపుపచ్చనిరంగు కలిగి బంగారు జరీతో చేయబడిన ఏ వస్త్రం విడువబడ్డదో ఆ శుభప్రదమైన ఉత్తరీయం, కొండమీద విడువబడ్డది, కోతులకు కనిపించింది. ముఖ్యమైన ఆభరణాలు భూమి మీద కనబడ్డాయి. ఆ గొప్ప ఆభరణాలు చప్పుడు చేస్తుంటే వానరులు చూశారు. ఈమె చాల కాలం నుండి ధరిస్తున్న చీర మాసి పోయింది. అయినా ఆ చీర యొక్క కాంతి అక్కడ విడిచిన ఉత్తరీయం కాంతికి ఏ మాత్రం తీసిపోదు.

"ఈ బంగారు రంగు గల శరీరం కలది, రామునికి ప్రియమైన పట్ట

మహిషి అయిన సీతాదేవి దొంగిలింపబడినా రాముని మనస్సులో మాత్రం నశించదు. ఈమె కొరకు రాముడు నాలుగు విధాలుగా బాధింపబడుతున్నాడు. ఈమెపై దయతోను, అనుతాపంతోను, దుఃఖంతోను, ప్రేమతోను రాముడు పీడింప బడుతున్నాడు. తన స్త్రీ కనిపించలేదని కారుణ్యంతోను, తనను ఆశ్రయించిన ఆమె కనిపించలేదని పరితాపంతోను, తన ప్రియ భార్య అగుపడలేదని దుఃఖంతోను, ప్రియురాలు కనపడలేదని మదన బాధతోను రాముడు పీడింపబడుతున్నాడు. ప్రతి అవయవము సుందరంగానున్న ఈ సీతాదేవి రూపం రాముడికి తగి ఉంది. రాముని యొక్క సౌష్ఠవమైన రూపం ఈ నల్లని కనులుగల సీతాదేవికి తగి ఉంది. ఈ దేవి యొక్క మనస్సు రాముని యందు అతని మనస్సు ఈమె యందు నెలకొని ఉన్నవి. అందుచేత ఆ ధర్మాత్ముడైన రాముడు క్షణమైనా జీవించ గలుగుతున్నాడు. ఈమె దగ్గిర లేకపోవడం వలన రాముడు కష్టమైనపనే చేశాడు. తన శరీరాన్ని నిలబెట్టుకుంటున్నాడు. శోకం చేత నాశనం కాలేదు. ఈ ఉత్తమమైన స్త్రీని విడిచి రాముడు చాల కష్టమైన పనే చేస్తున్నాడు. సీతాదేవి లేకపోతే మహాబాహువైన రాముడు క్షణం కూడా బ్రతుకలేడు."

సీతాదేవిని చూసి వాయుపుత్రుడు ఈ విధంగా తలచి సంతుష్టుడయాడు. ప్రభువైన రాముని స్మరించి అతని గుణాలను ప్రశంసించాడు.

ప్రశంసించ దగిన సీతాదేవిని, గుణాభిరాముడైన శ్రీరాముని కొనియాడి వానరోత్తముడైన హనుమంతుడు తిరిగి చింతాక్రాంతుడయాడు. ఒక్క క్షణం కన్నీళ్లు నిండిన వాడై తేజస్వియైన అతడు సీతాదేవి గురించి ఇట్లు విలపించాడు.

"గురువుల వద్ద సుశిక్షితుడైన లక్ష్మణునికి పూజంపదగినది, రామునికి అత్యంత ప్రియమైనది అయిన సీతాదేవి కూడా దుఃఖంతో పీడింపబడడం చూస్తే, ఎవరికీ కాలన్ని అతిక్రమించడం సాధ్యంకాదని తోస్తుంది.

"తన పనిని తెలిసిన రాముని ప్రయత్నాలను, ధీమంతుడైన లక్ష్మణుని ప్రయత్నాలను తెలిసిన సీతాదేవి,కొత్తనీరు చేరిన గంగానది వలె ఏ విధంగా కలత బారదో, ఆ విధంగా క్షోభించడం లేదు.

"రాముని వయసుకు సరియైన వయసు కలది, అతని శీలానికి తగిన ప్రవర్తన కలది, తన వారిని రక్షించుటలో అతనికి సాటియైనది, నల్లని కనులు

కలది అయిన విదేహ రాజపుత్రిక, రామునికి భార్యగా ఉండదగినది. రాముడు ఆమెకు భర్తగా ఉండదగినవాడు."

కొత్త బంగారంవలె ప్రకాశిస్తున్నది, లోకానికి ప్రియమైన లక్ష్మీదేవివలె ఉన్నది అయిన సీతాదేవిని మనసులో రాముడినిచేర్చి హనుమంతుడీ మాట పలికాడు;

"ఈ వెడద కన్నులు కల సీతాదేవి కారణంగా మహాబలుడైన వాలి చంప బడ్డాడు. రావణునితో సమానమైన పరాక్రమం కలకబంధుడు నేల కూల్చబడ్డాడు.

"ఏ విధంగా శంబరుడు దేవేంద్రుని చేత చంపబడ్డాడో ఆ విధంగా పరాక్రమం చూపిన రామునిచేత అరణ్యంలో భీమవిక్రముడైన రాక్షసుడు విరాధుడు చంపబడ్డాడు.

"భయకంరముడైన పనులు చేసే పదునాలుగువేల రాక్షసులు జనస్థానంలో అగ్ని శిఖలతో సాటియైన బాణాలతో రాముని చేత చంపబడ్డారు.

"ఆత్మ విదుడైన రామునిచేత యుద్ధమందు ఖరుడు, త్రిశరుడు, దూషణుడు అనే తేజశ్శాలురైన రాక్షసులు చంపబడినారు.

"ఈమె యే కారణంగా, వాలిచేత పాలింపబడి, పొందుటుకు వీలు లేనిది, లోకంలో గౌరవం పొందినది అయిన వానరరాజ్యాధి పత్యాన్ని సుగ్రీవుడు పొందాడు. నదములకు, నదులకు పతియైన సాగరుడు నాచేత దాట బడ్డాడు. ఈ విశాలాక్షి నిమిత్తమే ఈ నగరం కూడా నాచే చూడబడింది. ఈమె కోసం, సముద్రమే ఎల్లలుగా గల భూమిని రాముడు తలక్రిందులు చేసినా, ఆ పని యుక్త మేనని నాకు అనిపిస్తున్నది. మూడు లోకాలయందు సార్వభౌమత్వమూ లేక జనకుని కూతురైన సీతాదేవియా గొప్పదని విచారిస్తే, మూడులోకాల ఏలుబడి అంతా సీతాదేవితో కొంచెమైనా సాటికాదు.

"ఈ సీతాదేవి ధర్మశీలుడు, మహాత్ముడు, మిథిలకు చెందినవాడు అయిన జనకరాజు కూతురు; భర్తయందు దృఢమైన భక్తి కలది. తామరల పుప్పొడివలె వెదజల్లబడిన మంగళకరములైన పంటభూముల ధూళిలో నాగేటి చాలున భూమిని చీల్చుకొని పైకి వచ్చినది ఈమె. పరాక్రమవంతుడు, ఉత్తమమైన స్వభావం కలవాడు, సమరమందు వెనుకకు తిరుగని వాడు అయిన దశరథ మహారాజుకు

యశస్వినియైన ఈమె పెద్ద కోడలు. ధర్మం తెలిసినవాడు, కృతజ్ఞుడు, ఆత్మ విదుడు అయిన రాముని యొక్క భార్య అయిన ఈమె రాక్షస స్త్రీలకు చిక్కింది. అన్ని సుఖాలను విడిచిపెట్టి, భర్తయందలి ప్రేమచే బలవంతపెట్టబడి, దుఃఖాల గురించి ఆలోచించకుండా మనుష్యులు లేని అరణ్యం ప్రవేశించింది. ఈమె పండ్లు దుంపలతో సంతుష్టి చెంది భర్తకు సేవచేయుటయందే మనసు నిలిపి అడవిలో కూడా రాజభవనంలో ఉన్నట్లే నివసిస్తున్నది.

"బంగారు రంగుగల ఈమె ఎప్పుడూ చిరునవ్వు తోనే మాట్లాడే సాధ్వి. కష్టాలను అనుభవించరాని ఈమె, బాధలను ఓర్చుకుంటున్నది. రావణుని చేత పీడింపబడుతున్న శీలసంపన్న అయిన ఈమెను, చల్లని నీరిచ్చే చలివేంద్రను దప్పిక గొన్నవాడు చూచినట్లు, రాముడు చూడడానికి తగినవాడు. రాముడీమెను తిరిగి పొంది ప్రీతిని పొందుతాడు. రాజ్యం పోగొట్టుకున్న రాజు తిరిగి ధరణిని పొందిన సంతోషం రాముడు పొందుతాడు.

"స్రక్ చందనాది భోగాలను విడిచిపెట్టి బంధువులకు దూరమైన ఈమె రామునితో సమాగమం కోరుతూ తన శరీరాన్ని నిలుపుకొన్నది. ఈమె రాక్షస స్త్రీలను కాని పూలమొక్కలను కాని ఫలవృక్షాలను కాని చూడడం లేదు. రాముని యందే హృదయం నిలిపి అతనినే ధ్యానిస్తున్నది.

"స్త్రీలకు ఆభరణాలకంటే పతి అన్న భూషణం ఉత్తమమైనది. ఈమె ఆ భర్తకు దూరమై అలంకారధారణకు యోగ్య అయినా అవి లేక శోభను చెంద కుండా ఉంది.

"రాముడు ఈమె లేకుండా జీవిస్తున్నాడు. ఇది చాల కష్టమైనపని. దుఃఖానికి లొంగి నశించకుండా శరీరం ధరించి ఉన్నాడు.

"నల్లటి కురులు కలదానిని, పద్మపత్రాలతో సమానమైన కనులు కలదానిని, సుఖాలకు యోగ్య అయిన దానిని, దుఃఖిస్తున్న ఈమెను చూసి నావంటి వాడి మనసు కూడా బాధపడుతున్నది.

"ఎవతె ఓర్పు నందు భూదేవికి సాటియైనదో, పద్మాలను పోలిన కన్నులు కలదో, ఎవతె రామలక్ష్మణుల చేత రక్షింపబడినదో, ఆమె ఇప్పుడు వికారమైన చూపులు కల రాక్షస స్త్రీలచేత శింశుపావృక్షం మొదలున కాపాడబడుతున్నది.

"తామరతీగ మంచుకు కొట్టబడి సొగసు చెడుతుంది. ఆ విధంగానే కష్టాల పరంపరచేత పీడింపబడినదై సహచరుని ఎడబాసిన చక్రవాక పక్షివలె, జనకుని సుతయై సీతాదేవి దయనీయమైన స్థితిని పొందింది.

"శోకం పోగొట్టేవి, పూల బరువుకు వంగిన కొమ్మలు కలవి అయిన అశోక వృక్షాలు కూడా ఈమెకు శోకమే కలిగిస్తున్నవి. చంద్రుడు సహస్ర కిరణుడు. హేమంత ఋతువు తరువాత మందమైన కాంతిగల అతడు కూడా ఈమెకు శోకమే కలిగిస్తున్నాడు."

ఇట్లు బలవంతుడు, వానరులలో శ్రేష్ఠుడు అయిన హనుమంతుడు అన్ని విషయాలను తనలో చర్చించుకొని, చెట్టుపైన కూర్చుండి, ఆమె సీతాదేవి అన్న దృఢమైన నిశ్చయానికి వచ్చాడు.

అపుడు తెల్ల కలువల సమూహం వలె ప్రకాశించేవాడు, నిర్మలుడు అయిన చంద్రుడు స్వయంగా, నల్లటి నీటిలోకి పోయే హంస వలె నిర్మలమైన ఆకాశం మీద ప్రయాణం చేశాడు. నిర్మలమైన కాంతిగల చంద్రుడు తన కాంతితో స్నేహం చేస్తున్న వాడివలె వాయుపుత్రుడైన హనుమంతుని చల్లని తన కిరణాలతో సేవించాడు.

అటు పిమ్మట పూర్ణచంద్రుని వంటి ముఖంగల సీతాదేవిని హనుమంతుడు చూశాడు. ఆమె బరువుతో నిండిన నావవలె దుఃఖం యొక్క బరువుతో క్రుంగి నట్లుంది.

హనుమంతుడు వైదేహిని చూడకోరినవాడై అక్కడికి దగ్గరలోనే ఉన్న భయంకర రూపాలు కల రాక్షస స్త్రీలను దర్శించాడు.

వికారమైన వేషాలు ధరించినవారు, పింగళ వర్ణం కలవారు, నల్లనివారు, కోపం కలవారు, కలహమందు ఇష్టమున్నవారు, ఉక్కుతో చేసిన పెద్ద శూలాలను కత్తులను ఇనుప గుదియలను ధరించినవారు, పంది ముఖాలవారు, లేడి ముఖాలవారు, పులి ముఖాలవారు, ఎనుబోతుముఖాలవారు, మేక ముఖాలవారు, నక్క ముఖాలవారు, ఏనుగు పాదాలవారు, ఒంటె పాదాలవారు, గుఱ్ఱపు పాదాల వారు, మాంసం రక్తం తో శరీరాలు తడిసిన వాళ్లు, చూస్తే గగుర్పాటు కలిగించే వారు, అయిన రాక్షసులను హనుమంతుడు చూశాడు.

వాళ్లందరూ పెద్ద చెట్టుబోదె చుట్టూ కూర్చున్నారు. ఆ చెట్టు క్రింద కొనియాడ దగిన రాజపుత్రిని సీతాదేవిని మంగళకరుడైన హనుమంతుడు చూశాడు.

కాంతి తరిగినది, దుఃఖం చేత పీడింపబడుతున్నది, మురికి చెందిన జుత్తు కలది, పుణ్యం తరిగిపోగా నెలవు తప్పి నేలను రాలిన చుక్కవలె నున్నది, పతివ్రతా ధర్మాన్ని ఆచరించడంచేత మిక్కిలి కీర్తి పొందినది, భర్తను చూడడం లభించనిది, శ్రేష్ఠములైన ఆభరణాలు లేనట్టిది, పతి యొక్క అనురాగమే అలం కారంగా గలది, రాక్షసుల రాజు చేత నిరోధింపబడినది, చుట్టాలనుండి దూరమై నది, తన గుంపుకు దూరమై సింహంచేత అడ్డబడి కట్టబడిన ఆడ ఏనుగువలె ఉన్నది, వర్షాకాలం గడిచిన తరువాత శరత్కాల మేఘాల చేత ఆవరింపబడిన చంద్ర రేఖవలె నున్నది, మాసిన ఆకారం కలది, దేహ సంస్కారం లేనిది, తీగలు కూర్చని వీణ వంటిది, పతి సన్నిధిని ఉండుటకు యోగ్య అయినది, రాక్షస్త్రీల మధ్యను నివసించుటకు తగనిది, అశోకవనంలో గ్రహాల చేత చుట్టబడిన రోహిణి వలె రాక్షస్త్రీల మధ్య నున్నది, పూవులు లేని లతవలె నున్నది అయిన సీతాదేవిని హనుమంతుడు చూశాడు.

సర్వాంగ సుందరియైనా ఆమె దేహం మురికిగా ఉంది. తామరతీగకు బురద అంటుకుంటే ఒక చోట ప్రకాశిస్తుంది. ఇంకొక చోట ప్రకాశించదు. ఆ విధంగా సీతాదేవి ఉంది.

ఆ దీనమైన ముఖం కల సీతాదేవిని, పతి యొక్క పరాక్రమం తలచుకొని ధైర్యం వహించిన దానిని, తన శీలంచేతనే రక్షింపబడుతున్న దానిని, నల్లని కన్నులు కల దానిని హనుమంతుడు చూశాడు.

ఆమె ఆడ లేడివలె బెదురుతూ అంతటా చూస్తున్నది. చివురుటాకులు నిండిన చెట్లను తన వేడి నిట్టూర్పులతో దహిస్తున్నట్లుంది ఆమె.

శోకముల సమూహం వలె ఆమె కనిపించింది. లేచిన దుఃఖం యొక్క కెరటం వలె ఉంది; ఆమె కృశించింది. ఆమె అవయవాలు చక్కని పొందిక గలవి. ఆభరణాలు లేకుండానే ఆమె శోభిల్లుతున్నది.

హనుమంతుడు సీతాదేవిని చూసి అత్యధికంగా సంతోషం పొందాడు. ఆమది రాక్షిని చూసి సంతోషం వలన కలిగే కన్నీటిని కార్చాడు. వెంటనే రామునికి, లక్ష్మణునికి ప్రణామం చేశాడు.

సీతాదేవిని చూసి ఆనందం పొందిన హనుమంతుడు శింశుపావృక్షపు టాకుల మధ్య దాగున్నాడు.

పుష్పించిన వృక్షాలున్న వనాన్ని చూస్తూ, సీతాదేవిని వెదకుతూ హనుమంతుడుండగా మూడు జాములు గడిచి రాత్రి కొంచెమే మిగిలింది.

ఆరు అంగాలున్న వేదాలను తెలిసిన పండితులు, యాగాలు చేయించగల ఉత్తములు, బ్రాహ్మణత్వంతో కూడిన వారు అయిన రాక్షసులయొక్క వేదఘోషలను రాత్రి ముగుస్తుండగా హనుమంతుడు విన్నాడు.

చెవులకు ఇంపుగా మంగళ వాద్యధ్వనులు వినిపిస్తుంటే మహాబాహువూ మహాబలుడూ అయిన పదితలల రావణుడు మేల్కొన్నాడు.

ప్రతాపవంతుడైన రాక్షసరాజు మామూలుగా లేచే వేళకే లేచి, జారుతున్న దండలు బట్టలు కలవాడై విదేహరాజపుత్రికను తలచాడు.

రావణుడు మిక్కిలి మదించి మన్మథుని ప్రేరణ చేత తన కామాన్ని అదుపులో ఉంచుకోలేకపోయాడు.

అతడు నగలన్నీ ధరించి సాటిలేని కాంతులలో ప్రకాశిస్తూ, మణులతోను బంగారంతోను చేసిన తోరణాలు కల వీథులు చూస్తూ దట్టంగా నున్న చెట్లు కల అశోకవనాన్ని ప్రవేశించాడు.

పౌలస్త్యుడైన రావణుని, దేవకాంతలు గంధర్వకాంతలు నూరుమంది వెంబడించారు. అక్కడ స్త్రీలలో కొంతమంది బంగారు దీపాలు పట్టుకున్నారు. కొందరు చామరాలను, ఇతరులు విసనకఱ్ఱలను ధరించారు. కొందరు బంగారు పాత్రలలో నీరు నింపుకొని ముందు నడిచారు. ఇతరులు కత్తులు, తివాసీలు పట్టుకొని వారి వెంట వెళ్లారు.

మేఘాన్ని మెరుపులు ఏ విధంగా అనుసరిస్తాయో ఆ విధంగా రావణుని ఉత్తమస్త్రీలు, నిద్రతోను మదంతోను వాలిన కన్నులు కలవారై, వీరుడైన పతిని అనుసరించారు.

రావణుని ప్రియభార్యలైన ఆమదిరాక్షులు భర్తయందు కల ఆదరం చేతను కామంతోను అతనిని అనుసరించారు. వారికి పతి, మహాబలుడు అయిన రావణుడు

కామానికి లొంగినవాడై, సీతాదేవిపైన మనసు నిలిపి మత్తెక్కి లీలగా అడుగులు వేశాడు.

అపుడు హనుమంతుడు ఉత్తమ స్త్రీల మొలనూలి చిరుగజ్జెల చప్పుడును, కాలిఅందెల రవళులను విన్నాడు.

అశోకవనం ద్వారం దగ్గిరికి వచ్చిన రావణుని హనుమంతుడు చూశాడు.

రావణుడు కామంతోను గర్వంతోను మదంతోను కూడినవాడు, వంకరగా ఎఱ్ఱగా విశాలంగా ఉన్న కన్నులు కలవాడు, తన చెరకు విల్లును విడిచి ఎదుటికి వచ్చిన మన్మథునివలె ఉన్నవాడు. తరచిన అమృతం మీది నురగవలె తెల్లనైన, నిర్మలమైన, శ్రేష్ఠమైన వస్త్రం భుజాల మీద నుండి జారుతుంటే సవిలాసంగా దానిని పైకి తీసుకుంటున్న రావణుని హనుమంతుడు చూశాడు.

కొమ్మల వెనుక దాగి దట్టమైన ఆకుల మధ్యను, పూవుల మధ్యను కప్పబడిన హనుమంతుడు రావణుడు దూరంగా ఉన్నా తేజస్సుతో దగ్గిరికి వస్తున్నట్లు చూడగలిగాడు.

మహాకీర్తివంతుడు అయిన రాక్షసరాజు చక్కని రూపం కల స్త్రీలతో పరివేష్టితుడై జంతువులతో పక్షులతో సంకులమైన ప్రమదావనాన్ని అశోక వనాన్ని ప్రవేశించాడు.

మద్యపానమత్తుడు, విచిత్రాలైన నగలను ధరించినవాడు, మొనదేరిన చెవులు కలవాడు, మహాబలవంతుడు, విశ్రవసునికుమారుడు అయిన రాక్షసరాజును హను మంతుడు చూశాడు.

మహాబాహువైన ఇతడు రావణుడని, మహాతేజశ్శాలీ వానరుడూ అయిన హనుమంతుడు తలచి, చెట్టుమీద కొంచెం కిందికి దిగాడు.

హనుమంతుడు సహజంగా ఉగ్రమైన తేజస్సు కలవాడు. అయినా రావణుని తేజస్సుచేత కంపించినవాడై దట్టంగా ఆకులున్నచోటున కనిపించకుండా దాగున్నాడు.

నల్లని కురులచివరలు కలది, చక్కని పిరుదులు కలది, ఎడం లేని స్తనాలు కలది, నల్లటి కంటికొనలు కలది అయిన సీతాదేవిని చూడదలచి రావణుడు ఆమె దగ్గరికి వచ్చినాడు.

అక్కడ రూపయౌవనసంపన్నుడు, భూషణోత్తమభూషితుడు అయిన రావణుని విదేహరాజపుత్రి సీతాదేవి అపుడు చూసి, పెద్దగాలికి కొట్టుకునే అరటి చెట్టువలె వణికిపోయింది.

విశాలమైన కన్నులు కలది, చక్కని శరీరవర్ణం కలది, అయిన సీతాదేవి తొడలతో కడుపును, చేతులతో స్తనములను కప్పుకొని ఏడుస్తూ కూర్చుంది.

విదేహరాజపుత్రి, రాక్షసస్త్రీల సమూహం చేత కాపాడబడుతున్నది, దుఃఖం చేత పీడింపబడుతున్నది అయిన సీతాదేవిని, సముద్రమందు పగిలిన నావవలె ఉన్నదానిని దశగ్రీవుడు దర్శించాడు.

ఏ ఆసనం లేకుండా నేలపై కూర్చున్న దానిని, నియమవతిని, నరుక బడ్డ చెట్టు కొమ్మవలె నేలను పడిన దానిని, శరీరం మీద మురికి ఉన్నా చిత్రమైన శరీరం కలదానిని, అలంకారాలకు యోగ్యురాలైనా అలకంరింపబడనిదానిని, బురద అంటిన తామర తీగ ఒక చోట ప్రకాశించి మరొక చోట ప్రకాశించకుండా ఉన్నట్లు ఉన్నదానిని, ఆత్మవిదుడూ రాజసింహుడూ అయిన రాముని సమీపానికి మనస్సు రథంకాగా కోరికలు గుఱ్ఱాలుకాగా పోతున్న దానిని, రాముని వియోగం చేత వాడిపోయిన దానిని, ఏడుస్తున్న దానిని, ఒంటరియైన దానిని, రాముడినే ధ్యానిస్తూ దుఃఖం అనుభవిస్తున్న దానిని, రాముడినే అనుసరిస్తూ దుంఖానికి అంతం చూడజాలని చక్కని దానిని, సర్పరాజు భార్య మణిమంత్రాదుల చేత కట్టబడి చలనం లేకుండా ఉన్నట్లు ఉన్నదానిని, ధూమకేతువు చేత లోపింప బడుతూ ఉన్న రోహిణీ నక్షత్రం వలె ఉన్నదానిని, ఉత్తమ స్వభావముకల కులమందు ధర్మ ప్రధానమైన వంశమందు సదాచారవతిగా జన్మించినా చెడ్డ వంశమందు పుట్టిన దానివలె మళ్లా సంస్కారం పొందినదానిని, అసత్యమైన అపవాదం చేత చెడిన కీర్తివలె ఉన్నదానిని, ఆ వృత్తి లేక మరువబడిన విద్యవలె ఉన్న దానిని, క్షీణించిన మహాకీర్తివలె అవమానింపబడిన శ్రద్ధవలె తక్కువ పూజాద్రవ్యములతో చేసిన పూజవలె నిష్ప్రయోజనమైన ఆశవలె నున్నదానిని, తరిగిన ధన లాభం వలె ఆచరించబడని ఆజ్ఞవలె ఉత్పాతకాలమందు మండుతున్న దిక్కువలె అపహరింపబడిన పూజాద్రవ్యములు కల పూజవలె నున్న దానిని, మంచు చేత ధ్వంసం చేయబడిన తామరతీగవలె శూరులు నశించిన సేనవలె చీకటిచే ఆవరింపబడిన కాంతివలె సన్నగిల్లిన నదివలె ఉన్నదానిని, తాక దగనివాడు ముట్టిన

యజ్ఞవేదికవలె ఆరిన అగ్నిజ్వాలవలె చంద్రమండలాన్ని రాహువు మింగినట్టి పున్నమి రాత్రివలె ఉన్నదానిని, తామరాకులు కమలాలు పీకివేయబడి పక్షులుభయపెట్టబడి ఏనుగు తొండంచేత కెలుకబడిన కొలనువలె నున్న దానిని, పతి శోకంచేత పీడింపబడిన దానిని, ఉత్తమమైన శరీరసంస్కారంలేక కృష్ణపక్షపు రాత్రివలె ఉన్న దానిని, కోమలమైన శరీరం కలదానిని, చక్కని శరీర భాగాలు కలదానిని, రత్నాలు పొదిగిన మహాసౌధాలలో నివసించుటకు తగిన దానిని, అప్పుడే పెరకబడి ఎండకు తపించుతున్న తామరతూడువలె ఉన్నదానిని, గుంపు నుండి వేరుచేయబడి స్తంభానికి కట్టబడి నిట్టూర్పులు విడుస్తూ హెచ్చు దుఃఖంచేత పీడింపబడుతున్న ఏనుగు రాజు భార్యవలె నున్నదానిని, ఒకే ఒక పొడుగాటి జడతో అప్రయత్నంగా శోభిస్తూ ఉన్న దానిని, వర్షాకాలం గడచిన తరువాత నల్లనైన అడవులతో నిండిన భూమివలె ఉన్నదానిని, ఉపవాసం చేత దుఃఖంచేత ధ్యానం చేత భయంచేత బాగా క్షీణించి సన్నగిల్లిన దానిని, దీనురాలిని, తపస్సే ధనంగా కలదానిని, ఆలోచనలలో రాఘవుని చేత దశకంఠుడు పరాభవము చెందవలెనని కోరుతున్న దానిని, దుఃఖంచేత పీడింపబడుతున్న దానిని, అంజలి ఘటించి దేవతను ప్రార్థిస్తున్నట్లు ఉన్నదానిని, తన రక్షణకు ఎదురు చూస్తున్న దానిని, రోదిస్తున్న దానిని, ఏ దోషమూ లేనట్టిదానిని, చక్కని కనురెప్పలు ఎఱ్ఱని కొసలు లోన చక్కని తెల్లని గుడ్లు కల కన్నులున్న దానిని, రాముని యందే హెచ్చుగా మనసు నిలిపిన దానిని, మిథిలారాజపుత్రి అయిన సీతాదేవిని, రావణుడు తన నాశనం కొరకే ఆమెను వంచించడానికి ప్రయత్నించాడు. (చంపు తానని బెదరించాడు.)

పతివ్రత, దీనురాలు, ఆనందం లేనట్టిది, తపస్విని అయిన సీతాదేవికి, ఆ రావణుడు తన మనోగతాలయిన అభిప్రాయాలను తెలియబరచాడు.

"ఏనుగు తొండాలవంటి తొడలుకలదానా! నన్ను చూసి స్తనాలను ఉదరాన్ని కప్పుకుంటున్నావు. భయంతో నున్న నిన్ను చూడకుండా ఈ పని చేయగోరుతున్నావు.

"ఓ విశాలాక్షి! సర్వాంగసుందరీ! అన్ని లోకాలకు మనోహరమైనదానా! ప్రియురాలా! నేను నిన్ను కామిస్తున్నాను. నన్ను ఆదరించు. ఇక్కడ మనుష్యులు కాని, కామరూపంతో సంచరించే రాక్షసులు కాని లేరు. ఓ సీతా! నీకు నా యందు కలిగిన భయం తొలగిపోవుగాక!

"ఇతరుల స్త్రీలతో పోవడం, వారిని బలవంతంగా దొంగిలించడం రాక్షసులకు చేయవలసిన ధర్మం. ఓ పిరికిదానా! ఇది ఎల్లప్పుడు జరిగే పని, సంశయం లేదు! కాని, పరిస్థితులు ఈ విధంగా ఉన్నా, నన్ను కామించని నిన్ను, ఓ సీతాదేవి, నేను తాకను. కాముకుడనైన నా శరీరంలో కామం తన ఇష్ట ప్రకారమే ప్రసరించనీ!

"ఓ దేవి! ఇక్కడ భయపడవలసిన పనిలేదు. ఓ ప్రియురాలా! నాపై విశ్వాసం ఉంచు! మనసిచ్చి నన్ను ప్రేమించు! ఈ విధంగా దుఃఖపరాయణవు మాత్రం కాకు!

"ఒంటి జడ, నేలను పరుండుట, నిరంతరమైన ఆలోచన, మాసిన బట్టలు, తగనట్టి ఉపవాసమూ- ఇవన్నీ నీకు తగినవి కావు.

"రంగు రంగుల పూల దండలు, చందనం, అగరుధూపం, పలురకాలైన బట్టలు, దివ్యమైన ఆభరణాలు, తగినటువంటి పానములు, పక్కలు, ఆసనాలు, గీతం, నృత్తం, వాద్యం - వీటినీ, నన్నూ పొంది అనుభవించు, ఓ మైథిలీ,

"నువ్వు స్త్రీలలో శ్రేష్ఠురాలివి. ఈ విధంగా ఉండవద్దు. నీ శరీరం మీద నగలను ధరించు. ఓ చక్కని ఆకారం కలదానా! నన్ను పొందితే వీటన్నిటికి అర్హురాలవవుతావు. నీ యొక్క అందమైన యౌవనం గడచిపోతున్నది. (నువ్వు అనుభవించవలసిన నాయౌవనం గడచిపోతున్నది). తొందరగా ప్రవహించిన నదివలె గడచిన యౌవనం తిరిగి రాదు.

" ఈ విశ్వమంతటిని సృజించిన బ్రహ్మ సౌందర్యరాశివైన నీ రూపాన్ని తీర్చి అటు పిమ్మట తాను కృతార్థుడనయినాని తలచినట్లున్నాడు. ఓ మంగళ రూపిణీ! రూపమందు నీకు సాటియైన స్త్రీ మరొకతె లేదు కదా!

"ఓ వైదేహి! రూపం, యౌవనం ఉన్న నీ దగ్గిరకి వచ్చిన పురుషుడు బ్రహ్మ దేవుడైనా సరే, నిన్ను ఎట్లు ఆరాధించకుండా ఉండగలడు?

"చల్లని కిరణాలు కల చంద్రునితో సమానమైన ముఖం కలదానా! పెద్ద పిరుదులు కలదానా! నేను నీ శరీరాన్ని చూస్తుంటే, ఏయేభాగలమీద నా చూపు నిలుస్తుందో, అక్కడే అది కట్టబడి పోతున్నది.

"ఓ మైథిలి! నువ్వు నా భార్యవు అవవలసింది. నాపైగల సంశయాలను విడిచి పెట్టు! అక్కడ నుండి ఇక్కడ నుండి తెచ్చిన చాలమంది ఉత్తమ స్త్రీలకు అందరికీ నా పట్టమహిషివి కావలసింది. నీకు క్షేమం కలుగుగాక! నా పరాక్రమంతో లోకాలనుండి సంపాదించి తెచ్చిన రత్నాలు ఏవైతే ఉన్నవో వాటినన్నిటిని, వివిధ నగరాలతో నున్న ఈ భూమి నంతటిని జయించి నీకోసమని నీ తండ్రికి సమర్పిస్తాను. ఈ లోకంలో, బలంలో నాకు సాటియైన వాడిని మరొకడిని చూడలేవు. గొప్పదైన నా పరాక్రమాన్ని, యుద్ధంలో నన్ను ఎదుర్కొనేవారు లేకపోవడాన్ని గుర్తించు. చాలసార్లు యుద్ధమందు దేవదానవులు నా ఎదుట నిలువలేకపోయారు.

"నేడు ఉత్తమమైన అలంకారం చేసుకోవలసింది. ప్రకాశవంతమైన ఆభరణాలను ధరించవలసింది. అపుడు సుందరమైన నీ రూపాన్ని నేను తిలకిస్తాను.

"ఓ చక్కని ముఖం కలదానా! చక్కగా అలంకరించుకోవలసింది. కోరిక దీర భోగాలను అనుభవించవలసింది. ఓ పిరికిదానా! మద్యం త్రాగు! నాతో క్రీడించు.

"నువ్వు స్వేచ్ఛగా భూమిని కాని, ధనాలను కాని దానం చేయవలసింది. నాయందు విశ్వాసముంచి ప్రేమించు, ధైర్యంతో ఆజ్ఞాపించు. నా అనుగ్రహం వలన నువ్వు సుఖిస్తే నీ బంధువుల కూడా సుఖిస్తారు. భద్రే! నా ఐశ్వర్యాన్ని, సౌందర్యాన్ని, కీర్తిని చూడు.

"ఓ సౌందర్యవతి! నార బట్టలు ధరించే రాముడితో ఏం చేస్తావు? అతడికి గెలుపు లేదు. అతని శోభ తొలగిపోయింది. అతడు అడవులు పట్టాడు. నియమవంతుడై కటిక నేల మీద నిద్రిస్తున్న అతడు బ్రతికి ఉన్నాడా లేదా అన్న సందేహం కలుగుతోంది. వైదేహీ! నువ్వు రాముడిని చూడడం కాని, పొందడం కాని జరుగదు. ముందు కొంగలు పోతూ వెనుకనో నల్లని మేఘం పోతుంటే ఏ విధంగా వెన్నెల కప్పబడుతుందో ఆ విధంగా అతను కనిపించడు. నా చేతులలోంచి నిన్ను రాముడు కూడా పొందలేడు.

"నిన్ను చూసిన తరువాత నా భార్యలయందు ప్రీతి కలుగడం లేదు. నా భార్యలు మూడు లోకాలలోను ఉత్తములైనవారు. లక్ష్మీదేవిని ఏ విధంగా అప్సరలు

సేవిస్తారో ఆ విధంగా వాళ్లందరూ నీకు పరిచర్యలు చేస్తారు.

"ఓ దేవి! రాముడు తపస్సులోను, బలంలోను, విక్రమంలోను, ధనంలోను, తేజస్సులోను, యశస్సులోను నాకు సాటియైనవాడు కాడు. నాతో కూడి నువ్వు పానం చేయవలసింది. విహరించవలసింది. భోగాలను అనుభవించవలసింది.

"ఓ భీరు! సముద్రతీరంలో నున్న వనాలు పుష్పించిన చెట్లతో నిండి ఉన్నవి. వాటిపై తుమ్మెదలున్నవి. బంగారంతో చేసిన స్వచ్ఛమైన హారాలతో శరీరాన్ని అలంకరించుకొని, నువ్వు నాతో కలసి వాటిలో విహరించు."

భయంకరంగానున్న రాక్షసుని ఆ మాటలు విని సీతాదేవి దుఃఖార్తయై దీనురాలై దీనమైన స్వరంతో మెల్లగా బదులు పలికింది.

సీతాదేవి దుఃఖంచేత పీడింపబడినది. ఏడుస్తున్నది, కంపిస్తున్నది, భర్త నే తలంచుతున్న పతివ్రత ఆమె.

శుభ్రమైన నవ్వుకల సీతాదేవి గడ్డిపోచను మధ్యనుంచి బదులు పలికింది:

"నా నుండి నీ మనసు మరల్చుకొని దానిని నీ స్వంత భార్యలపై నిలుప వలసింది.

"పాపం చేసినవాడు ఏ విధంగా మోక్షం కోరడానికి అర్హుడు కాడో ఆ విధంగా నన్ను బ్రతిమాలడం యుక్తంకాదు. పతివ్రతనైనా నేను చేయరాని పని చేయకూడదు.

"గొప్ప వంశంలో పుట్టి ఉత్తమమైన వంశాన్ని చేరిన నేను చేయరాని పని చేయకూడదు."

యశస్వినియైన సీతాదేవి రావణునితో ఈ విధంగా మాట్లాడి రాక్షసుని వెనుకను పెట్టి తిరిగి పలికింది.

"నేను నీకు తగినట్టి భార్యను కాను. నీకు నేను ఇతరుని భార్యను, పతివ్రతను. సజ్జనుల ధర్మాన్ని పాటించి సజ్జనులు చేసే మంచి పని చేయవలసింది. ఏ విధంగా నీ భార్యలు రక్షింపదగినవాళ్ళో, ఓ రాక్షసుడా! ఆ విధంగా ఇతరుల భార్యలను రక్షించు. నిన్ను నువ్వే ఉపమానం చేసుకొని నీ భార్యలయందే రమించవలసింది. (నీ భార్యలను ఇతరులు పొందడం ఏ విధంగా ఆమోదించవో, ఆ విధంగా ఇత

రుల భార్యలను నువ్వు అనుభవించడం మెచ్చదగినదికాదు). తన భార్యలయందు తృప్తి చెందక చపలుడై, ఇంద్రియ చాంచల్యానికి గురియైన వాడై, శఠుడై ఇతరుల భార్యల వెంటబడతాడో వాని ఆయువును, ఐశ్వర్యాన్ని ఇంకా అటువంటి వాటిని పరభార్యలు క్షయం చేస్తారు.

"ఇక్కడ మంచి వాళ్లేలేరా? ఒక వేళ మంచి వాళ్లుంటే వాళ్లు నిన్ను పాపకృత్యం నుండి వారించలేరా? విపరీతమైన ప్రకృతికల నీ బుద్ధి సదాచారాలను విడిచి పెట్టింది. సజ్జనులు నీకు హితం బోధిస్తున్నా నువ్వు అసత్యమైన స్నేహాన్ని రాక్షసులయందు నెరపుతున్నావా? సజ్జనులు చెప్పే హితాన్ని, రాక్షసుల వినాశం కూడా పాటించకుండా నిరాకరిస్తున్నావా? సదుపదేశం గ్రహించలేనివాడు, చెడ్డ పనులయందు ఆసక్తి కలవాడు అయిన రాజు పాలనలో సుసంపన్నములైన రాష్ట్రాలు, నగరాలు నశించుతవి. ఆకారణంచేతనే రత్నసమూహంతో నిండిన ఈ లంకా నగరం నిన్ను రాజుగా పొంది, నువ్వొక్కడవు చేసిన దోషంచేత తొందరలో నశిస్తుంది. రావణా! తాను చేసిన తప్పుపనులచేతనే చంపదగినవాడు, దూరదృష్టి లేనివాడు, పాపపు పనులు చేసేవాడు. అటువంటివాడు నశిస్తే ప్రాణులు అభినందిస్తవి. ఈ విధంగా నీచేత వంచింపబడినవాళ్లందరూ నువ్వు పాపకార్యాలు చేశావని చెప్తారు. ఈ భయంకరుడు మన అదృష్టం వలన నాశనమయాడని వారు సంతోషిస్తారు. నీ ఐశ్వర్యంచేత, నీ ధనంచేత నన్ను లోభింపజేయ లేవు.

"సూర్యుడి నుండి వెలుతురు ఏ విధంగా వేరుకాదో, నేను కూడా ఆ విధంగా రాముని నుండి వేరయినదానను కాను. లోకాలకు ప్రభువైన ఆ రాముని పూజనీయమైన కుడిచేతిని నేను తలక్రిందనుంచుకుంటాను. ఎవడో ఇతరుడైన వాడి భూజాన్ని నేనెట్లు ఆధారంగా తీసుకోగలను? నేను భూమీపతియైన ఆ రామునికి తగినటువంటి భార్యను. వ్రతస్నాతుడు, ఆత్మవిదుడు అయిన విప్రుడికి విద్య ఎంటువంటిదో, నేను రామునికి అటువంటిదానను. రావణా! దుఃఖంతో మునిగిన నన్ను రాముడితో కూర్చవలసింది. అడవిలో యౌవనంలో నున్న ఆడ ఏనుగును గజరాజుతో చేర్చినట్లు నన్ను రామునితో చేర్చవలసింది.

నువ్వు చాల కాలం లోకంలో ఉండాలంటే రాముని మిత్రునిగా చేసుకో! అతడు ధర్మం ఎరిగినవాడు – వేదవిదుడు. శరణాగతవత్సలుడు.

"ఇప్పటికైనా నీ మనసులో దోషాన్ని విడిచి పెట్టి నన్ను అతనికి సమర్పించు. ఈ విధంగా చేస్తే నీకు శుభం కలుగుతుంది. నువ్వు మరో విధంగా ప్రవర్తిస్తే వధింపబడతావు. ఇంద్రుడు ప్రయోగించిన వజ్రాయుధం నిన్ను విడిచి పెట్టవచ్చు; చాల కాలం యముడు కూడా విడిచి పెట్టవచ్చు. కాని, లోకానికి ప్రభువైన రాముడు నీపై కోపిస్తే నిన్ను విడువడు.

"రాముని ధనుస్సు గొప్ప ధ్వనిచేస్తుంది. దానిని నువ్వు వినగలవు. కొద్ది కాలంలో రామలక్ష్మణుల ముద్రలుకల బాణాలు లంకలో పడి రాక్షసులను సంహరిస్తాయి. రాక్షసరాజులనే మహాసర్పాలను మహాత్ముడైన గరుడుని వంటి రాముడు చంపగలడు. తొందరగా శత్రువులను సంహరించే నా భర్త నీ నుండి నన్ను తప్పిస్తాడు.

"విష్ణువు మూడడుగులలో అసురుల నుండి రాజ్యలక్ష్మిని తప్పించినట్లు రాముడు నీ నుండి నన్ను తప్పిస్తాడు. జనస్థానమున రాక్షసుల సైన్యమంతా నశించి వారికి స్థానం లేకుండా పోయింది. ఓ రాక్షసుడా! అప్పుడు నువ్వేమీ చేయలేకపోయావు. ఇప్పుడీ అసాధువైన కార్యాన్ని ఆచరించావు. నరశ్రేష్ఠులైన రామలక్ష్మణులు ఆశ్రమంలో లేనప్పుడు లోనికి ప్రవేశించి, అన్నదమ్ములు కంటికనపడకుండా ఉండడం చూసి, ఓయి అధముడా! నన్ను అపహరించావు. రామలక్ష్మణుల వాసన నీకు తగిలితే పులుల దగ్గిర కుక్కలు నిలువలేకపోయినట్లు నువ్వువారిని చూడడానికి నిలవడం శక్యం కాదు. వారిరువురితో యుద్ధమందు పోరాడితే నీకు విజయం కలగడం సందేహాస్పదమే. ఇంద్రుడు రెండు చేతులతోను యుద్ధం చేస్తునప్పుడు వృత్రాసురుడు అతని ఎదుట ఒంటిచేతితో యుద్ధం చేసి గెలుపు పొందనట్లు, నీకు కూడా జయం కలుగదు. నా భర్తయైన రాముడు, తన తమ్ముడు లక్ష్మణునితో కలసి, కొంచెంగా నున్న నీటిని సూర్యుడు హరించినట్లు, నీ ప్రాణాలను హరించగలడు. నువ్వు తప్పించుకొని కైలాస పర్వతం చేరినా, లేక రాజైన వరుణుని అధోలోకంలో తలదాచుకున్నా మహావృక్షం పిడుగుపాటు నుండి తప్పించుకోలేనట్లు రాముని బాణాలనుండి తప్పించుకోలేవు."

రావణుడు తనకు అప్రియంగా ఉన్నా, చూడచక్కనిది అయిన సీతాదేవి పలికిన కఠినమైన మాటలు విని బదులు పలికినాడు.

"పురుషుడు ఏ విధంగా స్త్రీలను బ్రతిమాలుతుంటాడో, ఆ విధంగానే వారికి వశమవుతాడు. ఏయే విధంగా ప్రియమైన మాటలాడితే ఆయావిధంగానే పరాభవం పొందుతాడు. సమర్థుడైన సారథి పెడత్రోవను పోయే గుఱ్ఱాలను ఏ విధంగా అడ్డుకుంటాడో ఆ విధంగా నీమీద పెల్లుబికిన కామం నా కోపాన్ని అడ్డగిస్తుంది.

"కామం మనుష్యులకు ప్రతికూలమైనది. ఎవరియందైతే కామం కలుగుతోందో వారి యందు దయ, ప్రేమ నెలకొంటాయి. నువ్వు చంపడానికి అర్హురాలివి. అవమానించడానికి తగిన దానివి. దొంగ సన్యాసి వేషం వేసుకొని తిరుగుతున్న రాముని యందు అనురక్తురాలివి. నీ యందు కామం కారణంగా, ఓ చక్కని ముఖం కలదానా, నిన్ను చంపించడం లేదు.

"ఓ మైథిలి! ఇక్కడ నన్ను గురించి ఏయే పరుషమైన వాక్యాలను పలికావో, ఆయా వాక్యాలకు ప్రతి ఫలంగా నిన్ను దారుణంగా చంపడం యుక్తమైనది."

రావణుడు కోపంతోను మోహంతోనూ కూడినవాడై సీతాదేవితో మరల ఇట్లు పలికాడు.

"ఓ సుందరి! నేను నీకిచ్చిన వ్యవధిలో రెండు నెలలు మిగిలాయి. అపుడు నా పడకను నువ్వు అధిరోహించవలసింది. రెండు నెలలు గడచినా నన్ను భర్తగా అంగీకరించకపోతే, నిన్ను నా ప్రొద్దుటి భోజనానికి వంటయింటి యందు వండుతారు."

రాక్షసరాజుచేత ఈ విధంగా జానకీదేవి భయపెట్టబడుతూఉంటే ఆ దేవకన్యలు గంధర్వ కన్యలు నీళ్లు కారే కన్నులతో విషాదం పొందారు. ఆ రాక్షసుని చేత భయపెట్టబడుతున్న సీతాదేవిని కొందరు పెదవులకదలికతోను, మరి కొందరు ముఖాలతోను కన్నులతోను ఓదార్చారు.

వారిచేత ఓదార్చబడిన సీత తనపాతివ్రత్యమందు నిబ్బరం కలిగినదై ఆత్మ హితమైన మాటను రావణునితో చెప్పింది.

"నువ్వీవిధంగా నిందింపదగిన పనిచేస్తూ ఉంటే నిన్ను వద్దని చెప్పే

మనుష్యుడెవడూ లేడన్నది నిశ్చయమవుతున్నది. దేవేంద్రుని భార్య అయిన శచీదేవి వలె నేను ధర్మాత్ముడైన రాముని భార్యను. అటువంటి దానిని మూడు లోకాలలో ఎవడయినా ప్రార్థిస్తాడా?

"ఓయి నీచ రాక్షసుడా! అపరిమితపరాక్రమశాలియైన రాముని భార్యను నువ్వు నొప్పించే మాటలాడి ఏ పాపం చేశావో, దాని ఫలితాన్ని అనుభవించక నువ్వెక్కడికి పోతావు?

"అరణ్యంలో మదగజం, చెవుల పిల్లి, పోరుకు తలపడితే ఏ విధంగా ఉం టుందో ఆ విధాంగానే ఇప్పుడుంది. రాముడు ఏనుగువంటివాడు. నీచుడవైన నువ్వు కుందేటివంటివాడవు. అటువంటి నువ్వు రాముని దూరంగా పంపినందుకు సిగ్గు పడడం లేదా? నువ్వింకా అతని కళ్లముందు పడలేదు.

"ఓయి అనార్యుడా! నీకళ్లు క్రూరంగా ఉన్నవి. వికృతంగా ఉన్నవి. నడుమ నల్లగను చుట్టూ గోరోచనవర్ణంతోను ఉన్నవి. నన్ను పాపదృష్టితో చూస్తున్న నీ కన్నులు ఎందుకు నేల రాలిపడడటం లేదు?

"నేను ధర్మాత్ముడైన రాముని భార్యను. దశరథుని కోడలిని. నన్నిట్లు ఆడిపోస్తున్న నీ నాలుక చీలిపోకుండా ఉందేమి?

"రాముడు నాకు ఆజ్ఞ నివ్వలేదు. నేను తపస్సును పాలిస్తున్నాను. అందుచేత, ఓ దశకంఠుడా! బూడిద చేసే తేజస్సు కలిగినా, నిన్ను నేను భస్మం చేయలేదు. ధీమంతుడైన రాముని భార్యను నేను. నన్నెవరూ అపహరించలేరు. నీ చావుకి విధి ఈ విధంగా చేయించింది. ఇందులో సందేహం లేదు. నువ్వు శూరుడివి, కుబేరుడి సోదరుడివి, సేనలు కలవాడివి, రాముని వంచించి అతని భార్యను ఎలా అప హరించావు?"

రాక్షసరాజా రావణుడు సీతాదేవి మాటలు విన్నాడు. క్రూరములైన కన్నులు తిప్పుతూ జానకిని చూశాడు.

రావణుడు నల్లని మేఘంవలె ఉన్నాడు. పెద్ద భుజాలు మెడ కలవాడు, సింహం వలె నడిచేవాడు, శ్రీమంతుడు; నాలుక చివర, కనులూ – ఈ రెండూ ప్రకాశించేవి కలవాడు; చలించేకొనలు కల కిరీటాన్ని ధరించి పొడవుగా కనిపించే వాడు; రంగు రంగులపూలదండలు చందనాదులు దాల్చినవాడు; ఎఱ్ఱని దండలు

బట్టలు ధరించినవాడు; మేలిమి బంగారు భుజకీర్తులు ఆభరణాలు కలవాడు; అమృతం సంపాదించడానికి మందరపర్వతానికి చుట్టిన వాసుకి వంటి గొప్పదైన బంగారు మొలత్రాటితో చుట్టబడినవాడు; అన్ని విధాలుగా సంపూర్ణమై బలంగా నున్న భుజాలు కల రాక్షసేశ్వరుడు రెండు శిఖరాలు కల మందరపర్వతం వలె శోభించాడు.

ఉదయిస్తున్న సూర్యుడికాంతి వలె ఎర్రనైన కుండలాలతో అలంకరింప బడిన రావణుడు ఎర్రటి చివుళ్ల పూవులు కలిగిన రెండు అశోక వృక్షాలతో కూడిన కొండవలె ఉన్నాడు.

ఆ రావణుడు కల్పవృక్షంతో సమానంగా ప్రకాశిస్తున్నాడు. ఆకారం దాల్చిన వసంతఋతువు వలె ఉన్నాడు. అయితేనేం శ్మశానంలో కట్టిన సమాధివలె అలంకరింపబడినా భయంకరంగా కనిపిస్తున్నాడు.

కోపంతో ఎర్రబడిన కన్నులు కలిగిన రావణుడు వైదేహిని చూస్తూ మహా సర్పంవలె నిట్టూరుస్తూ సీతాదేవితో పలికాడుః

"దురదృష్టవంతుడు నిర్ధనుడు అయిన రాముని అనుసరించేదానా! సూర్యుడు సంధ్యను ఏ విధంగా తన వెలుగుతో సంహరిస్తాడో ఆ విధంగా నిన్ను నేడు నాశనం చేస్తాను."

సీతాదేవితో ఈ విధంగా రావణుడు పలికి భయంకరమైన ఆకారాలు కల రాక్షస స్త్రీలకు ఈ విధంగా ఆజ్ఞాపించాడుః

"తొందరగా ఈ జానకి నాకెట్లు వశమవుతుందో ఆ విధంగా రాక్షసస్త్రీలైన మీరందరూ కలిసి చేయవలసింది. ఈమెకు ప్రతికూలంగానో అనుకూలంగానో మీరు ఆచరించవలసింది. సామదానభేదోపాయాలను ప్రయోగింపవలసింది. చివరకు దండోపాయం ఉపయోగించి ఈ వైదేహి నావశమైనట్లు చేయండి."

రాక్షసరాజు మరీ మరీ వాళ్లతో చెప్పాడు. కామం, కోపం హెచ్చినవాడై జానకీదేవిని రావణుడు బెదిరించాడు.

అపుడు తొందరగా ధాన్యమాలిని అన్న రాక్షసి ముందుకొచ్చి, దశకంఠుడిని కౌగలించుకొని ఈ మాటలు పలికిందిః

"ఓ మహారాజా! నాతో క్రీడించు. ఈ సీతవలన నీకేం ప్రయోజనం? ఓ

రాక్షసప్రభువా! ఈ సీతాదేవి శరీరచ్ఛాయపోయినట్టిది. దీనురాలు. మనుష్య స్త్రీ ఈమె. దివ్యమైన భోగాలను నువ్వు బాహుబలం చేత సంపాదించావు. వాటిని అనుభవించడానికి యోగ్యురాలుగా ఈమెను దేవతలు చేయలేదు. నిన్ను కోరని స్త్రీని కామించితే శరీరం తాపమే చెందుతుంది. తనను కోరే స్త్రీని కామిస్తే శుభకరమైన ప్రీతి లభిస్తుంది."

ఈ విధంగా ఆ రాక్షసి పలుకగా రావణుడు లేచినిలబడ్డాడు. మేఘంతో సమానుడైన రాక్షసుడు బాగా నవ్వుతూ మరలిపోయాడు. ఆ దశకంఠుడు భూమి అదిరేటట్లు అడుగులు వేశాడు. సూర్యుని కాంతితో వెలుగొందుతున్న తన భవనం ప్రవేశించాడు. దేవకన్యలు, గంధర్వకన్యలు, నాగకన్యలు చుట్టూ పరివేష్టించగా ఆభవనంలోకి ప్రవేశించాడు.

ఈ విధంగా ధర్మమార్గాన్ని అనుసరించేది, చాల హెచ్చుగా వణకుతున్నది అయిన సీతాదేవిని రావణుడు భయపెట్టి ఆమెను విడిచి కామమోహితుడై తన భవనం ప్రవేశించాడు.

శత్రువులను రోదింపజేసే రావణుడు రాక్షసస్త్రీలకు ఆజ్ఞ నిచ్చి అంతః పురానికి వెళ్లగానే భయంకరమైన ఆకారాలు కల ఆరాక్షస స్త్రీలు సీతాదేవి దగ్గరికి పరుగెత్తారు. వాళ్లు ఆమెను సమీపించి చాలహెచ్చుకోపంతో చాల కఠినమైన మాటలు వైదేహితో పలికారు.

"శ్రేష్ఠుడు, మహాత్ముడు, దశకంఠుడు అయిన రావణునికి భార్యగా అవడం ఎందుకు గొప్పగా తలచవు?"

అపుడు ఏకజట అన్న పేరు కల రాక్షసి సన్నని నడుముకల సీతాదేవిని పిలిచి కోపంతో ఎరుపెక్కిన కన్నులు కలదై పలికింది.

"ఆరుగురు ప్రజాపతులలో నాలుగవ ప్రజాపతి, బ్రహ్మదేవుని మానస పుత్రుడు, పులస్త్యుడని ఖ్యాతిగాంచాడు. ఆపులస్త్యుని సంకల్పంవల్ల పుట్టిన తేజో వంతుడు విశ్రవసువన్నవాడు. అతడు ప్రజాపతులతో సమానమైన తేజస్సు కలవాడు. ఓ విశాలాక్షి అతని పుత్రుడే శత్రువులను రోదింపజేసే రావణుడు. ఆరాక్షస ప్రభువుకు భార్యవగుటకు నువ్వు తగినదానివి. ఓ సర్వాంగ సుందరి! నా మాటల నెందుకు ఆదరించవు?"

పిమ్మట హరిజట అన్న రాక్షసి పిల్లికనులవంటి కనులు కలది, కన్నులు తిప్పి పలికింది:

"ముప్పదిమూడు కోట్ల దేవతలు, వారిరాజైన దేవేంద్రుడు ఇతనిచే జయింప బడ్డారు. అటువంటి రాక్షసేంద్రునికి భార్యవగుటకు నువ్వు తగినదానివి."

ప్రఘస అన్న రాక్షసి చాలకోపంతో సీతాదేవితో భయంకరమైన ఈ పలుకులు పలికింది:

"వీర్యవంతుడని గర్వం కలవాడు, శూరుడు, యుద్ధంలో వెనుదీయనివాడు బలవంతుడు అయిన రావణుని భార్యగా అగుటకు నువ్వేల తలచడంలేదు. మహా బలవంతుడైన రాక్షసరాజు భార్యలందరిలోను ప్రియమైన దానిని విడిచి పెట్టి వారి అందరిలోను నిన్ను భాగ్యవంతురాలినిగా చేసి నిన్ను పొందగోరుతున్నాడు."

అపుడు దుర్ముఖి అన్న పేరు కల రాక్షసి ఇట్లు పలికింది:

"ఎవనికి భయపడి సూర్యుడు ఎండ తీవ్రంగా కాయడో, గాలి వీచదో, అట్టి రావణుని వక్షాన్ని ఏల చేరవు? ఎవనికి భయపడి వృక్షాలు పుష్పవృష్టిని కురిపించుతవో, కొండలు మబ్బులు సమృద్ధిగా జలం ఇస్తాయో అటువంటి రాక్షసులకు రాజు, రాజులకు రాజు అయిన రావణుని భార్య అవడానికి నువ్వుఎందుకు మనసుంచవు? నేను నీకు హితంగా వాస్తవమే పలికాను. చక్కని చిరునవ్వు కలదానా! నా మాటలను స్వీకరించు. ఆ విధంగా చేయక పోతే నువ్వు జీవించలేవు."

అపుడు రాక్షసస్త్రీలు సీతాదేవిని సమీపించి అప్రియమైన మాటలను ఆమెతో పలికారు:

"ఓ సీతా! అన్ని ప్రాణులకు మనోహరమైనది, గొప్ప వెలగల పర్యంకాలతో కూడినది అయిన అంతఃపురంలో ఉండడానికి నువ్వెందుకు అంగీకరించడం లేదు? నువ్వు మానవకాంతవు. మానవుని భార్యగా ఉండడమే గొప్పగా తలంచు తున్నావు. రాముడి నుండి మనసు దూరం చేసుకో! లేకపోతే నువ్వు బ్రతకవు. మూడు లోకాల సంపదలను అనుభవించేవాడు, రాక్షసులకు ప్రభువు అయిన రావణుని భర్తగా పొంది సుఖంగా విహరించు. ఓ మంగళ రూపిణీ! నువ్వు మనుష్య కాంతవు కాబట్టే మనుష్యుడైన రాముని కోరుతున్నావు. ఓ ఉత్తమశీల సంపన్నా! ఆ

రాముడు రాజ్యభ్రష్టుడు. అతని మనోరథం సిద్ధించలేదు, క్లేశాలను అనుభవిస్తున్నవాడు."

సీతాదేవి రాక్షసస్త్రీల మాటలను విని కనులు అశ్రువులతో నిండగా ఈ మాటలు పలికింది:

"జనులచే నిందింపదగినమాటలు మీరాడుతున్నారు. నాకు పాపంగాతోచే మాటలు మీకు పాపమనిపించడం లేదా? మానవస్త్రీ రాక్షసుడి భార్య అవడానికి అర్హురాలు కాదు. మీరందరూ కలిసి నన్ను భక్షించినాసరే మీరు చెప్పినట్లు నేను చేయను. అతడు దీనుడే కావచ్చు, రాజ్యహీనుడేకావచ్చు. ఎవరయితే నా భర్తో అతడే నాకు గౌరవించదగినవాడు. సూర్యుడిని సువర్చలాదేవి, శచీదేవి దేవేంద్రుని, అరుంధతి వసిష్ఠుని, చంద్రుడిని రోహిణీదేవి, లోపాముద్ర అగస్త్యుని, సుకన్య చ్యవనుని, సావిత్రి సత్యవంతుని, శ్రీమతి కపిలుని, మదయంతి సౌదాసుని, కేశిని సగరుని, పతియందు అనురక్తయైన దమయంతి నైషధపతి నలుని అనుసరించినట్లే నేను ఇక్ష్వాకువంశంలో పుట్టినవారిలో శ్రేష్ఠుడైన రాముని అనుసరించి ఉన్నాను."

సీతాదేవి మాటలు విని రాక్షసస్త్రీలు చాల కోపం చెందారు. రావణ ప్రేరితులైన వాళ్లు పరుషములైన మాటలతో ఆమెను బెదిరించడం మొదలు పెట్టినారు.

శింశుపావృక్షమందు దాగిన హనుమంతుడు పలుకులేక, సీతాదేవిని భయపెడుతున్న రాక్షసస్త్రీల మాటలను విన్నాడు.

భయంతో కంపించుతున్న ఆమెను చుట్టముట్టి మిక్కిలి కోపంతో వ్రేలాడుతున్న పెదవులను నాకుతూ తొందరగా గొడ్డళ్లు పట్టుకొని విపరీతమైన కోపంతో రాక్షసాంగనలు పలికారు:

"రాక్షసాధిపుడైన రావణుని భర్తగా పొందుటకు ఈమె యోగ్యురాలు కాదు!"

భీకరులైన రాక్షస స్త్రీలచేత సుందరమైన ముఖం కల సీతాదేవి ఆ విధంగా బెదిరింపబడుతున్నదై, కన్నీటిని తుడుచుకుంటూ హనుమంతుడెక్కిన శింశుపావృక్షాన్ని సమీపించింది. రాక్షస స్త్రీలు చుట్టు ముట్టిన ఆ శింశుపావృక్షాన్ని చేరుకొని సీతాదేవి శోకమగ్న అయింది.

కృశించిన దానిని, దీనమైన ముఖం కలదానిని, మాసిన బట్ట ధరించిన దానిని రాక్షస స్త్రీలు భయపెట్ట సాగినారు. భయంకరమైన ఆకారం కల వినత అనుపేరు కలరాక్షసి, కోపం చెందిన ఆకారం కలది, సన్నని నడుము భయంకరమైన కన్నులు కలది ఇట్లు పలికింది:

"ఓ సీతా! ఇంతవరకు నువ్వు భర్తపై స్నేహాన్ని ప్రకటించావు. ఇకచాలు. అవసరానికి మించినపని చేస్తే అది కష్టానికే దారితీస్తుంది. నువ్వు చేసిన పనికి నేను చాల సంతోషించాను. నీకు క్షేమం కలుగుగాక! మానవులకు తగినట్లుగా నువ్వు నీ విధిని నెరవేర్చావు. ఓ మైథిలి నేను చెప్పే హితమైన పలుకులను కూడా వినవలసింది. సర్వరాక్షసులకు ప్రభువైన రావణుని భర్తగా స్వీకరించు. అతడు పరాక్రమవంతుడు. రూపవంతుడు. దేవతలకు ప్రభువైన ఇంద్రునివలె అతడు రాక్షసులకు ప్రభువు. దాక్షిణ్యం కలవాడు. త్యాగశీలుడు. అందరికీ ప్రియం కూర్చే చక్కని రూపం కలవాడు. కాబట్టి, నువ్వు మనుష్యుడు దీనుడు అయిన రాముడిని విడిచి రావణుని ఆశ్రయించు. దివ్యములైన చందనాదులను పూసుకో! ఓ వైదేహీ! దివ్యములైన ఆభరణాలను ధరించు. అగ్నిదేవుడికి స్వాహాదేవి ఎటువంటి పత్నియో, శచీదేవి ఇంద్రుడి కెటువంటిదో, ఆ విధంగానే, ఓ మంగళ రూపిణీ, నువ్వు కూడా నేటి నుండి అన్ని లోకాలకు అధికారిణివి అవవలసింది. ఓ వైదేహీ! నీకు రాముడితో ఏం పని? అతడు దీనంగా ఉన్నాడు. అతని ఆయువు చెల్లి పోయింది. నేను చెప్పిన ప్రకారం నువ్వు ఆచరించకపోతే ఈ క్షణమే మేమేమందరం నిన్ను తినివేస్తాము."

అపుడు వ్రేలాడుతున్న స్తనములు కల వికట అన్న పేరుకల మరొక రాక్షసి కోపించి పిడికిలి ఎత్తి గర్జిస్తూ సీతాదేవితో ఇట్లు పలికింది:

"ఓ దుష్ట బుద్ధికలదానా! నువ్వాడిన మాటలు ప్రియం కానట్టివి. నీపై గల దయచేతను మా హృదయంలోనున్న మార్దవంచేతను, ఓ మైథిలి, వాటినన్నిటిని మేము సహించాము. సమయోచితంగా మేము పలికిన హితోక్తిని నువ్వు ఆచరించలేదు. ఇతరులు చేరలేని సముద్రపు ఆవలి గట్టుకు నువ్వు తీసుకురాబడ్డావు. భయంకరమైన రావణాంతఃపురం ప్రవేశించావు. రావణుని గృహ మందు నిర్బంధింపబడి, మా చేత బాగా కాపాడబడుతున్న నిన్ను సాక్షాత్

దేవేంద్రుడైనా రక్షించ శక్తుడు కాడు. ఓ మైథిలి! నీ హితమే పలుకుతున్న నా మాటలను లక్ష్యపెట్టు. అధికంగా కన్నీళ్లు కార్చడం చాలించు. నిష్ప్రయోజనమైన శోకాన్ని విడిచిపెట్టు. నువ్వు స్నేహాన్ని ఆనందాన్ని పొందవలసింది. నిత్యము ఉండే ఈ దీనత్వాన్ని విడిచిపెట్టు. ఓ సీతా! రాక్షస రాజుతో సుఖంగా క్రీడించు.

"ఓ పిరికి దానా! నీకు తెలుసుకదా! స్త్రీలయౌవనం స్థిరమైనది కాదు. అది గడచిపోకముందే నువ్వు సుఖం అనుభవించవలసింది. ఉద్యానవనాలు రమ్యమైనవి. పర్వతం పక్కనున్న పూదోటలు కూడా అటువంటివే. ఓ మదిరాక్షి! నువ్వు రాక్షసరాజైన రావణునితో కలిసి వాటిలో విహరించు.

"ఓ సుందరి! ఏడువేలమంది స్త్రీలు నీ అధీనంలో ఉంటారు. అందరు రాక్షసులకు ప్రభువైన రావణుని భర్తగా స్వీకరించు. ఓ మైథిలి! నేను చెప్పిన ప్రకారం నువ్వు చేయకపోతే నీ హృదయాన్ని పెరికి తింటాను."

అపుడు చండోదరి అన్న రాక్షసి అధికంగా కోపించి, పెద్ద శూలం తిప్పుతూ ఈ మాటలు పలికింది:

" ఈ లేడికనులవంటి కన్నులు కలదానిని, భయంచేత కంపిస్తున్న స్తనములు కలదానిని, రావణుడు అపహరించి తెచ్చిన దానిని, ఈమెను చూడగనే నాకు తినవలె నన్న కోరిక కలుగుతుంది. ఈమె శరీరమందలి యకృత్తును, ప్లీహమును, దానిపై నున్న మాంసమును, వాటితో బంధింపబడి యున్న హృదయమును ప్రేగులను ఆ విధంగా తలకాయనూ తినాలని నేను తలంచుతున్నాను."

అపుడు ప్రఘస అన్న రాక్షసి ఈ మాటలంది:

"ఇంకా ఆలస్యం దేనికి? ఈ క్రూరురాలి పీక నొక్కివేద్దాం. ఆ మనుష్య స్త్రీ చచ్చిపోయిందని తరువాత రాజుతో చెప్పుదాం. మరేం సందేహం అక్కరలేదు. దానిని తినమని అతడంటాడు."

పిమ్మట అజాముఖి అన్న రాక్షసి పలికింది:

"ఈమెను చంపి సమానమైన ముక్కలుగా చేయండి. మనమందరం వాటిని పంచుకుందాం. నాకు తగవులు రుచించవు. తొందరగా మద్యం తేవలసింది. హెచ్చుగా లేహ్యాలను తేవలసింది."

శూర్పణఖ అన్న రాక్షసి అనంతరం పలికింది:

"అజాముఖి చెప్పినది నాకు కూడా నచ్చింది. సర్వశోకవినాశినియైన మద్యాన్ని వెంటనే తేవలసింది. మనుష్యమాంసాన్ని ఆస్వాదించి నికుంభిలయను దేవతకై నృత్యం సలుపుదాం."

దేవకన్యతో సాటివచ్చు సీతాదేవి ఆ విధంగా ఘోరరూపులైన రాక్షస స్త్రీల చేత భయపెట్టబడి ధైర్యం కోల్పోయి ఏడ్వడం మొదలు పెట్టింది.

ఈ విధంగా రాక్షసాంగనలు పలుకుతుంటే మనస్వినియైన విదేహరాజ పుత్రి మిక్కిలి భయపడినదై కన్నీటితో గద్గదస్వరంతో పలికింది:

"రాక్షసునికి మనుష్య స్త్రీ భార్యగా అవడానికి తగినదికాదు. మీరు కోరి నట్లయితే నన్నుభక్షించండి. అంతేకాని మీ మాటల ప్రకారం ఆచరించను."

రాక్షస స్త్రీల మధ్యనున్నది, రావణునిచే భయపెట్టబడినది అయిన సీతాదేవి సుఖాన్ని పొందలేకపోయింది. అరణ్యంలో గుంపు నుండి విడిపోయిన ఆడు లేడి తోడేళ్లచే పీడింపబడి ఏ విధంగా ఉంటుందో, సీతాదేవి ఆ విధంగా తన శరీరభాగాలను ముడుచుకొని అధికంగా కంపించదొడగింది. ఆమె అశోకవృక్షపు పూలు పూచిన పెద్దకొమ్మను పట్టుకొని, దుఃఖంతో భగ్నమైన మనసు కలదై భర్త అయిన రాముని గురించి తలచింది. ఆమె విపులమైన స్తనములను కన్నీటి ధారలతో తడుపుతూ రామునే ధ్యానిస్తూ దుఃఖానికి అంతం పొందలేకపోయింది. పెద్దగాలి యందు కంపిస్తూ పడిపోయిన అరటి చెట్టువలె రాక్షస స్త్రీలవలని భయంతో ఆమె పీడింపబడినదై రంగు మారిన ముఖం కలదాయెను. వణకుతున్న ఆ సీతాదేవియొక్క కంపిస్తున్న జడ పొడవుగా విపులంగా ఉంది. అది పారిపోతున్న పామువలె కని పించింది. ఆ సీతాదేవి శోకంచే పీడింపబడిన మనసు గలదై దుఃఖంతో బాధింప బడినదై నిట్టూర్పులు విడుస్తూ విరహార్తయై కన్నీళ్లు కారుస్తూ ఏడ్వదొడగింది.

"హారామా!" అని సీతాదేవి, దుఃఖార్తయై మళ్లా "హా లక్ష్మణా!" అని ఏడ్చింది. "ఓ నా అత్త కౌసల్యా! హా సుమిత్రా!" అని ఆ భామిని విలపించింది.

"పండితులు ఉదహరించిన లోకప్రవాదం సత్యమైనది. స్త్రీకి గాని, పురుషుడి కై

గాని, కాలం కాకముందు మృత్యువు సంభవించడం దుర్లభం. అకాలమందు మృత్యువు కలుగదు. ఇక్కడ నేను క్రూరమైన రాక్షసస్త్రీలచే బెదిరింపబడుతూ ఒక్క క్షణం అయినా రాముడు లేకుండా దుఃఖితనై జీవిస్తున్నాను.

"ఈ సీత తక్కువ పుణ్యమే చేసింది. దీనురాలు. నేను అనాధనై సముద్ర మధ్యమందు గాలి యొక్క వేగంచే కొట్టబడిన నిండు పడవవలె నాశనం చెందుతాను. నీటిచే కొట్టబడిన ఏటిగట్టువలె, నా భర్తను చూడక, రాక్షస స్త్రీలకు వశమయి దుఃఖంతో నేను నశిస్తాను.

"తామరరేకుల వంటి విశాలమైన కనులు గలవాడు, సింహంవలె పరాక్రమంతో నడుచువాడు, కృతజ్ఞుడు, ప్రియమునే పలుకువాడు అయిన నా భర్తను ధన్యులైనవారు చూస్తారు. తీవ్రమైన విషాన్ని తాగిన తరువాత బ్రతకడం దుర్లభం. ఆ విధంగా ఆత్మవిదుడైన రాముడు లేకుండా నేను జీవించడం కూడా దుర్లభమే. పూర్వపు మరొక జన్మలో ఎటువంటి పాపం చేసినానో దాని ఫలితంగా ఘోరమైన, చాల దారుణమైన దుఃఖాన్ని ఇపుడనుభవిస్తున్నాను.

"చాల గొప్ప శోకంతో పీడింపబడుతున్న నేను జీవితాన్ని విడిచి పెట్టాలని కోరుతున్నాను. రాక్షసస్త్రీల చేత రక్షింపబడుతున్న నేను రామునిచేరలేను. ఈ మనుష్య జన్మ ఎంత చెడ్డది? ఇతరుల అధీనమైన ఈ బ్రతుకు ఎంత హీనమైనది? నేను కోరినట్లు ప్రాణాలను విడిచిపెట్టడం సాధ్యం కాకుండా ఉంది."

ఈ విధంగా జనకుని కూతురైన సీతాదేవి కన్నుల నుండి నీరుకారుతున్నదై ముఖం క్రిందికి దించి రోదించడానికి మొదలుపెట్టింది. శ్రమ తొలగిపోడానికి ఆడుగుఱ్ఱాన్ని నేలమీద పొర్లిస్తారు. ఆ విధంగా సీతాదేవి పిచ్చిదానివలె, అజాగ్రత్తగా ఉన్న దానివలె, భ్రమించిన మనసు కల దానివలె ఏడుస్తూ నేల మీద దొర్లింది.

"రాముడు ఏమరుపాటుగా ఉండగా కామరూపధారి, రాక్షసుడు అయిన రావణునిచేత ఆక్రోశించుచున్న దాననైన నేను ఇక్కడికి తేబడ్డాను. నేను రాక్షస స్త్రీల వశమై చాల దారుణంగా బెదిరింపబడుతూ, చాల దుఃఖంతో పీడింపబడిన దాననై, జీవించడానికి ఉత్సాహం లేనిదాననై ఉన్నాను. నాకీ జీవితంతోను, సంపదలతోను, ఈ నగలతోను ఏమి ప్రయోజనం? మహారథుడైన రాముని ఎడబాసి ఈ రాక్షస స్త్రీల మధ్య నివసిస్తున్నానే!

"నిజంగా రాతివలె నా హృదయం చాల గట్టిది- లేని పక్షంలో దీనికి పుట్టుక చావు అన్నవిలేవేమో! అందుచేతనే ఇంత దుఃఖానికి కూడా ఇది బ్రద్దలవడం లేదు. అయ్యో! నేను అనార్యను; దుష్టురాలను; నా పతిని ఎడబాసి ఒక్క క్షణ మైనా ఈ పాపజీవితం గడుపుతున్న నేను నింద్యురాలనే.

"సముద్రమే చివర ఎల్లగా నున్న ఈ ధరణికి ప్రభువైనవాడు, ప్రియము పలుకువాడు, నా ప్రియుడు అయిన రాముని ఎడబాసిన నాకు ఈ బ్రతుకు మీద శ్రద్ధ దేనికి? సుఖమందు నాకు ఎందుకీ ఆసక్తి?

"ఓ రాక్షసులారా! నన్ను చీల్చండి, భక్షించండి. ఈ నా శరీరాన్ని విడిచి పెడతాను. నా ప్రియుడైన రాముని విడిచి చాలకాలం ఈ దుఃఖాన్ని భరించలేను. రాక్షసుడైన రావణుని నాఎడమ కాలితోకూడ తాకను. అటువంటిది నింద్యుడైన రావణుని కామించనని వేరే చెప్పాలా? తన క్రూరమైన స్వభావాన్ని పురస్కరించుకొని ఈ రావణుడు నన్ను ప్రార్థింపగోరుతున్నాడు. అతని రక్షణను నేను నిరాకరిస్తున్నాని అతడెరుగడు. నన్ను ముక్కలుముక్కలుగా చీల్చినా సరే, లేక మండుతున్న అగ్నిలో కాల్చినాసరే, ఏమయినా రావణుని మాత్రం పూజించను. సతతం మీరు చేసే ప్రలాపాలవల్ల ప్రయోజనమేముంది?

"రాముడు లోక విఖ్యాతుడు, అందరియందు మంచినే చూసే ప్రాజ్ఞుడు, దయగలవాడు, మంచి ప్రవర్తన గలవాడు, ఇతరులకు కష్టం కలిగినట్లయితే దుఃఖించే స్వభావం కలవాడు; అటువంటి అతడు నా అదృష్టం క్షీణించడం చేతనే నాకు దర్శనమివ్వడం లేదని నేను అనుమాన పడుతున్నాను.

"జనస్థానమందు ఏ ఒక్కనిచేత పదునాలుగు వేల రాక్షసులు చంపబడ్డారో, అతడు నన్నేల రక్షించడు?

"తక్కువ పరాక్రమంకల రాక్షసుడైన రావణునిచేత నేను నిర్బంధింప బడ్డాను. నా భర్త రావణుని యుద్ధంలో చంపడానికి సమర్థుడు.

"రాక్షస వీరుడైన విరాధుడు ఏరామునిచేత చంపబడ్డాడో, ఆ రాముడు నన్నేల కాపాడడు. సముద్రమధ్యమందున్న ఈలంక శత్రువులకు ఎదిరింపరానిది కావచ్చు. కాని, ఇచ్చట రాముని బాణాల వేగాన్ని ఏదీ ఆపలేదు.

"దృఢ పరాక్రముడైన రాముడు, రాక్షసులచేత అపహరింపబడినది, ప్రియమై

నది అయిన భార్యను ఏకారణంచేత కాపాడడం లేదు?

"లక్ష్మణుని అన్నగారైన రాముడు నేనిక్కడ ఉన్న సంగతి ఎరుగడని నా సందేహం. అది తెలిసి కూడా రాక్షసుల తిరస్కారాన్ని తేజశ్శాలియైన రాముడు సహిస్తున్నాడా?

"నేను అపహరింపబడ్డానని రాముడితో చెప్పవలసిన పక్షిరాజు జటాయువు కూడా రావణునిచే యుద్ధమందు చంపబడ్డాడు. ఆ జటాయువు, వృద్ధుడైనా, ఆ విధంగా నన్ను రక్షిస్తూ, రావణుడితో ద్వంద్వ యుద్ధంచేసి చాల గొప్పపని ఆచరించాడు.

"ప్రస్తుతం నేనిక్కడ ఉన్న సంగతి రాముడు తెలుసుకుంటే, నేడే అతడు కోపం వహించి, లోకంలో రాక్షసుడన్న వాడు లేకుండా చేస్తాడు. రాముడు లంకా నగరాన్ని ఊది వేస్తాడు. మహాసముద్రాన్ని ఎండిస్తాడు. నీచుడైన రావణుని కీర్తిని, పేరును నాశనం చేస్తాడు. అపుడు సంహరింపబడిన పతులుగల రాక్షస స్త్రీల ఏడుపులు, నేనిప్పుడు ఎలా ఏడుస్తున్నానో, ఆ విధంగా ప్రతి యింటను కలుగు తాయి. ఈ విషయంలో సందేహం లేదు.

"లక్ష్మణునితో కూడిన రాముడు లంకను వెదకి రాక్షసులు లేకుండా చేస్తాడు. అతడి కళ్లబడిన శత్రువు ఒకడు కూడా క్షణమేనా బ్రతుకడు. చితుల నుండి లేచే పొగలతో నిండిన వీధులు కలది, గ్రద్దలగుంపులచే ఆవరింపబడినది అయిన ఈ లంక తొందరలోనే శ్మశానంతో సమంగా అవుతుంది.

"చాల తొందరలో నా కోరిక నెరవేరుతుంది. మీ దుర్మార్గతయే మీకు కలుగబోయే కీడును తెలుపుతున్నది.

"ఇక్కడ లంకలో సంభవించుతున్న అశుభాలను బట్టి త్వరితంగా ఈ నగరం కాంతి పోయినదిగా మారుతుంది. పాపాత్ముడు రాక్షసాధముడు అయిన రావణుడు చనిపోయినవాడు కాగా శత్రువులు జయింపలేని ఈ లంక, పతి మరణించిన వనిత వలె కాంతిపోయి వెలవెల బోతుంది. ఇది నిజం.

"భర్త మరణించిన స్త్రీవలె, ఈ లంకానగరం రాక్షసులతో కూడ ప్రభువైన రావణుడు మరణించినవాడు కాగా పుణ్యోత్సవములు తొలగినదవుతుంది. ఎంతో

కాలం కాకుండానే ఇంటింటను దుఃఖంతో పీడింపబడి ఏడుస్తున్న రాక్షసకన్యల రోదనధ్వని నేను తప్పక వింటాను. రాముని బాణాలచే కాల్చబడి ఈ లోకం చీకటిలో మునిగి వెలుగంతా పోయి, రాక్షసపుంగవులు చనిపోయినదవుతుంది.

"ఎఱ్ఱని కొనలున్న కనులు గలవాడు, శూరుడు అయిన రాముడు, నేనిప్పుడు రావణుని గృహమందు ఉన్నానని తెలిస్తే తప్పకుండా లంకను బాణాలతో కాల్చుతాడు.

"క్రూరుడు, నీచుడు అయిన రావణునిచే నా కీయబడిన గడువు కూడా సమీపించింది.

" ఈ రాక్షసులు పాపకర్మలు చేసేవారు. వారికి ఏ పని చేయరాదో తెలియదు. అధర్మం కారణంగా వారికిప్పుడు మహానర్థమే వాటిల్లుతుంది.

"మాంసభోజనులైన రాక్షసులు ధర్మాన్ని ఎరుగరు. తప్పకుండా నన్నీ రాక్షసుడైన రావణుని ప్రాతః కాల భోజనంగా వినియోగిస్తారు.

"చూపుకు చక్కనివాడు, ఎఱ్ఱని కనుగొనలు కలిగినవాడు అయిన రాముని చూడకుండా బాగా దుఃఖాన్ని పొందిన దాననై నేనిపుడేమి చేయగలను?

"ఎవరైనా నాకు విషమిచ్చే వారు ఇక్కడుంటే భర్తకు దూరమైన నేను తొందరలో దేవుడైన యముని చూడగలను.

"లక్ష్మణుని అన్నగారైన రాముడు నేను బ్రతికి ఉన్నానని ఎరుగడు. తెలిస్తే ఆ సోదరులిద్దరూ భూమినంతటిని వెదకుతారు. వీరుడైన రాముడు నా మీది దుఃఖంతో శరీరాన్ని భూమి మీద విడిచి పెట్టి దేవలోకానికి పోయి ఉంటాడు. ఈ విధంగా స్వర్గానికి పోయిన నా నాథుడైన రాముని చూడగలిగిన గంధర్వులు, సిద్ధులు, గొప్ప ఋషులు ధన్యులు కదా! లేక, ధర్మమందు కోరిక గలవాడు, బుద్ధి మంతుడు, పరమాత్ముడు, రాజర్షి అయిన రామునికి, భార్య అయిన నాతో పనేముంటుంది? నన్ను చూస్తూ ఉంటే అతనికి నాయందు ప్రీతి కలుగుతుంది. నన్నాతడు చూడకపోతే నామీద ఉత్తమచింతన ఎలా కలుగుతుంది? కృతఘ్నులు మాత్రం మునుపు కలిగిన ప్రీతిని విడిచి నశిస్తారు. కాని, రాముడటువంటివాడు కాడు. అతడు మరచిపోడు.

"ముఖ్యుడైన రాముడిని విడిచి నేనీ విధంగా దుఃఖిస్తున్నాను. నాలో ఏవైనా

మంచి గుణాలు లేవా? లేక, ఇది నా దురదృష్టమా?

"మహాత్ముడు, శూరుడు, ఉత్తమమైన నడవడి కలవాడు, శత్రువులను నాశనం చేయువాడు అయిన రాముడు లేనట్టి జీవితం కన్న మరణమే నాకు శ్రేయమైనది. లేకపోతే, నరోత్తములు, అన్నదమ్ములు అయిన రామలక్ష్మణులు అడవిలో కందమూలాలు, పండ్లు తింటూ, వన సంచారం చేస్తూ అస్త్రశస్త్రాలను విడిచి పెట్టేరా? లేక, దురాత్ముడు, మారువేషం వేసుకునేవాడు, రాక్షసుల ప్రభువు అయిన రావణునిచేత శూరులు, అన్నదమ్ములు అయిన రామలక్ష్మణులు చంపబడలేదుకదా?

"ఈ విధంగా కాలం గడుస్తూ ఉంటే, ఎప్పుడూ నేను చనిపోవాలని కోరుకుంటున్నాను. ఇంత దుఃఖంలో నున్నా మృత్యువు నాకు కలుగడం లేదు.

"పోయిన పాపాలు కలవారు, మహాత్ములు అయిన మునులు ధన్యులు కదా! అంతఃకరణలను జయించిన ఆ మహాభాగ్యవంతులకు ఇది ప్రియము, ఇది అప్రియము అన్న భేదం లేదు కదా? ప్రియమైన వస్తువు వలన దుఃఖం కలుగదు. ప్రియం కాని దానిచేత హెచ్చుగా భయం కలుగుతుంది. ఎవరయితే ఈ ప్రియానికి, అప్రియానికి అతీతులో ఆ మహాత్ములకు నమస్కారం.

"ఆత్మవిదుడు, ప్రీతిపాత్రుడు, యుక్తమైనవాడు అయిన రామునిచేత విడువబడిన నేను, పాపియైన రావణుని వశమయినాను. కాబట్టి ప్రాణాలను విడిచి పెడతాను."

ఈ విధంగా సీతాదేవి పలుకగా భయంకరులైన రాక్షసస్త్రీలు కోపంతో ఒళ్లు తెలియనివారైనారు. కొందరు రావణునితో ఆ సంగతి చెప్పడానికి వెళ్లినారు. పిమ్మట వారు కఠినమైన మాటలు పలకడం మొదలుపెట్టారు.

"ఓ అనార్య! (దుర్మార్గురాలా!) పాపపు ఆలోచనలు కలదానా! సీతా! నీ మాంసాన్ని రాక్షస స్త్రీలు హాయిగా భక్షిస్తారు."

అనార్యలైన రాక్షసస్త్రీలచేత భయపెట్టబడుతున్న సీతాదేవిని చూసి, వృద్ధురాలు, పండుకున్నది, రాక్షసి అయిన త్రిజట ఇట్లు పలికింది:

"ఓ అనార్యలైన స్త్రీలారా! జనకుని కూతురు, దశరథునికి యిష్టురాలైన

కోడలు అయిన సీతాదేవిని మీరు తినవద్దు. కోరితే నన్ను తినండి. దారుణమైనట్టిది, గగుర్పాటు కలిగించేది అయిన కల నొకదానిని నేను చూశాను. రాక్షసుల నాశనాన్ని, ఆమె భర్తయొక్క విజయాన్ని ఆకల సూచిస్తున్నది."

త్రిజట ఈ విధంగా పలుకగా, కోపంతో ఒళ్లు తెలియని రాక్షస స్త్రీలు భయపడి ఇట్లన్నారు.

"రాత్రి నీకు కనబడిన కల ఎటువంటిదో చెప్పవలసింది!"

త్రిజట తాను ప్రాతఃకాలం కలలో కన్నది వారితో చెప్పింది:

"ఏనుగుదంతంతో చేసినట్టిది, దివ్యమైనది, ఆకాశమార్గాన ప్రయాణం చేసేది అయిన పల్లకిని వేయి హంసలచేత ఆయత్తమైనదానిని, లక్ష్మణ సమేతుడైన రాముడు తెల్లని పూలదండలు వస్త్రాలు దాల్చినవాడై స్వయంగా ఆరోహించడం చూశాను.

"నేడు నేను చూసిన కలలో, సముద్రంచే చుట్టబడిన తెల్లని కొండవలె తెల్లని బట్టలు కట్టుకొని సీతాదేవి కనిపించింది. సూర్యునితో ఏ విధంగా కాంతి కూడి ఉంటుందో ఆ విధంగా సీతాదేవి రామునితో కలిసి ఉంది.

"నాలుగు దంతాలున్న మహాగజాన్ని, కొండవలె ఉన్న దానిని, లక్ష్మణునితో కలిసి రాముడు అధిరోహించడం నేను చూశాను. పురుషులలో పరాక్రమ వంతులైన రామలక్ష్మణులు తమ తేజస్సుతో వెలుగొందుతూ అక్కడున్నారు.

"తెల్లటి మాలలు, వస్త్రాలు ధరించి సీతాదేవి పక్కన నిలుచున్న రామ లక్ష్మణులు అపుడు ఆ తెల్లటి కొండ చివురున ఆకాశమందున్న ఏనుగుపై అధి రోహించి ఉన్నారు. పతిచేత పైకెత్తబడి చేయూత చేత గ్రహింపబడిన సీతాదేవి ఏనుగు మూపుపై ఎక్కింది. తరువాత రాముని ఒడినుంచి లేచి తామరల వంటి కనులు కల సీతాదేవి సూర్య చంద్రులను తన చేతులతో శుభ్రం చేస్తూ ఉంటే నేను చూశాను.

"పిమ్మట ఆరాజకుమారులు ఎక్కిన ఉత్తమమైన ఏనుగు విశాలమైన కనులు గల సీతతో కూడినదై లంకానగరం మీద కూర్చుంది.

"తెల్లని ఎడ్లను ఎనిమిదింటిని పూన్చిన రథమందు స్వయంగా రాముడు

భార్య సీతాదేవితోను, తమ్ముడు లక్ష్మణునితోను ఇక్కడికి వచ్చాడు.

"సూర్యునివలె ప్రకాశించుతూ ఉన్న దివ్యమైన పుష్పక విమానాన్ని ఎక్కి ఉత్తర దిక్కును చూసి పురుషోత్తముడైన రాముడు వెడలినాడు. ఈ విధంగా రఘుకుల మందు పుట్టిన రాముడిని, విష్ణువు వంటి పరాక్రమం కలవాడిని లక్ష్మణునితోను, సీతాదేవితోను కలలో నేను చూశాను.

"స్వర్గం ఏ విధంగా పాపులకు జయింపరానిదో ఆ విధంగా మహాతేజశ్శాలి యైన రాముడు దేవతలకు కాని అసురులకు కాని రాక్షసులకు కాని మరియే యితరులకు కాని జయించడానికి వీలుకానివాడు.

"రావణుడు శరీరం నిండా నూనె పూసుకొని ఎఱ్ఱని బట్టలు కట్టుకుని, త్రాగుతూ మత్తెక్కి గన్నేరుపూల దండను ధరించి నేలమీద పడిఉండగా నేను చూశాను.

"రావణుడు గొరిగిన తలతో నల్లని బట్టలు దాల్చి పుష్పకవిమానం నుండి భూమి మీద పడి మరల ఒక స్త్రీ చేత లాగబడుతూ ఉంటే నేను చూశాను.

"గాడిదలు పూన్చిన రథమెక్కి ఎఱ్ఱటి పూలదండలు, చందనాదులు దాల్చి నూనె త్రాగుతూ నవ్వుతూ నాట్యం చేస్తూ భ్రమించిన మనస్సూ ఇంద్రియాలూకల రావణుని నేను చూశాను.

"గాడిదనెక్కి తొందరగా దక్షిణ దిశవేపు పోతున్న రాక్షసరాజు రావణుని మళ్లా నేను చూశాను.

"అతడు గాడిద నుండి మాటలు లేకుండా భయంతో మతి తప్పినవాడై భూమి మీదపడిపోయాడు. తొందరగా లేచి భ్రమించినవాడై మిక్కిలి భయం చెంది మదంచేత వివశుడై వెఱ్ఱివాడివలె దిగంబరుడై హెచ్చుగా చెడ్డమాటలను పలుకుతూ, చెడ్డవాసన కలది, భరించలేనిది, ఘోరమైనది, చీకటి వంటి నరకంతో సమానమైనది అయిన బురదవంటి మలంలో ప్రవేశించి ఆ రావణుడు అందులో మునిగి పోయాడు.

"ఎఱ్ఱని బట్టలు దాల్చినది, నల్లనిది, ఒంటి నిండా బురదపూసుకున్నది అయిన ఒక స్త్రీ దశకంఠుని మెడకు ఒక తాడు కట్టి దక్షిణ దిశకు లాక్కొని

పోతున్నది. అదే విధంగా అక్కడ రాక్షసుడైన కుంభకర్ణుడిని కూడా నేను చూశాను.

"రావణుని పుత్రులందరూ నూనెలో మునిగినట్లు కనిపించారు. దశకంఠుడు వరాహం మీద, ఇంద్రజిత్తు మొసలి మీద, కుంభకర్ణుడు ఒంటెమీద ఎక్కి దక్షిణ దిశకు పోతున్నారు. విభీషణుడొక్కడే తెల్లటి గొడుగు వేసుకొని నాకు కనిపించాడు. అతడు తెల్లని పూలదండలను తెల్లటి బట్టలను ధరించాడు. తెల్లని చందనం అల దుకొన్నాడు. శంఖాలు దుంధుభులు మ్రోగుతుంటే నాట్యంచేత గీతాలచేత అలం కరింపబడినవాడై, పర్వతం వలె నున్నది, మేఘం ఉరిమినట్లు ఘీంకరించు తున్నది, నాలుగు దంతాలున్నది అయిన దివ్యమైన ఏనుగు నెక్కి విభీషణుడు అక్కడికి వచ్చాడు. అతడు తన నలుగురు మంత్రులతో కూడి ఆకాశమార్గాన కనిపించాడు.

"పాడుతూ వాద్యాలను మ్రోయిస్తూ ఉన్న సమూహ మొకటి నేను చూశాను. త్రాగుతూ ఉన్నవారు, ఎఱ్ఱటి పూలదండలు ధరించినవారు, ఎఱ్ఱటిబట్టలు కట్టినవారు అయిన రాక్షసుల సమూహమది.

"గుఱ్ఱాలతోను, రథాలతోను, ఏనుగులతోను చక్కగా నున్న లంకానగరం విరిగిన గోపురాలు తెగిన తోరణాలు కలదై సముద్రమందు పడడం నేను చూశాను. రావణునిచేత రక్షింపబడుతున్న లంకను నేను చూశాను. ఆ లంక బలవంతుడు, రామదూత అయిన వానరునిచేత తగుల బెట్టబడింది. నూనెత్రాగి హెచ్చుగా నృత్యం చేస్తున్నవారు, పెద్దగా నవ్వుతున్నవారు, పెద్దగొంతులతో ధ్వనిచేస్తున్న వారు అయిన రాక్షస వనితలు,కాలి తగులబడి ఘోరంగా నున్న లంకలో ప్రవే శించారు.

"కుంభకర్ణుడు మొదలయిన ఈ రాక్షసశ్రేష్ఠులందరూ రక్తంలో నివసిస్తూ ఆవు పేడనిండిన గోతిలోకి ప్రవేశించారు.

"కాబట్టి మీరందరూ తొలగిపొండి, లేకపోతే నాశనమవుతారు. ఆ రాముడు సీతను పొందుతాడు. చాల కోపం గల రాముడు అందరూ రాక్షసులతోపాటు మిమ్మల్ని కూడా చంపుతాడు.

"ప్రియురాలు, హెచ్చుగా గౌరవింపబడుతున్నది, వనవాస ధర్మాన్ని పాలిస్తు న్నది అయిన భార్యను భయపెట్టినా బెదరించినా రాముడు అంగీకరించడు. ఇక

క్రూరమైన పలుకులు చాలు. తీయటి మాటలే పలుకండి.

"సీతాదేవిని మనం యాచించుదాము. ఇది నాకు ఉత్తమమని తోస్తున్నది. దుఃఖంలో నున్న ఏ వనిత గురించి నేను ఈ విధమైన కలగన్నానో, ఆమె అన్ని విధాలైన దుఃఖాలనుండి విడువబడి ఉత్తముడైన ప్రియుడిని పొందుతుంది. ఇంత వరకూ ఆమెను భయపెట్టినా ఇప్పుడామెను యాచించుదాము. రాక్షస వనితలారా! ఈ విధంగా పలుకాలని కోరితే తప్పేముంది?

"రాముని వలన ఘోరమైన భయం రాక్షసులకు సంప్రాప్తమయింది. జనకుని కూతురైన సీతాదేవి పాదాల మీదపడి ప్రణామం చేస్తే ఆమె ప్రసన్నురాలౌతుంది. రాక్షసాంగనలారా! గొప్ప భయం నుండి రక్షించడానికి ఈమె చాలు. విశాల నేత్రములు కల సీతాదేవి యొక్క అంగములయందు వైకల్యంకాని, ఛాయా మాత్రంగా చాల సూక్ష్మమైన అవలక్షణంకాని దుఃఖంలో నున్న ఈమెలో కని పించవు.

"ఈమె ఆకాశమార్గాన ఉన్నతంగా ఉంది. దుఃఖాలను అనుభవించడానికి ఈమె యోగ్యురాలు కాదు. మనకు సమీపంలోనే ఉన్న ఈ సీతాదేవి కార్యం సిద్ధి స్తుందని నాకు తోస్తున్నది.

"రాక్షస రాజు నాశనం, రాముని విజయం క్షణమాత్రంలో సిద్ధిస్తాయి. ఈ వార్త ఈమె వినడానికి చాల ఇష్టంగా ఉంటుంది.

"ఈమె ఎడమ కన్ను తామర రేకువలె విశాలమైనది. ఆకన్ను అదురు తున్నది. ఈమె కొంచెమైనా సంతోషిస్తే, మనం పాత్రులం కాకపోయినా రక్షించగలదు."

ఉన్నట్లుండి ఒక్కసారిగా సీతాదేవి యొక్క భుజమొకటి (ఎడమది) కంపించింది. ఆడ ఏనుగు తొండము వంటి ఆమె ఎడమ తొడ కొంచెం అదురుతూ రాముడు తొందరగా ఆమె ముందుండగలడని సూచించింది.

చెట్టుకొమ్మలపైన నివసించు పక్షి (పింగళ వర్ణం కలది) చాల సంతోషించి చాల ఉత్తమమైన ఓదార్పు మాటలను మాటి మాటికి పలికింది. సంతుష్టి చెందినదై మరల మరలపైకి లేస్తూ స్వాగత వచనాలను పలుకుతున్నది.

ఆ సీతాదేవి రావణుని అప్రియవచనాలను విని దుఃఖించినదై అడవిలో సింహాలకు చిక్కిన గజరాజు కూతురివలె భయం పొందింది. పిరికిదైన సీతాదేవి రాక్షసస్త్రీల నడుమ చిక్కుకొని రావణునిచేత అధికంగా భయపెట్టబడినదై మనుష్యులు లేని అడవి మధ్యను విడిచిన బాలికవలె ఏడ్చింది.

"అకాలంలో మృత్యువు కలుగదని సజ్జనులు పలుకుతారు. ఆ మాట సత్యమైనది. నా విషయంలో అది నిజమైనదే. ఈ ప్రకారం రాక్షసులచేత భయపెట్టబడుతున్నా పుణ్యం లేనిదానను అవడం చేత ఈ కొద్ది కాలం బ్రతికే ఉన్నాను.

"సుఖం లేకపోయినా, చాల దుఃఖంతో నిండి ఉన్నా, వజ్రాయుధం చేత కొట్టబడి వేయి ముక్కలైన పర్వత శిఖరం వలె ఉన్నా, నా హృదయం మాత్రం స్థిరంగా ఉంది.

"నేను ఆత్మహత్య చేసుకోవడం తప్పుకాదు. అసహ్యమైన ఆకారంకల రావణుని చేతిలో వధింపబడడం కన్న ఆత్మహత్యమేలు. అట్లు కాక, నేను రావణునికి లొంగి నా హృదయం సమర్పించుకుంటే ద్విజుడు కానటువంటివాడికి ద్విజుడు మంత్రోపదేశం చేసినట్లుంటుంది.

"లోకనాథుడైన నా భర్త రెండు నెలల గడువు ముగియక ముందు రాకపోతే, ఎముకలను సరిచేసే మంగలి జంతువు గర్భమందున్న మృతశిశువు పైకి రాకపోతే దానిని ముక్కలుగా కోసినట్లు అనార్యుడు రాక్షసులకు రాజు అయిన ఈ రావణుడు నన్ను నరుకుతాడు.

"రెండు నెలల గడువు పూర్తికావస్తుంటే, రాజాపరాధం చేసి బంధింపబడి మరునాడు ఉదయమే మరణశిక్షను అనుభవించ నున్న దొంగపొందే దుఃఖంవలె, చాల కాలం నుండి దుఃఖిస్తున్న నాకు దుఃఖం కలుగుతున్నది.

"ఓ రామా! ఓ లక్ష్మణా! ఓ సుమిత్రా! రాజమాత అయిన ఓ కౌసల్యా దేవీ! నా తల్లితో సహామీరందరు వినండి. దురదృష్టవంతురాలైన నేను మహా సముద్రంలో సుడిగాలి తగిలిన ఓడవలె ఈ విపత్తులో చిక్కుకున్నాను.

"లేడి రూపం ధరించిన ప్రాణిని నాకోసం వెదకుటకు పోయిన ధైర్య

శాలురైన ఆరాజ పుత్రులిద్దరూ, పిడుగు పాటుచేత ముక్కలైన సింహ వృషభాలవలె తప్పక నశించిపోయి ఉంటారు.

"నేను ఎప్పుడైతే తెలివి తక్కువ దాన్నై లక్ష్మణుని అన్నయైన ఆర్య పుత్రుడు రాముని, రాముని తమ్ముడైన లక్ష్మణుని విడిచి పెట్టినానో, ఆ కాలమే తప్పకుండా అదృష్టహీనయైన నన్ను లేడి రూపం ధరించి లోభపెట్టింది.

"ఓ రామా! సత్యం తప్పనివాడా! ఆజానుబాహుడా! నిండు చంద్రుని పోలిన ముఖం గలవాడా! ఎల్ల ప్రాణులకు హితుడా! ప్రియుడా! నేను రాక్షసులచేత చంపబడుతున్నాని నీకు తెలియడం లేదా!

"నేను నిన్ను తప్ప ఇతరదైవాన్ని కోరడం లేదు. ఈ ఓర్పుకూడా నీ కోసమే వహించాను. భూమి మీదనే పండుకుంటున్నాను. ధర్మమే నియమంగా వర్తిస్తున్నాను. మనుష్యులలో కృతఘ్నులైన వారికి చేసిన ఉపకారం వలె నా పాతివ్రత్యం ఫలితమీయడం లేదు. నేను చేసిన ధర్మమంతా ప్రయోజనం లేకుండా పోయింది. ఆ విధంగానే నా పాతివ్రత్యం కూడా నిరర్థకమయింది. అందుచేతనే నిన్ను చూడలేకపోతున్నాను. కృశించిన దానను, రంగు తప్పిన దానను, నువ్వు చెంతలేని దానను, నిన్ను కలిసి కోగలనన్న ఆశ కూడా లేనిదానను.

"తండ్రి ఆజ్ఞను నువ్వు నియమంతో పాలించావు. వనవాసవృత్తిని వ్రతంగా చేసుకున్నావు. అరణ్యావాసకాలం ముగియగనే నేను మరణించిన తరువాత భయం పోయిన వాడివై కార్యసిద్ధిని పొందిన వాడివై విశాలమైన కన్నులు కల పలువురు స్త్రీలను పెండ్లాడి వారితో క్రీడిస్తావు.

"రామా! నీయందు నేను అనురాగం కలదానను. చాలకాలం వరకు నశిస్తానని నిశ్చయంగా తలచాను. నేను చేసిన వ్రతాదినియమాలు వ్యర్థమైనవి. అహో! భాగ్యం తగ్గిన నేను ప్రాణాలను విడుస్తాను. ఈ జీవితాన్ని తొందరగానే నేను విడుస్తాను. విషమైనా త్రాగుతాను. వాడియైన ఆయుధంతోనైన ప్రాణాలు తీసు కుంటాను. కాని, ఈ రాక్షసుడి యింట నాకు విషమిచ్చేవాడూ లేడు, శస్త్ర మిచ్చేవాడూ లేడు."

ఈ ప్రకారం సీతాదేవి పలువిధాలుగా విలపించింది. నిండు మనసుతో

రాముడినే తలచింది. భయంతో వణకిపోతూ నోరు ఎండిపోతూ ఉంటే పూలతో నిండిన శింశుపావృక్షం దగ్గిరికి వచ్చింది.

సీతాదేవి దుఃఖంతో బాగా పీడింపబడినదై పలువిధాలుగా చింతించి తల పట్టుకొని ఈ విధంగా పలికింది:

"నేను ఈ జడను మెడకు ఉరిపోసుకొని యముని ఇంటికి పోతాను."

అపుడు కోమలములైన అవయవాలు కల సీతాదేవి ఆ చెట్టుకొమ్మను పట్టుకొని నిలబడింది. రాముడిని, రాముడి సోదరుడైన లక్ష్మణుడిని తన వంశాన్ని హెచ్చుగా తలచుకుంటున్న మంగళకరములైన అవయవాలు కల సీతాదేవికి శుభ సూచకాలు, ధైర్యాన్ని కలిగించేవి, లోక ప్రసిద్ధాలు, అంతకు పూర్వం మంచి ఫలితాలను ఇచ్చినవి, అయిన శకునాలు చాల కలిగినవి.

చెప్పుకోలేని దుఃఖంతో బాధపడుతున్నది, వ్యధచెందినది, దోష రహితమైనది, సంతోషము తొలగినది, చాల దీనమైన మనసు కలది అయిన సీతాదేవికి, ఏ విధంగా ధనంకలవానిని సేవకులు చుట్టుకుంటారో ఆ విధంగా శుభశకునాలు ఆశ్రయించాయి.

సీతాదేవి ఎడమ కన్ను చాల శుభకరమైనది. వంకరలైన రెప్ప వెంట్రుకలు కలది, నడుమ నల్లనిది, చుట్టూ తెల్లనిది, కొనలయందు ఎఱ్ఱనిది- ఆ ఎడమ కన్ను చేపచే కొట్టబడిన తామరపూవు వలె అదిరింది.

సీతాదేవి యొక్క భుజం (ఎడమది) సుందరమైనది, యోగ్యమైనది, బలిష్ఠమైనది, గుండ్రనిది, శ్రేష్ఠములైన కృష్ణాగురుచందనాదులు పూయబడినది; ప్రియుడు, ఉత్తముడు అయిన రాముడికి చాలకాలం తలగడగా ఉన్నది – అట్టి సీతాదేవి యొక్క ఆ ఎడమభుజం తొందరగ కపించింది.

సీతాదేవి యొక్క రెండు తొడలు ఏనుగుల రాజు తొండంవలె బలిసినవి, దగ్గరగా ఉన్నవి ఆమె తొడ తిరిగి కంపించి, "రాముడు నీ ఎదుటే ఉన్నాడు" అని చెప్పింది.

సీతాదేవి కన్నులు నిర్మలములైనవి. ఆమె పలువరుస మొనలు దేరి ఉంది. ఆమె శరీరవయవాలు సుందరమైనవి. ఆ సీతాదేవి ధరించిన చీర శుభ్రమైనది.

బంగారంతో సమానమైన కాంతి గలది. దానిపై కొంచెం దుమ్ము పడింది. ఆ చీర శుభాన్ని సూచిస్తూ కొంచెం జారింది.

చక్కని కనుబొమలు కల సీతాదేవి ఈశుభ శకునాలచేతను, మరికొన్ని ఇతర శకునాలచేతను, ఇంతకు పూర్వం కూడా సత్ఫలితాల నిచ్చిన సూచనల చేతను రాబోయే శుభాలు తెలుపబడ్డదై, గాలికి ఎండకు వాడి నశించిపోవడానికి సిద్ధమౌతున్న మొలక వర్షంచేత తెప్పరిల్లినట్లు రామసమాగమం ఎదురు చూస్తూ ఆనందించింది.

సీతాదేవి యొక్క పెదవి ఎఱ్ఱని దొండపండు వంటిది. కనులు, కనుబొమలు సుందరమైనవి. ముంగురులు చక్కనివి, కనురెప్పలు వంకరలు, దంతాలు చాల తెల్లనివి. అటువంటి సీతాదేవి, రాహువు ముఖం నుండి బయటపడ్డ చంద్రునివలె ప్రకాశించింది.

పూజ్యురాలైన సీతాదేవి, కలిగిన శుభశకునాలచేత దుఃఖం తొలగి, మాంద్యం వీడి, తాపం పోయి, ఆనందంచేత వికాసం పొందిన ముఖంతో చంద్రుడుదయించిన శుక్లపక్షపు రాత్రివలె శోభించింది.

పరాక్రమశాలియైన హనుమంతుడు సీతాదేవి దుఃఖాన్ని చూసిన వాడై త్రిజటాస్వప్నవృత్తాంతము విన్నవాడై రాక్షసస్త్రీలు సీతాదేవిని బెదిరించడం గమనించినవాడై సర్వవృత్తాంతాన్ని విన్నాడు.

నందనవనంలో నున్న దేవతవలె అశోకవనంలో నున్న సీతను చూసి వానరుడైన హనుమంతుడు బహువిధాల విచారించాడు.

"ఏ తల్లి కోసం ఎంతమందో వానరులు వేరువేరుగా వేలవేల సంఖ్యలో అన్ని దిక్కులను వెదకుతున్నారో ఆయమ్మను నేను చూడగలిగాను.

"సమర్థుడైన చారుడు శత్రువు శక్తిని పరిశీలిస్తున్నట్లు రహస్యంగా సంచరిస్తున్న నేను ఈ విషయమంతటినీ చూశాను.

"రాక్షసుల గొప్పదనం, ఈ నగరం పరిసరాలు, ఈ రాక్షసరాజైన రావణుని ప్రభావాన్ని నేను చూశాను.

"భర్తను చూడాలన్న కోరికగల రాముని భార్య సీతాదేవిని నేను ఓదార్చుట యుక్తమైనపని.

"పున్నమినాటి చంద్రుని బోలిన ముఖం కలది, అంతకుపూర్వం దుఃఖాలను అనుభవించనిది, దుఃఖంచేత పీడింపబడినది, దుఃఖం యొక్క అంతంచేరలేనిది అయిన సీతాదేవిని నేను ఓదారుస్తాను.

"ఆమెను ఓదార్చకుండా నేను వెళ్లిపోయినట్లయితే నా ప్రయాణం దోషం పొందినదవుతుంది. నేను సీతాదేవిని ఓదార్చకుండా కిష్కింధకు మరలిపోయినట్ల యితే కీర్తిశాలిని, రాజపుత్రి అయిన జానకి తప్పించుకునే దారి తెలియక ప్రాణాలను విడిచి పెడుతుంది.

"పూర్ణచంద్రునివంటి ముఖం కలవాడు, మహాభుజుడు, సీతాదేవిని చూడా లన్న కోరిక గలవాడు అయిన రాముడిని ఓదార్చడం నాకు న్యాయం.

"రాక్షసస్త్రీల ఎదుట సీతాదేవితో మాట్లాడడం తగిన పనికాదు. ఇపుడు నేనేం చేయాలి? అహో! సంకటంలో పడ్డానుకదా!

"రాత్రి భాగం ఇంకా మిగిలిఉంది. ఇప్పుడు నేను సీతాదేవిని ఓదార్చకుండా ఉన్నట్లయితే ఆమె జీవితాన్ని త్యజిస్తుంది. ఇందుకు సందేహం లేదు. సీత నీకే మని చెప్పిందని రాముడడిగితే అతనికేం సమాధానం చెప్పగలను? సీతాదేవి యిచ్చిన సందేశాన్ని తీసుకోకుండా తొందరగా నేను మరలిపోయినట్లయితే రాముడు కోపించి తీవ్రమైన చూపులతో నన్ను దహిస్తాడు. రాముని పనికోసం స్వామియైన సుగ్రీవుని ప్రేరేపించి ఇక్కడికి తీసుకొని వస్తే సైన్యంతో వచ్చిన అతని రాక వ్యర్థమవుతుంది. (ఆసరికి సీతాదేవి మరణించవచ్చు.)

"అందుచేత నేనిక్కడనే ఉండి రాక్షస స్త్రీలు తొలగిపోగానే అవకాశం చూసుకొని మిక్కిలి దుఃఖిస్తున్న ఈమెను తొందరగా ఓదార్చుతాను. నేను చాల చిన్న వాడిని. విశేషించి కోతిని. మనుష్యులు మాట్లాడే సామాన్యమైన సంస్కృత భాషలో ఈమెతో మాట్లాడుతాను. అట్లు కాకుండా ద్విజులు మాట్లాడే సంస్కృత భాషలో మాట్లాడినట్లయితే ఈమె నన్ను రావణుడిగా తలచి భయపడుతుంది. వానరుడు సంస్కృత భాషలో ఎట్లు మాట్లాడ గలడని ఆమె సందేహించవచ్చు. అందుచేత నేను అర్థమిచ్చే సామాన్య మానవుని వాక్యమే పలుకవలసి ఉంది

అట్లు కాకుండా ద్విజుల సంస్కృత భాషలో నేను మాట్లాడితే సీతాదేవి నా రూపాన్ని చూసి నా మాటలు విని యింకా భయపడుతుంది. ఆమెను అప్పుడు ఓదార్చడానికి వీలుకాదు.

"రాక్షసులచేత ఇంతకు పూర్వమే భయపెట్టబడిన సీతాదేవి ఇంకా భయపడి చప్పుడు చేస్తుంది. విశాలనేత్రాలు కల ఆమె నన్ను చూసి కామరూపియైన రావణుడని తలుస్తుంది. ఆమె చేసిన చప్పుడుకు రాక్షస స్త్రీలు తొందరగా అక్కడికి మూగుతారు. యముడితో సమానమైన ఆరాక్షస స్త్రీలు అన్ని విధాలైన ఆయుధాలు ధరించి నన్ను చుట్టుముడతారు. చెట్ల కొమ్మలు, మొదళ్ల పట్టుకొని బలమంతా వినియోగించి నన్ను బంధించి చంపడానికి ప్రయత్నం చేస్తారు. నేను అన్ని దిక్కులకు పరిగెడుతూ వుంటే చూసి వాళ్లు భయంతో నన్ను శంకిస్తారు. తోటలో తిరుగుతున్న నా మహద్రూపాన్ని చూసి వారు సందేహిస్తారు. వాళ్ల భయంతో వణకుతూ రాక్షసులను కూడా పిలుస్తారు. రావణుని గృహాన్ని కాపాడడం కోసం నియమింపబడిన వాళ్లు శూలం, శక్తి, కోల మొదలయిన పలురకాల ఆయుధాలను ధరించి చూసేవారికి భయం కలిగిస్తారు. వాళ్లు వేగంగా యుద్ధానికి వస్తారు. అపుడు నేను రాక్షసుల సైన్యంచేత అన్ని వేపులా అడ్డగింపబడతాను. ఆ విధంగా నేను తిరిగి మహా సముద్రాన్ని దాటి ఆవలి ఒడ్డు చేరలేకపోతాను.

"లేకపోతే చాలమంది, త్వరగా పనిచేసేవాళ్లు నా మీదపడి పట్టుకుంటారు. ఒకవేళ నన్ను బంధిస్తే నేను వచ్చిన పని చెడిపోతుంది. హింసించుటయందే అభిరుచిగల వీళ్లు జనకుని కూతురైన సీతాదేవిని చంపుతారు కూడా! రామ సుగ్రీవుల కార్యం సంకటంలో పడుతుంది. రాక్షసులచేత అంతటా చుట్టబడిన లంక, చేరడానికి దారిలేని దవుతుంది.

"ఈ లంకలో సీతాదేవి ఎవరికీ కనపడకుండా నివసిస్తూ ఉంది. యుద్ధంలో రాక్షసులు నన్ను పట్టుకున్నా, చంపినా కార్యం సాధించడానికి రాముడికి సహాయం చేసేవారెవరూ కనిపించడం లేదు. వానరుడనైన నేను మరణిస్తే నూరు యోజనాలు వెడల్పు గల మహాసముద్రాన్ని ఎవరు దాటగలరు? నేనయితే వేలకొలది రాక్షసులను చంపడానికి సమర్థుడినే. కాని, మహాజలధియొక్క ఆవలిగట్టును చేరుకోలేను.

"యుద్ధాలు జయాపజయాలతో కూడినవి. సందేహమంటే నాకు ఇష్ట

పడదు. సంశయంతో కూడిన పనిని ప్రాజ్ఞుడైన వాడెవడూ ఆలోచించకుండా ఎలా చేస్తాడు? నేను సీతాదేవితో మాట్లాడకపోతే ఆమె ప్రాణాలను విడుస్తుంది. ఆమెతో నేను సంభాషించకపోతే మహాదోషం కలుగుతుంది.

"దేశకాలాలకు విరుద్ధంగా శరీరధారులు చేసిన పనులు నశించుతవి. సూర్యుడు ఉదయించినప్పుడు చీకటి ఏ విధంగా నశించుతుందో ఆ విధంగా అవివేకియైన దూత చేసే పనులు నశిస్తాయి. ఇది చేయరానిది, ఇది చేయదగినది అని బుద్ధిని స్థిరం చేసినా అది శోభించదు. తామే పండితులమని భావించే దూతలు కార్యాలను పాడుచేస్తారు.

"నేను చేయవలసిన ప్రభుకార్యం ఎట్లు చెడకుండా ఉంటుంది? బుద్ధి హీనత కలుగకుండా ఉండడమెట్లు? నేను సముద్రాన్ని దాటడం వ్యర్థం కాకుండా సఫలమెట్లవుతుంది? ఈమె నా మాటలు ఎలా వింటుంది? విని, భయపడదు కదా?" ఇట్లు మతిమంతుడైన హనుమంతుడు ఆలోచించి ఈ విధంగా మధురమైన వాక్యాలు సీతాదేవితో పలికాడుః

"దశరథుడను రాజు ఉండేవాడు. అతనికి రథాలు ఏనుగులు గుఱ్ఱాలు ఉండేవి. అతడు పుణ్యశీలుడు. మహాకీర్తివంతుడు, తిన్నని స్వభావం కలవాడు, పరాక్రమశాలి అని యశస్సును పొందినవాడు. అతడు రాజర్షులందరిలోను గుణాలలో శ్రేష్ఠుడు; తపస్సుచేత ఋషులకు సమానుడు, చక్రవర్తుల కులమందు పుట్టినవాడు, ఇంద్రునితో సమానమైన బలం కలవాడు. అహింసా ధర్మమందు ఆసక్తి కలవాడు, ఉదాత్తమైన స్వభావం కలవాడు, దయాళువు, విఫలం కాని పరాక్రమం కలవాడు, ఇక్ష్వాకు వంశానికి ముఖ్యుడు, సంపద కలవాడు, ఆశ్రితుల సంపదను పెంచేవాడు, సాముద్రిక శాస్త్రమందు చెప్పబడిన అన్ని రాజలక్షణాలు కల రాజశ్రేష్ఠుడు, గొప్ప కాంతి కలవాడు, చతుస్సాగరపర్యంతమైన భూమండలమందు ప్రసిద్ధుడు, ప్రజలకు సుఖం కూర్చేవాడు, తాను సుఖంగా ఉండేవాడు.

"ఆ రాజుకు చంద్రుడిని పోలిన ముఖం కలవాడు, సర్వ ధర్మవిశేషాలు తెలిసినవాడు, విలుకాండ్రలో శ్రేష్ఠుడు రాముడన్న పేరుగల పెద్దకొడుకు ఉన్నాడు. రాముడు తన క్షత్రియ ధర్మాన్ని రక్షించేవాడు, తన బంధువులను కాపాడేవాడు, ధర్మాన్ని రక్షించేవాడు, శత్రువులను పీడించేవాడు, సత్యమే ప్రతిజ్ఞగా కల వీరుడు

ఆ రాముడు. అతడు వృద్ధుడైన తండ్రిమాట ప్రకారం భార్యతోను తమ్ముడితోను అడవికి పంపబడ్డాడు. అక్కడ మహారణ్యంలో చాలమంది కామరూపులు, శూరులు, అయిన రాక్షసులు పరుగెత్తుతూ ఉంటే రామునిచేత వేటలో చంపబడ్డారు.

"జనస్థానమందు రాక్షసులు వధింపబడ్డారని ఖరదూషణులు కూడ చంప బడ్డారని రావణుడు విని, మోసగించి సీతాదేవిని అపహరించాడు. అడవిలో లేడి రూపంతో మాయచేసి రాముడిని వంచించి అతడు సీతాదేవిని దొంగిలించాడు. శీలవతియైన ఆ సీతాదేవిని వెదకుతూ రాముడు అడవియందు సుగ్రీవుడను పేరుకల వానరునితో స్నేహం చేశాడు. పిమ్మట శత్రువుల నగరాలను దహించే రాముడు వాలిని చంపాడు. ఆ వానరరాజ్యాన్ని సుగ్రీవునికి ఇచ్చాడు. సుగ్రీవుడు సీతాదేవిని వెదకుట కోసం కామరూపులైన వానరులను పంపించాడు. వేల సంఖ్యలో వానరులు ఆమెను వెదకుతున్నారు.

"నేను సంపాతి చెప్పిన మాటల ప్రకారం నూరు యోజనాలు వెడల్పు గల సముద్రాన్ని ఈ వెడదకన్నులు కల సీతాదేవికోసం వేగంగా దాటాను. ఎటువంటి రూపం, ఎటువంటి రంగు, ఎటువంటి శోభకలదని విన్నానో అటువంటి సీతాదేవిని, రాముడి కోసమై ఇక్కడ కనుగొన్నాను."

ఇంతవరకు పలికి వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు ఊరకున్నాడు. సీతాదేవి ఆ మాటలను విని చాల ఆశ్చర్యపోయింది. వంకరలైన ముంగురులు చక్కని కేశములు కలది, జుత్తు ముడిపెట్టుకున్నది అయిన సీతాదేవి భీరువై, ముఖాన్ని పైకెత్తి శింశుపావృక్షాన్ని చూసింది. వానరుడి మాటలు విని దిక్కులను విదిక్కులను కలియ జూసి ఎల్లప్పుడూ రాముడినే ధ్యానించే సీతాదేవి స్వయంగా అధికమైన సంతోషాన్ని అమితంగా పొందింది.

ఆ సీతాదేవి శింశుపావృక్షం పక్కలను, పైన, క్రిందను పరిశీలించి ఊహలు దాటిన బుద్ధిమంతుడు, వానర రాజైన సుగ్రీవుని మంత్రి, వాయుపుత్రుడైన హనుమం తుని, ఉదయిస్తున్న సూర్యునివలె ఉన్నవాడిని చూసింది.

అటు పిమ్మట చెట్లకొమ్మల వెనుక దాగిఉన్నవాడు, తెల్లని బట్టను కట్టినవాడు, మెరుపు సమూహం వలె పింగళ వర్ణం కలవాడు అయిన హనుమంతుని

చూసి సీతాదేవి కలత చెందింది. వినయవంతుడు, ప్రియం పలుకువాడు, వికసించిన అశోకపుష్పాల కాంతి గలవాడు, కరిగిన బంగారం వంటి కన్నులు కలవాడు, అయిన వానరుని ఆమె చూసింది.

మిథిలారాజకుమారియైన సీతాదేవి అధికంగా ఆశ్చర్యం పొందినదై ఈ విధంగా తలచింది:

"అహో! ఈ వానరుడి రూపం ఎంత పెద్దదిగా ఉండి భయంకరిగిస్తున్నదో! ఈ రూపం చూడ శక్యం కానిది."

ఇట్లు తలచి ఆమె మరల మూర్ఛపోయింది. సీతాదేవి భయపడి మరల దీనంగా విలపించింది.

"రామా! రామా! లక్ష్మణా!" అని మందమైన స్వరంతో పలుకుతూ చాల విధాలుగా ఏడ్చింది. వినయవంతుడుగా కనిపిస్తున్న వానరోత్తముని దగ్గరలో చూసి భామినియైన సీతాదేవి ఇదంతా కల అని భావించింది.

ఆమె అట్లు పరిశీలిస్తూ పెద్ద వంకర మూతి కలవాడు, వానరుల రాజైన సుగ్రీవుని మాట ప్రకారం ఆచరించేవాడు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, గాలి దేవుని కొడుకు, సుగ్రీవుని మంత్రి అయిన హనుమంతుడిని చూసింది. సీతాదేవి మళ్ళీ హనుమంతుడిని చూసి ప్రాణాలు లేనిదాని వలె తెలివి తప్పి పోయింది. చాల సేపటి తరువాత తెప్పరిల్లి ఇట్లు ఆలోచించింది:

"నేడు స్వప్నంలో ఈ వికృతాకారుడిని చూశాను. వానరం కలలో కనబడడం శాస్త్ర నిషిద్ధం. అరిష్టమని శాస్త్రం నిషేధించింది. నారాముడికి, నా లక్ష్మణుడికి, ఆ విధంగానే నా తండ్రియైన జనకరాజుకి శుభమగుగాక!

ఇది కలగాదు. శోకంతోను, దుఃఖంతోను పీడింపబడుతున్న నాకు నిద్ర అన్నది లేదు. మరి కల ఎలా వస్తుంది? పూర్ణచంద్రుని వంటి ముఖం కల రాముడిని ఎడబాసియున్న నాకు సుఖం లేదుకదా!

"రామా! రామా! అని ఎల్లప్పుడు తలుస్తూ అతనినే మాటలతో ఎప్పుడు స్మరిస్తూ అతనికి సంబంధించినవి, దానికి అనురూపంగా నున్నవి అయిన కథలనే వింటూ ఆ దృశ్యాలనే మనో నేత్రాలతో చూస్తున్నాను.

"నేడు నేను రాముడినే తలుస్తున్నాను. అతనియందే ఆలోచనలన్నీ నిలిపి మన్మథునిచే పీడింపబడుతున్నాను. ఎల్లప్పుడూ అతని గురించే ఆలోచిస్తున్నాను. ఆ ప్రకారమే చూస్తున్నాను. ఆ విధంగానే వింటున్నాను.

"ఇట్లు రాముని గురించి పలుకుతున్నది నామనోరథమే అనుకుంటాను. అయినప్పటికీ బుద్ధిని ఉపయోగించి తర్కించి ఆలోచిస్తే ఈ రామనామోచ్చారణ నా అభిలాష మాత్రం కాదని తోస్తున్నది. ఎందుచేతనంటే నా అభిలాషకు రూప మంటూ లేదు. కాని, నాకోసం ఈ మాటలను పలుకుతున్న వ్యక్తికి స్పష్టమైన రూపముంది.

"దేవగురువైన బృహస్పతికి నమస్కారము. దేవేంద్రునికి నమస్కారము. బ్రహ్మకు అగ్నికి నమస్కారాలు. నా ఎదుట ఈ వానరుడు పలికింది నిజమగుగాక!"

పగడం వలె ఎఱ్ఱనైన ముఖం కలవాడు, వినయం సూచించే సాధారణ వస్త్రాలను ధరించినవాడు, సీతాదేవి అవస్థను చూసి దీనుడైనవాడు అయిన హను మంతుడు చెట్టునుండి కొంచెం దిగి ఆమెను అభినందించినాడు. శిరసుపై అంజలి ఘటించి మహా తేజశ్శాలి వాయుపుత్రుడు అయిన హనుమంతుడు ఆ సీతాదేవితో మధురమైన మాటలు ఇట్లు పలికాడు:

"తామరపూవు రేకులవంటి కన్నులు కలదానా! నలిగిన పట్టు బట్టను కట్టిన దానా? అనింద్యమైన ఉత్తమ శీలం కలదానా! ఈ చెట్టు కొమ్మను పట్టు కొని ఉంటున్న నువ్వెవరవు? తామరాకుపై బడిన నీరు చిమ్మబడినట్లు దుఃఖం వలన కలిగిన నీరు నీ కనులనుండి ఎందుకు కారుతున్నది?

"ఓ మంగళరూపిణీ! దేవతలు, అసురులు, నాగులు, గంధర్వులు, రాక్షసులు, యక్షులు, కిన్నరులు - వీరిలో నువ్వు ఎవరికి చెందినదానవు? ఓ చక్కని ముఖం కలదానా! రుద్రులు మరుత్తులు వసువులు - వీరిలో ఎవరికి చెందిన దానవు? ఓ నితంబినీ! నువ్వు నాకు దేవత వలె కనిపిస్తున్నావు.

"రోహిణి తారలలో శ్రేష్ఠురాలు. ఉత్తమములైన అన్ని గుణాలు కలిగినది. ఆమె చంద్రుని ఎడబాసి స్వర్గలోకం నుండి ఈ రూపంలో క్రిందకు పడిపోయిందా ఏమి?

"ఓ కల్యాణీ! ఏ దోషాలు లేని చక్కని కనులు కలదానా! నీవెవ్వతెవు? నల్లని కనుల దానా! నువ్వు కోపం చేతనో అజ్ఞానం చేతనో భర్త అయిన వసిష్ఠునిపై కోపగించిన మంగళమూర్తి వైన అరుంధతివి కావుగదా! ఓ చక్కని నడుము కలదానా! నీ తనయుడు కాని నీ తండ్రికాని నీ సోదరుడుకాని నీ భర్త కాని ఈ లోకం నుండి మరో లోకానికి పోయారని దుఃఖిస్తున్నావా?

"ఏడ్వడంచేత, నిట్టూర్చడం చేత, నేలను తాకడం చేత నీ యందు రాజ్య లక్షణాలు కనిపించడం చేత నువ్వు దేవతవని నేననుకోను. నీ యందలి సాముద్రిక లక్షణాలను బట్టి నువ్వు రాజకన్యవని, ఏ రాజుకో పట్ట మహిషివని నా అభిప్రాయం.

"ఒక వేళ రావణునిచేత జనస్థానం నుండి బలవంతంగా అపహరింపబడిన దానవే అయితే తప్పకుండా నువ్వు సీతాదేవివే అయి ఉంటావు. నీకు శుభమగు గాక! నేను నిన్ను అడుగుతున్నాను, చెప్పుతల్లీ! నీ ముఖంలో తోచే దైన్యం, మనుషులలో కనపడనట్టి నీ సౌందర్యం, నీ తాపసుల వేషం – వీటిని బట్టి తప్పకుండా నువ్వు రాముని పట్టమహిషి అయిన సీతాదేవివే అయి ఉంటావు."

ఆమె అతని మాటలు విని, అతడు రాముని కీర్తించుట చేత సంతోషించి చెట్టుపై నున్న హనుమంతునితో విదేహరాజపుత్రి సీతాదేవి ఇట్లు పలికింది:

"భూమి మీదనున్న రాజశ్రేష్ఠులలో ముఖ్యుడు, ఆత్మవిదుడు, శత్రు సైన్యాలను పీడించేవాడు అయిన దశరథమహారాజు కోడలినినేను. విదేహరాజు మహాత్ముడు అయిన జనకుని కూతురిని. నాపేరు సీత. ధీమంతుడైన రాముని భార్యను. అక్కడ రాముని ఇంటి యందు పండ్రెండు సంవత్సరాలు మానవులకు అందుబాటులో నున్న భోగాలను అనుభవిస్తూ అన్ని కోరికలు తీర్చే ఆచోట ఉన్నాను. పదమూడవ యేడు రాగానే ఇక్ష్వాకు వంశజుడైన రాముని రాజ్య పదవికి అభిషిక్తుడిని చేయాలని రాజైన దశరథుడు ఉపాధ్యాయుడైన వసిష్ఠునితో కలిసి ప్రయత్నాలు మొదలు పెట్టాడు.

"రామపట్టాభిషేకం గురించి అతడు ప్రయత్నాలను చేస్తూ ఉండగా కైకేయి అన్న అతని రాణి అతనితో ఇట్లంది. 'రాముడికి పట్టాభిషేకం చేస్తే ప్రతిదినం చేసే భోజనం చేయను. నీరు త్రాగను. రాముడే కాని పట్టాభిషిక్తుడైతే ఇదే నా

బ్రతుకుకి అంతమని తెలుసుకోవలసింది. ఏ వాక్యమయితే నువ్వు ప్రీతితో నాతో పలికావో ఆ వాక్యాన్ని పాలించాలని అనుకుంటే రాముడు అరణ్యాలకు పోవాలి."

"సత్యమేపలికే ఆ దశరథ మహారాజు తన రాణియైన కైకేయికి చేసిన వరదానాన్ని తలంపుకు తెచ్చుకొని క్రూరమూ అప్రియమూ అయిన కైకేయి వచనాన్ని విని మూర్ఛపోయాడు. పిమ్మట ఆ ముసలిరాజు, సత్యమందు ధర్మమందు వ్యవస్థితుడై కీర్తిశాలియైన జేష్ఠపుత్రుని నుండి ఏడుస్తూ రాజ్యాన్ని యాచించాడు. (నీకు రాజ్యమిచ్చాను. నా రాజ్యం నాకిచ్చి వేయవలసింది. ఇదియాచన).

"అభిషేకం కంటే తండ్రి మాటను హెచ్చుగా తలచిన రాముడు మనః పూర్వకంగా ఆ మాటను అంగీకరించాడు. రాముడు ఎవరేది అడిగినా యిస్తాడు. కాని ఎవరినీ యాచించడు. ఏ మాత్రమూ అప్రియమైనట్టి మాటను పలుకడు. ప్రాణాలు పోయినా రాముడు సత్యాన్నే ఆచరించే ధైర్యశాలి. మహాకీర్తి వంతుడైన రాముడు తనకు చాల ఉచితములైన ఉత్తరీయాలను విడిచి రాజ్యాన్ని మనః పూర్వకంగా త్యజించాడు. తన తల్లియైన కౌసల్యాదేవి దగ్గిర నన్నుండమన్నాడు. కాని నేను అతనికంటె ముందుగనే అడవియందుండడానికి బయలుదేరాను. రాముడు ఉండనట్టి స్వర్గం కూడా నాకు రుచించదు. మహాభాగుడైన సుమిత్రాదేవి కొడుకు లక్ష్మణుడు వనవాసంలో అన్నగారైన రాముడిని అనుసరించడానికి ముందుగనే నారచీరలు ధరించి బయలుదేరాడు.

"ఇట్లు మేము ప్రభువైన రాముని ఆజ్ఞను గౌరవించి దృఢచిత్తులమై మును పెన్నడూ చూసి ఎరుగని దట్టంగా కనిపించే అడవిని ప్రవేశించాము. మేము దండ కారణ్యమందుండగా మహాపరాక్రమశాలియైన రాముని భార్యనైన నన్ను దుష్ట చిత్తుడైన రాక్షసుడు, రావణుడు అపహరించాడు.

"అతడు నాకు బ్రతకడానికి రెండు నెలలు మాత్రమే వ్యవధిని ఇచ్చాడు. ఆ రెండు నెలలూ ముగిసిపోగానే నేను స్వయంగా ప్రాణాలను విడుస్తాను."

వానరబృందానికి అధిపతియైన హనుమంతుడు దుఃఖం నుండి ఇంకను దుఃఖంచేత పీడింపబడుతున్న సీతాదేవి మాటలు విని ఆమెను ఊరడిస్తూ ఇట్లు ప్రత్యుత్తరం పలికాడుః

"ఓదేవి! నేను రాముని సందేశాన్ని, దూతనై నీకు తెచ్చాను. ఓ విదేహ రాజపుత్రి! రాముడు క్షేమంగా ఉన్నాడు. తనకుశలం నీకు చెప్పమన్నాడు.

"ఎవరయితే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించగలడో, ఎవనికి వేదాలు తెలుసో, ఎవరు వేదాలు తెలిసినవాళ్లలో శ్రేష్ఠుడో, దశరథుని కొడుకైన ఆ రాముడు ఓ సీతాదేవి! నీ క్షేమాన్ని అడిగాడు.

"మహాతేజశ్శాలి, నీ భర్తను అనుసరించేవాడు, ప్రీతిపాత్రుడు అయిన లక్ష్మణుడు దుఃఖంచేత పీడింబడినవాడై నీకు శిరము వంచి నమస్కరిస్తున్నాడు."

రామలక్ష్మణుల క్షేమాన్ని విన్న సీతాదేవి ప్రీతితో పులకించిన శరీరం కలదై హనుమంతుడితో పలికింది:

"నరుడు జీవించి ఉన్నట్లయితే నూరు సంవత్సరాలకైనా ఆనందం కలుగుతుంది. లోకంలో వ్యాప్తి చెందినది, మంగళకరమైనది అయిన ఈ గాథ నాకు మిక్కిలి సంతోషాన్ని కలుగజేస్తున్నది."

హనుమంతుడు సీతాదేవిని కలుసుకున్నాడు. ఆమెకు అతనిపై ఆశ్చర్య కరమైన ప్రీతి కలిగింది. అపుడు వాళ్లిద్దరూ ఒకరిపై ఒకరు విశ్వాసం పొంది మాట్లాడుకోడానికి ప్రారంభించారు.

హనుమంతుడు ఆమె మాటలను విని శోకంచే దీనురాలైన సీతాదేవిని సమీపించాడు. ఎట్లు ఎట్లు అతడామెను సమీపించసాగాడో అట్లు అట్లు ఆమె అతనిని రావణుడని అనుమానించింది.

"అహో! ఎంత తప్పయింది? నేను ఇతనితో మాట్లాడడం ఎంత చెడ్డ దయింది? మారు రూపం ధరించిన రావణుడే ఇతడు!"

సీతాదేవి దుఃఖంచే పీడింపబడి అశోకవృక్షశాఖను విడిచి కటికనేలపై కూర్చుంది. భయంచేత నిజం తెలియని సీతాదేవిని చూసి హనుమంతుడు ఆమెకు ప్రణామం చేశాడు. ఆమె భయశంకితయై ఆ వానరుడిని మళ్లా చూడ లేకపోయింది. తనకు నమస్కరిస్తున్న అతనిని చూసి దీర్ఘంగా నిశ్వసించి, తీయని గొంతుతో ఈ విధంగా పలికింది:

"నువ్వు మోసకారివై మారు రూపం ధరించి స్వయంగా వచ్చిన రావణుడివే అయితే నాకు మళ్లీ సంతాపం కలిగిస్తున్నావు. ఇది ఎంత మాత్రం మంగళకరం కాదు. నిజస్వరూపం విడిచి సన్న్యాసి రూపం ధరించిన వాడవు నువ్వు. జనస్థాన మందు నిన్ను నేను చూశాను. ఆ రావణుడివి నువ్వే కాబోలు! కామరూపం ధరించిన ఓ రాక్షసుడా! ఉపవాసాలచేత చిక్కిన దానను; దీనురాలను. ఇప్పటికే దుఃఖంలోనున్న నన్ను తిరిగి బాధిస్తున్నావు. ఇది నీకు శ్రేయస్కరం కాదు. అట్లు కాకుండా, నేను అనుమానించింది వాస్తవం కాని పక్షంలో నిన్ను చూడడం చేత నా మనసులో ప్రీతి కలుగుతున్నది. నువ్వు రాముని దూతగా వచ్చినట్లయితే నీకు క్షేమం కలుగుగాక!

"ఓయి వానరోత్తముడా! నిన్ను నేనడుగుతున్నాను. రామకథ నాకు చాల ఇష్టమైనది. నాకు ప్రియుడైన రాముని గుణాలు వర్ణించు. నది యొక్క వేగం ఏ విధంగా ఒడ్డును తనతో తీసుకుపోతుందో, ఆ విధంగా ఓ సౌమ్యుడా! నా మనసుని హరిస్తున్నావు.

"అహో! స్వప్న మిచ్చే సౌఖ్యం ఎంత మహత్తరమైనది! నేను చాల కాలం ముందే ఇక్కడికి తీసుకొని రాబడ్డాను. రాముడిచే పంపబడిన ఈ కోతి అన్న వాడిని చూస్తున్నాను. కలలోనైనా, లక్ష్మణునితో కూడిన రాముని నేను చూడగలిగి ఉంటే ఈ కల నాకు నాశనం కలిగించదు. దీనిని నేను కలగా తలచను. కాని కలలో కోతిని మాత్రం చూస్తున్నాను. కలలో కోతిని చూస్తే శుభం కలుగదు. కాని నాకు ఇతని యందు మంగళభావం కలుగుతున్నది. ఇది నాకు కలిగిన చిత్తభ్రమా? లేక వాతప్రకోపమా? ఉన్మాదం వలన కలిగిన వికారమా? ఇది ఉన్మాదం కాని పక్షంలో ఉన్మాద లక్షణాలు కలచిత్త భ్రమ అయి ఉండవచ్చు. ఇతడు వానరుడని నేను గుర్తిస్తున్నాను."

ఈ విధంగా సీతాదేవి చాలవరకు తన ఆలోచనలోని బలాన్ని, దుర్బల త్వాన్ని బాగుగా యోచించి, రాక్షసులకు కామరూపం ధరించే గుణమున్నదని, ఆ వానరుడు రాక్షసులకు రాజైన రావణుడని, అపుడు భావించింది.

సీతాదేవి యొక్క ఆలోచనలను తెలుసుకున్న వాయుపుత్రుడు చెవులకు ఇంపైన మాటలతో ఆమె నపుడు ఆనందింపజేశాడు.

"రాముడు సూర్యునివలె తేజస్వి. చంద్రునివలె లోకాన్ని రంజింప జేసేవాడు. లోకమంతటికి దేవుడైన కుబేరుడు ఏ విధంగా రాజో ఆ విధంగానే రాజు. ఏ విధంగా విష్ణువు చాల కీర్తి కలవాడో ఆ విధంగా అతడు పరాక్రమ వంతుడై యశస్సును పొందినవాడు. దేవగురువైన బృహస్పతివలె సత్యాన్నే పలికేవాడు - తీయని మాటలాడేవాడు - రూపవంతుడు-రమణీయమైనవాడు-మన్మథుడివలె సుందరరూపం కలవాడు- అవసరమైనప్పుడు తన కోపాన్ని ప్రకటించనూ కలడు, ఆ కోపాన్ని ఉపసంహరించుకోనూ కలడు. లోకంలో పరమోత్తముడు-మహారథి.

"ఏ మహాత్ముడి భుజచ్ఛాయ క్రింద లోకముందో అట్టి రాముడిని బంగారు లేడి రూపంతో దూరానికి పంపించి ఎవరూ లేని సమయంలో నిన్ను రావణుడు అపహరించాడు. దానియొక్క ఫలితాన్ని తొందరలోనే చూడగలవు. తొందరలో రాముడు కోపంతో అగ్నిజ్వాలలవలె మండుతున్న బాణాలతో రావణుని వధిస్తాడు. అటు వంటి రాముడు పంపిన దూతను నేను. నీ దగ్గిరికి వచ్చాను. నీ ఎడబాటు చేత దుఃఖపీడితుడైన రాముడు నీ క్షేమాన్ని అడిగాడు.

"మహాతేజశ్శాలి సుమిత్రాదేవికి ఆనందం పెంపొందించేవాడు మహాబాహువు అయిన లక్ష్మణుడు నీకు ప్రణామం చేసి నీ క్షేమాన్ని అడిగాడు.

"ఓ సీతాదేవి! సుగ్రీవుడను పేరుకల వానరుడు రాముని స్నేహితుడు. అతడు వానర ముఖ్యులకు రాజు. అతడు కూడా నీ క్షేమ మడిగాడు.

"సుగ్రీవునితోను లక్ష్మణునితోను కలిసి ఉన్న రాముడు ప్రతిదినం నిన్ను తలస్తున్నాడు. నువ్వు రాక్షసుల మధ్య చిక్కి ఉన్నా, భాగ్యవశాన బ్రతికే ఉన్నావు. తొందరలోనే రాముడిని, మహాబలశాలియైన లక్ష్మణుడిని, మహా పరాక్రమవంతుడైన సుగ్రీవుడిని, వానరసమూహాల మధ్య చూడగలవు.

"నేను సుగ్రీవుని మంత్రియైన హనుమంతుడను పేరుకల వానరుడిని. మహాసముద్రం దాటి లంకానగరం ప్రవేశించాను. దురాత్ముడైన రావణుని తల మీద కాలుంచి నాశౌర్యమంతా కూడగట్టుకొని నిన్ను చూడడానికి వచ్చాను. ఓ తల్లీ! సీతాదేవి! నువ్వు అనుకుంటున్నట్లు నేను రావణుడిని కాను. నీ సందేహం విడిచి పెట్టు. నా మాటలయందు విశ్వాసముంచు."

వానరశ్రేష్ఠుడైన హనుమంతుడి నుండి సీతాదేవి రామకథను విన్నది. అపుడు ప్రీతి యుక్తంగా తీయని మాటలతో ఇట్లు పలికింది:

"నీకు రామునితో ఎక్కడ సంబంధం ఏర్పడింది? ఏ విధంగా వానరులకు నరులకు సమాగమం కలిగింది? ఓయి వానరుడా? ఏవి రాముని యొక్క చిహ్నాలో, ఏవి లక్ష్మణుని గురుతులో వాటిని మరల నాకు చెప్పవలసింది. నువ్వు ఆ ప్రకారం చేస్తే నాకు దుఃఖం కలుగకుండా ఉంటుంది.

"రాముని యొక్క అవయవసంస్థానం ఎటువంటిది?అతని రూపం ఏ విధంగా ఉంటుంది? తొడలెలా ఉంటాయి? బాహువు లెలా ఉంటాయి? లక్ష్మణునికి సంబంధించిన ఈ గురుతులు కూడా చెప్పవలసింది."

హనుమంతుడు రాముని స్వరూపాన్ని ఉన్న దున్నట్లుగా వర్ణించడం ప్రారంభించాడు.

"పద్మ పత్రాలవంటి కన్నులు కల సీతాదేవి! నువ్వీ వివరాలను ఎరుగుదువు. కాని, నన్ను చెప్పమని అడుగుతున్నావు. ఇది నా అదృష్టమే. ఏవి రాముని చిహ్నాలో ఏవి లక్ష్మణునివో నేను చూచిన విధంగా నీకు చెప్తాను, విను.

"రాముడు తామరరేకుల వంటి కనులు కలవాడు. జీవులందరి మనస్సులను ఆనందింపజేసేవాడు. సౌందర్యం, దయ సమృద్ధిగా కలవాడు. ఈ విధంగా, ఓ సీతాదేవి, ఆ రాముడు జన్మించాడు.

"రాముడు తేజస్సులో సూర్యునికి సమానమైనవాడు. ఓర్పులో భూమికి సాటియైనవాడు. తెలివితేటలకు బృహస్పతిసముడు. కీర్తియందు దేవేంద్రునితో సరిపోల్చదగినవాడు. జీవలోకాన్ని రక్షించేవాడు, తన వారిని కాపాడేవాడు. తన నడవడిని తన ధర్మాన్ని రక్షించేవాడు. శత్రువులను పీడించే వాడు.

"ఓ చక్కని దానా? రాముడు నాలుగు వర్ణాలతో కూడిన లోకమంతటిని కాపాడేవాడు. లోకంలో మర్యాదను పాటించేవాడు, ఇతరులచేత ఆ విధంగా ఆచరింప జేసేవాడు.

"అతడు మహాతేజశ్శాలి. మంచివారిచేత చాలహెచ్చుగా సూర్యునివలె పూజింప బడేవాడు. బ్రహ్మచర్యవ్రతాన్ని పాలించేవాడు; సజ్జనులకు ఉపకారం చేయడం తెలిసినవాడు; కర్మలయొక్క వ్యాప్తిని తెలిసినవాడు.

"రాజ విద్యావినీతుడు; బ్రాహ్మణులను సేవించేవాడు, విద్యావంతుడు ఉత్తమమైన శీలం కలవాడు, వినీతుడు, శత్రువులను బాధించేవాడు. యజుర్వేదం అధ్యయనం చేసినవాడు, వేదాలు తెలిసినవారిచేత బాగా పూజింపబడినవాడు; ధనుర్వేదమందు, వేదాలయందు, వేదాంగాలయందు పరిపూర్ణజ్ఞానం కలవాడు.

"విశాలమైన మూపు కలవాడు, పెద్దబాహువులు కలవాడు , శంఖం వంటి మెడ కలవాడు, మంగళకరమైన ముఖం కలవాడు, మెడక్రింది సంధి ఎముకలు పైకి కనబడనివాడు, చివరలందు ఎరుపెక్కిన కన్నులు కలవాడు – అటువంటి రాముడు జనులలో ప్రసిద్ధి పొందినట్టివాడు.

"రాముని కంఠధ్వని దుందుభి మ్రోతవలె ఉంటుంది. నిగనిగలాడే శరీరచ్ఛాయ గలవాడు, పరాక్రమవంతుడు, హెచ్చు తగ్గులు లేని సమమైన దేహ ప్రమాణం కలవాడు; శ్యామలవర్ణుడు."

అటు పిమ్మట హనుమంతుడు రాముని సాముద్రిక లక్షణాలు వివరించాడు.

హనుమంతుడు రాముని గురించి ఇంకా చెప్పాడు:

"రాముడు సత్యాన్ని ధర్మాన్ని నిష్ఠతో ఆచరించేవాడు, శ్రీమంతుడు, ధనం ఆర్జించడంలోను, యోగ్యులకు దానంచేయడంలోను, ఆసక్తి కలవాడు, దేశమూ కాలమూ తెలిసి ప్రవర్తించేవాడు, సర్వజనులతో ఆనందం కలిగినట్లు మాట్లాడేవాడు.

"అతని తమ్ముడు లక్ష్మణుడు ఇద్దరు తల్లుల ముద్దు బిడ్డడు. పరాజయ మన్నది ఎరుగడు – అనురాగంచేత రూపంచేత గుణాలచేత అన్నయైన రాముడిని పోలినవాడు.

"పురుషులలో పులులవంటిరామ లక్ష్మణులిద్దరూ నిన్ను చూడాలన్న ఉత్కంఠతో భూమినంతటినీ వెదకుతూ మమ్మల్ని కలుసుకున్నారు. అన్నచేత అధికారం నుండి తొలగింపబడిన వానరరాజైన సుగ్రీవుని దర్శించారు. అన్న వలన భయంతో ఋశ్యమూక పర్వతం వెనుకభాగంలో ఉన్న సుగ్రీవుని మేము అపుడు సేవిస్తున్నాము.

"రామ లక్ష్మణులు సుందరంగా నున్న ఋశ్యమూకాన్ని చేరగనే సుగ్రీవుడు భయంతో విభ్రమంచెందినవాడై ఋశ్యమూకపర్వతశిఖరం నుండి గెంతి కొండ

శిఖరమందే ఉండి తొందరగా నన్ను వారి దగ్గిరికి పంపించాడు. నేను వారి ఎదుట అంజలి ఘటించి నిలిచాను. వారిద్దరికీ సుగ్రీవుని పరిస్థితిని నేను వివరించగా వారు మిక్కిలి ప్రీతి జెందారు.

"ఆ పురుషశ్రేష్ఠులను నా వీపు మీద నెక్కించుకొని సుగ్రీవుడున్న చోటికి తీసుకొని పోయాను. అతనికి వారిరువురి గురించి విన్నవించాను. రామ సుగ్రీవులు ఒకరితో నొకరు మాట్లాడు కొని ఒకరియందు ఒకరు ప్రీతులైనారు.

"వానరులకు రాజైన సుగ్రీవుడు నరులకు రాజైన రాముడు ఒకరికొకరు తమ పూర్వ వృత్తాంతాలను చెప్పుకొని ఊరట చెందారు.

"సుగ్రీవుని అన్న వాలి మహా పరాక్రమశాలి. స్త్రీయే కారణంగా అతడు తమ్ముడైన సుగ్రీవుని త్రోసి పుచ్చాడు. సుగ్రీవుని రాముడు ఓదార్చాడు.

"రాముడు ఏ పనినైన సులువుగా చేస్తాడు. అతనికి నువ్వు కనపడక పోవడం చేత దుఃఖం కలిగింది. దానిని గురించి సుగ్రీవునికి లక్ష్మణుడు తెలియజేసినాడు. లక్ష్మణుడు చెప్పిన మాటలు విని సుగ్రీవుడు కూడా కాంతి లేకుండా పోయాడు.

"రావణుడు నిన్ను ఎత్తుకు పోతున్నప్పుడు నీవు భూమిమీద పడవైచిన ఆభరణాలను వానరముఖ్యులు రామునికోసం తెచ్చి సంతోషంగా చూపించారు. కాని నువ్వెక్కడున్నది వారికి తెలియదు.

"పెద్ద చప్పుడు చేస్తూ క్రిందపడిన ఆభరణాలను నేను ఉద్ధరించి రాముడికి యిచ్చాను. అతడు వాటిని చూసి మూర్ఛపోయాడు. చక్కని ఆభరణాలను ఒడి యందుంచుకొని రాముడు పలువిధాలుగా విలపించాడు. ఆ మహాత్ముడు దుఃఖ పీడితుడై చాలకాలం నేల మీద పండుకున్నాడు. నేనతనితో పలువిధాలుగా మాట్లాడి దుఃఖంనుండి మరల లేవనెత్తాను. రాముడు ఆభరణాలను తాను చూసి, లక్ష్మణునికి చూపించి, పిమ్మట వాటిని సుగ్రీవునికి ఇచ్చి వేశాడు.

"ఓ పూజ్యారాలా! నిన్ను కానక రాఘవుడు నిత్యం గొప్ప మంటచేత జ్వలించే అగ్ని పర్వతం వలె పరితపిస్తున్నాడు. నీవు కారణంగా అతడు నిద్ర లేక దుఃఖిస్తూ, విచారిస్తూన్నాడు. మహాత్ముడైన అతనిని ఆ మూడు పనులు, త్రేతాగ్నులు

అగ్నిగృహాన్ని తపింప జేసినట్లు తపింప జేస్తున్నాయి. నువ్వు కనుపించకపోవడం వలన కలిగిన శోకంతో రాఘవుడు భూమికంపానికి చలించిన పెద్ద కొండవలె వణకుతున్నాడు.

"ఓ రాజకుమారి! నువ్వు కనిపించకపోవడంచేత రాముడు అడవులలో తిరుగుతున్నా, చక్కని నదీతీరాలలోను జలపాతాల సమీపంలోను సంచరిస్తున్నా ఆనందం పొందడం లేదు.

"ఓ జనక రాజపుత్రీ! రావణుని మిత్రులతోను బంధువులతోను చంపి మనుజశ్రేష్ఠుడైన రాముడు తొందరగా నిన్ను చేరగలడు.

"రామ సుగ్రీవులు అపుడొక ఒప్పందం చేసుకున్నారు. వాలిని చంపడానికి, నిన్ను వెదకడానికి వాళ్ళు నిశ్చయించారు. వీరులైన రాజకుమారు లిద్దరూ కిష్కింధకు వచ్చి వాలిని యుద్ధమందు చంపినారు.

"రాముడు యుద్ధంలో వాలిని చంపి అన్ని ఎలుగుబంట్లకు కోతుల సమూహాలకు సుగ్రీవుని ప్రభువుగా చేసినాడు. ఓదేవి! ఈ విధంగా రామ సుగ్రీవులకు సమాగమమేర్పడింది. నన్ను వారి దూతయైన హనుమంతునిగా తెలుసు కోవలసింది.

"సుగ్రీవుడు తన రాజ్యాన్ని పొంది వానరముఖ్యులను రావించి మహాబలులైన వారిని నిన్ను వెదకడం కోసం పది దిక్కులకు పంపించాడు. కొండలతో సమానులైన వానరులు భూమిపై అంతట పంపబడ్డారు. సుగ్రీవుని ఆనతి చేత తొందరగా పంపబడినమేమూ, ఇతరవానరులూ, భూమినంతటిని నిన్ను వెదకుటకు తిరుగు తున్నాము. శ్రీమంతుడైన అంగదుడు, మహాబలవంతుడైన వాలి పుత్రుడు. సేనలో మూడవ వంతు తీసుకొని అతను బయలు దేరాడు. వాళ్ళు వింధ్యపర్వతంపై దారి తప్పి పోయారు. చాలహెచ్చుగా వాళ్లు విచారించారు. ఆ విధంగా అహో రాత్రాలు చాలగడచిపోయాయి. కార్యం నెరవేరకపోవడంచేత, కాలం అతిక్రమించడం చేత, వానర రాజువలని భయంచేత, మేము ప్రాణాలను విడువడానికి సిద్ధపడ్డాము. అడవులు దుర్గాలు కొండలు నదులు వెదకి దేవివైన నీవుండే చోటును చేరలేక ప్రాణాలను విడువసంకల్పించాము. వానరులందరూ ప్రాయోపవేశం చేయడం చూసి అంగదుడు హెచ్చుగా దుఃఖ సముద్రంలో మునిగి విచారించాడు.

"నువ్వు కనబడకపోవడం, వాలివధ, మా ప్రాయోపవేశం, జటాయువు మరణం - వీటి గురించి తలచి, ఓ వైదేహీ! అంగదుడు చాల విచారించాడు. నెల రోజులలో తిరిగి రాకపోతే శిక్షిస్తానని సుగ్రీవుడు ఆజ్ఞాపించాడు. కాని మేమా పనిచేయకలేక నిరాశతో చనిపోడానికి నిశ్చయించాము.

"అటువంటి సమయంలో మహాత్ముడు, పరాక్రమవంతుడు, జటాయువు సోదరుడు అయిన గృధ్రరాజు సంపాతి తన సోదరుని వధను విని కోపంతో ఈ మాటలన్నాడు.

" 'ఓ వానరోత్తములారా! ఏ కారణంచేత నా సోదరుడు చంపబడ్డాడు? ఎక్కడ పడి ఉన్నాడు? మీరు ఈ సంగతి నాకు చెప్పండి.'

"అపుడు అంగదుడు జనస్థానమందు జరిగిన దారుణమైన వధను, భీకరరూపం కల రాక్షసుడు నిన్ను ఉద్దేశించి చేసిన పనిని ఉన్నదున్నట్లుగా అతనికి తెలిపాడు. సూర్యుని పుత్రుడైన సంపాతి జటాయువు వధను విని దుఃఖించి నువ్వు రావణుని గృహమందు ఉన్నట్లు చెప్పినాడు.

"సంపాతి మాటలను విని, అంగదుడు మొదలైన వారు మేము వెంటనే బయలు దేరాము. నిన్ను చూడాలన్న ఉత్సాహంతో సంతుష్టులై తృప్తులై వానరులు వింధ్య పర్వతం మీదనుంచి లేచి సముద్రం యొక్క ఉత్తరతీరం చేరారు.

"సముద్రాన్ని చూసి విచారిస్తున్న వానరసైన్యం యొక్క తీవ్రమైన భయాన్ని తొలగించి నూరుయోజనాలు నేను ఎగిరాను.

"రాక్షసులతో నిండిన లంకను నేను రాత్రి వేళ చూశాను. రావణుని కూడా నేను చూశాను. శోకంతో నిండిన నిన్ను సైతం చూశాను.

"ఓ శ్లాఘనీయురాలా! జరిగినది జరిగినట్లే నీకు చెప్పాను. నేను దాశరథి దూతను. ఓ దేవి! నాతో మాట్లాడవలసింది. రాముని పనిమీద నీ కోసం వచ్చిన వాడిని, సుగ్రీవుడి మంత్రిని, పవనపుత్రుడనని తెలుసుకో!

"నీ రాముడు క్షేమంగా ఉన్నాడు. ధనుర్ధారులందరిలోనూ అతను శ్రేష్ఠుడు. తన అన్న సేవలో నియుక్తుడైన లక్ష్మణుడు క్షేమమే.

"ఓదేవి! పరాక్రమశాలియైన నీ భర్త హితము కోరిన నేను సుగ్రీవుని ఆజ్ఞను పాలించి ఇక్కడికి వచ్చాను. మరే సహాయం లేకుండా కామరూపంలో నిన్ను వెదకుతూ దక్షిణ దిశకు ప్రయాణం చేసి వచ్చాను. నువ్వు కనిపించలేదని దుఃఖిస్తున్న వానరసైన్యానికి అదృష్టవశాత్తు నువ్వు కనిపించిన సంగతి చెప్పి వారి సంతాపం తీరుస్తాను.

"అదృష్టవశాన్న నా సముద్రలంఘనం వ్యర్థం కాలేదు. నిన్ను చూడడం వలన లభించిన కీర్తిని భాగ్యవశాన పొందుతాను.

"రాక్షసుల ప్రభువైన రావణుని మిత్రులతోను; బంధువులతోను చంపి, తొందరగా, పరాక్రమశాలియైన రాముడు నిన్ను చేరగలడు.

"ఓ వైదేహి! పర్వతాలలో ఉత్తమమైన మాల్య వంతమను గిరి ఒకటుంది. అక్కడ నుండి గోకర్ణమను పర్వతానికి నా తండ్రియైన మహాకపి కేసరి వెళ్లాడు. అతడు దేవర్షులచేత నియోగింపబడిన వాడై సముద్ర తీరమందలి పుణ్య క్షేత్రమందు శంబసాదనుని సంహరించాడు. ఆ కేసరి భార్యయందు నేను వాయువు చేత పుట్టినవాడిని. ఓ మైథిలి! నేను చేసిన పని వలన లోకంలో హనుమంతుడనని ఖ్యాతిని పొందాను.

"ఓ సీతాదేవి! నీకు నమ్మకం కలగడం కోసం నీ భర్తయొక్క గుణాలను చెప్పాను. ఓపాపం లేనిదానా! రాముడు వేగంగా నిన్నిక్కడ నుండి తీసుకొని పోగలడు."

దుఃఖం చేత పీడింపబడిన సీతాదేవి ఈ విధంగా చెప్పిన కారణాలచేత నమ్మకం పొందినదై ఆయాగుర్తులచేత అతడు దూత అని తెలుసుకుంది. హనుమంతుని మాటలకు ఆమె అపరిమితమైన సంతోషం పొందింది. ఆనంద బాష్పాలను కార్చింది. ఆమె ముఖం చక్కగా రాహువు విడిచిన చంద్రుడివలె శోభించింది. హనుమంతుడు వానరుడే, మరొకడు కాడని ఆమె తలచింది. ఆమెతో హనుమంతుడు ఇట్లు పలికాడుః

"ఈ విధంగా నీకు, ఓ మైథిలి! సర్వం నివేదించాను. నువ్వు ఊరడిల్ల వలసింది. నేనేం చేయాలి? ఏ విధంగా ఆచరిస్తే నీకు ఆమోదయోగ్యంగా

ఉంటుంది? చెప్పవలసింది. అటు పిమ్మట నేను వెళ్లిపోతాను.

"మహర్షుల ఆనతి ప్రకారం మహాపరాక్రమశాలియైన కేసరి, యుద్ధమందు, శంబసాదనుని సంహరించాడు. ఓ మైథిలి! అతని భార్యకు వాయు ప్రభావం వలన నేను జన్మించాను. నేను వాయుదేవునితో సమానమైన వానరుడిని."

సీతాదేవికి హనుమంతుడి యందు విశ్వాసం కలిగింది. ఈ కారణం చేత అతను తిరిగి ఆమెతో వినయంగా పలికాడు:

"ఓ పవిత్రురాలా! నేను వానరుడను. ధీమంతుడైన రాముని దూతను. రామనామాంకితమైన ఈ ఉంగరాన్ని చూడవలసింది. నేను, విశ్వాసం కలగడం కోసం మహాత్ముడైన రాముడు యిచ్చిన దీనిని తెచ్చాను. నువ్వు ఊరడిల్ల వలసింది. నీకు క్షేమం కలుగుతుంది. ఇక నీదుఃఖం నశిస్తుంది."

తన భర్త చేతికి అలంకారమైన ఉంగరాన్ని చూసి, జానకీదేవి, తన పతిని చేరిన దానివలె సంతోషించింది. ఆమె ముఖం శోభిల్లింది. సిగ్గు చెందిన ఆ యువతి భర్త యొక్క సందేశం విని సంతోషించి, చాల తృప్తి చెంది, మహా వానరుడైన హనుమంతుని ప్రశంసించింది.

"నువ్వు పరాక్రమవంతుడివి, సమర్థుడివి, బుద్ధిమంతుడివి. రాక్షసులకు స్థానమైన లంకను నువ్వొక్కడవే ఎదుర్కొన్నావు. మకరాలయమైన సాగరాన్ని పరాక్రమవంతుడవైన నువ్వు ఆవు పాదమంతటి దానిగా పరిగణించావు. నిన్ను సామాన్యమైన వానరుడిగా నేను భావించను. ఎందుచేతనంటే నీకు రావణుడంటే భయం కాని, తొట్రుపాటు కాని లేదు.

"ఆత్మవిదుడైన రాముడు నిన్ను పంపితే నాతో సంభాషించడానికి తగుదువు. దుర్ధర్షుడైన రాముడు ఎవరినీ పరీక్ష చేయకుండా నా దగ్గిరికి పంపడు. విశేషించి నా దగ్గిరికి పంపేవారి పరాక్రమం తెలుసుకోనిదే ఆ పని చేయడు.

"అదృష్టవశాత్తు, ధర్మాత్ముడు పరాక్రమశాలి అయిన రాముడు క్షేమంగా ఉన్నాడు. ప్రళయకాలమహాగ్ని వలె విజృంభించి ఈ భూమిని ఏల దహించడు?

"రామ లక్ష్మణు లిద్దరూ దేవతలనైనా నిగ్రహించగలరు. కనీసం వారు రావణుని నిగ్రహించడం లేదు. దీనిని బట్టి నా దుఃఖానికి అంతం లేదని భావిస్తున్నాను.

"రాముడు నన్ను విడిచి బాధపడడం లేదు కదా! అతడు దుఃఖించడం లేదు కదా? పురుషోత్తముడైన రాముడు అటు పిమ్మట చేయవలసిన పనులను చేస్తున్నాడా?

"రాముడు దీనుడై చెదరిన మనసు కలవాడు కాలేదు కదా? పనులను తప్పుగా చేయడం లేదు కదా? రాజకుమారుడైన రాముడు చేయవలసిన పనులను నెరవేరుస్తున్నాడా?

"రాముడు మిత్రుల పట్ల సామం, దానం అన్న రెండు ఉపాయాలను, శత్రువుల పట్ల దాన భేదదండోపాయాలను మూడిటిని ప్రయోగిస్తున్నాడా? రాముడికి ఎవరైన మిత్రులు దొరకుతున్నారా? అతను వాళ్ల దగ్గిరికి పోతున్నాడా? వారు అతనిని ఆదరిస్తున్నారా? వాళ్లచేత అతను గౌరవింపబడుతున్నాడా? అతడు దేవతల అనుగ్రహం కోరుతున్నాడా? పురుష ప్రయత్నాన్ని, దైవమిచ్చే బలాన్ని పొందుతున్నాడా?

"ప్రవాసమనుభవిస్తున్న నా యందు రాముడికి అనురాగం పోలేదు కదా? ఓయి వానరుడా! అతడు నన్నీ కష్టాల నుండి విడిపిస్తాడా? రాముడు సుఖాలను అనుభవించడానికి యోగ్యుడు. దుఃఖాలను అనుభవించడానికి తగినవాడు కాదు. రాముడు దుస్సహమైన దుఃఖాన్ని పొంది నశించడు కదా? కౌసల్య, సుమిత్ర, ఆ విధంగానే భరతుడు క్షేమమని వినగోరుతున్నాను.

"నా కోసం మాననీయుడైన రాముడు శోకించడు కద! అతడు మరొక పని మీద మనసు నిలుపడు కద? రాముడు నన్నీ ఆపదనుండి తప్పిస్తాడా?

"సోదరునియందు ప్రేమ కల భరతుడు భీకరమైనట్టిది మంత్రులచే రహస్యంగా కాపాడబడునట్టిది, అక్షౌహిణిపరిమాణం కలది అయిన సేనను నా కోసం పంపుతాడా?

"శ్రీమంతుడు వానరులకు ప్రభువైన సుగ్రీవుడు దంతాలు గోళ్లు ఆయుధాలుగా నున్న వీరులైన వానరులచేత చుట్టబడి నాకోసం వస్తాడా?

"శూరుడు సుమిత్రానందవర్ధనుడు అయిన లక్ష్మణుడు అస్త్రప్రయోగ సమర్థుడు. అతడు బాణాల సమూహంతో రాక్షసులను సంహరిస్తాడా?

"కొద్ది కాలంలోనే రావణుడు స్నేహితులతో కూడా భయంకరమైన ఏదో

ఒక అస్త్రం చేత కాలిపోతూ యుద్ధమందు చంపబడడం నేను చూస్తానా?

"రాముని ముఖం బంగారంతో సమానమైన కాంతిగలది. పద్మంతో సరియైన పరిమళం కలది. ఆ ముఖం నేను లేకుండా ఉండడంచేత దుఃఖంచేత, దీనమై నీరు లేక ఎండలో తామరపూవు వాడినట్లు, ఎండిపోలేదు కదా?

"ధర్మం కారణంగా రాజ్యాన్ని విడిచి పెట్టి నన్ను కాలినడకను అడవిలో నడిపించినప్పుడు కూడా దుఃఖం కాని భయం కాని శోకం కాని పొందక ధైర్యం హృదయమందు నింపుకున్న రాముడు ఆ విధంగానే ఉన్నాడా?

"రామునికి అనురాగంలో నన్ను మించినవారు లేరు. తల్లికాని, తండ్రికాని నన్ను మించరు. నాతోసములైన వారు కూడా లేరు. ఓయి దూత! ప్రియుడైన రాముని వార్త విన్న వరకే నేను జీవించాలని కోరుతున్నాను."

గొప్ప అర్థమిచ్చే మాటలను సీతాదేవి ఈ విధంగా మధురంగా వానరేంద్రునితో పలికింది. తిరిగి అతను రాముని గురించి చెప్పే యింపైన మాటలను వినడానికి సంభాషణ ఆపింది.

భీమ విక్రముడైన హనుమంతుడు సీతాదేవి మాటలు విని శిరసుపై అంజలి ఘటించి బదులు పలికాడుః

"ఓ కమలలోచని! నువ్వు ఇక్కడ ఉన్నావని రాముడెరుగడు. అందుచేతనే దేవేంద్రుడు శచీదేవిని తీసుకొనిపోయినట్లు నిన్ను తీసుకొని పోలేదు. నేను వెళ్లి చెప్పగానే అతడు కోతులు ఎలుగుబంట్లతో నిండిన గొప్ప సేనను తీసుకు వస్తాడు.

"రాముడు తన బాణసమూహంతో, చలించని సముద్రాన్ని స్తంభింపజేసి లంకానగరంలో రాక్షసులు లేకుండా చేస్తాడు. ఆ పరిస్థితులలో మృత్యువే అడ్డు పడినా, అసురులతో కూడి దేవతలే రాముని మార్గానికి అడ్డు వచ్చినా వారిని కూడా సంహరిస్తాడు.

"ఓదేవి! నువ్వు కనిపించకపోవడంచేత దుఃఖంలో మునిగిన రాముడు సింహంచే పీడింపబడిన ఏనుగువలె సుఖం పొందడం లేదు.

"ఓదేవి! మలయపర్వతం మీద వింధ్య పర్వతం మీద మేరు పర్వతం

మీద మందరపర్వతం మీద దర్దురపర్వతం మీద మేము తినే కందమూలాల మీద ఫలాల మీద శపథంచేసి చెప్తున్నాను. ఉదయించిన నిండు చంద్రుడివలె ఉన్నది, చక్కని కనులు కలది, దొండపండువంటి మోవికలది, అందమైన కుండలాలు కలది, అయిన రాముని ముఖం తొందరలోనే నువ్వు చూస్తావు.

"నాకపృష్ఠమని స్వర్గంలో ఒక భాగముంది. దానిలో కూర్చున్న దేవేంద్రుడి వలె రాముడు ప్రస్రవణపర్వతంమీద కూర్చున్నాడు. అతనిని తొందరగా చూడగలవు.

"రాముడిప్పుడు మాంసం తినడంలేదు. మధువు సేవించడం లేదు. నాలుగు ప్రొద్దులు విడిచి అయిదవ ప్రొద్దు సాయంకాలం వానప్రస్థులకై నిర్దిష్టమైన అన్నాన్ని ప్రాణధారణ కోసం భుజిస్తున్నాడు. నీమీద నిలిచిన మనసు కలవాడై శరీరం మీద ప్రాలిన ఈగలను కాని దోమలను కాని యితర కీటకాలను కాని ప్రాకిన పాములను కాని రాముడు తొలగించడం లేదు.

"రాముడెప్పుడూ నీమీదే ధ్యానంతో ఉన్నాడు. నిత్యమూ దుఃఖంతోనే నిండిన మనసుతో ఉన్నాడు. నీమీద కోరిక నిలిచినవాడై మరేవీ ఆలోచించ లేదు. అతడెప్పుడూ నిద్రపోవడమే లేదు. ఒకవేళ నిద్రపోయినా, 'సీతా' అని మధురంగా పిలిచి మెల్కొంటున్నాడు, ఆనరోత్తముడు.

"పండును కాని, పూవును కాని లేక అందమైన ఏ వస్తువునైనా కాని చూచిన వెంటనే నిన్ను తలచుకొని 'ఓ ప్రియా' అని ఉచ్చరించి నీ గురించే మాట్లాడుతున్నాడు. ఓ సీతాదేవి! ఎల్లప్పుడు నీకోసం పరితపిస్తున్నవాడు, సీతా అని నిన్నే పిలుస్తున్నవాడు, వానప్రస్థవ్రతం అవలంబించిన వాడు, రాజపుత్రుడు మహాత్ముడు అయిన రాముడు నిన్ను పొందడం కోసమే ప్రయత్నం చేస్తున్నాడు."

హనుమంతుడు రాముని పొగడడంచేత ఆమె దుఃఖం తొలగిపోయింది. ఆమెకున్న శోకం రాముని శోకంతో సమానమయింది. అపుడు విదేహరాజపుత్రి యైన సీతాదేవి, శరత్కాల ప్రారంభంలో మేఘం చేత కొంత భాగం కప్పబడిన చంద్రునితో కూడిన రాత్రివలె, ఆశ నిరాశలలో, వెలుగు నీడలవలె కనిపించింది.

పున్నమినాటి చంద్రునితో సమానమైన ముఖం కల సీతాదేవి అతని మాటలు విని ధర్మసమ్మతములైన మాటలను హనుమంతునితో చెప్పింది:

"ఓయి వానరుడా! నీవు పలికిన పలుకులు విషంచే స్పృశింపబడిన అమృతం వలె నాకనిపిస్తున్నవి. 'నన్ను తప్ప రాముడు మరొకరిని తలచడం లేదు.' ఈ మాటలు అమృతంతో సమానమైనవి. 'అతడు శోకపరాయణుడై ఉన్నాడు' అన్న మాటలు విషతుల్యములైనవి.

"పురుషుడు అత్యధికమైన ఐశ్వర్యంలోనే ఉండనీ లేక చాల దారుణమైన దుఃఖంలోనే ఉండనీ, కాని, దైవమన్నవాడు ఆతనిని తాడుతో కట్టినట్లే ఈడ్చుకు పోతాడు.

"ఓయి వానరశ్రేష్ఠుడా! ప్రాణులకు విధి అన్నది నివారింపశక్యం కానిది. ఈ మాట నిశ్చయమైనది. లక్ష్మణుడిని, నన్ను, రాముడిని చూడు! మేమందరం ఎలా కష్టాలలో మునిగిపోయామో!

"ఈ దుఃఖానికి అవ్వలిగట్టును రాముడెప్పుడు దాటగలడు? సముద్రంలో నావ పగిలి నీటిలోపడి ఈదుతూ అలసిపోయినవాడివలె రాముడున్నాడు.

"నాభర్త అయిన రాముడు రాక్షసులను చంపి రావణుని హతమార్చి లంకను పెళ్లగించి ఎప్పుడు నన్ను చూస్తాడో? ఎంతవరకు ఈయేడాదికాలం నిండదో అంత వరకే నా జీవిత ముంటుంది. అతడు తొందరపడవలసిందని చెప్పు.

"దురాత్ముడైన రావణుడు ఏగడువునైతే నాకిచ్చాడో అందులో పదవనెల ఇప్పుడు గడుస్తున్నది. ఇంకా రెండు నెలలకాలం మిగిలింది. రావణుని సోదరుడైన విభీషణుడు నన్ను విడుదలచేయించడం కోసం ప్రయత్నించి అతనిని అనున యించాడు. కాని రావణుడు ఆ విషయమే ఆలోచించడు. నన్ను తిరిగి రామునికి సమర్పించడం రావణునికి రుచించదు. కాలానికి అధీనుడైన రావణుని యుద్ధమందు మృత్యువు వెదకుతున్నది. ఓయి వానరుడా! విభీషణుడికి అనల అన్న పేరు కల పెద్ద కూతురొకతె ఉంది. ఆమెతల్లి చేత పంపబడి నాతో ఈ సంగతి చెప్పింది.

"ఓయి వానరశ్రేష్ఠుడా! నా భర్త తొందరగా నన్ను చేరగలడు. దీనిలో సందేహం లేదు. నా అంతరాత్మ శుద్ధమైనది. ఆ రామునియందు ఎన్నో మంచి గుణాలున్నవి. పదునాలుగు వేల రాక్షసులను తమ్ముడైన లక్ష్మణుని సహాయం లేకుండా జనస్థానంలో ఏ రాముడయితే సంహరించాడో అతనికి శత్రువైనవాడు బాధింపబడకుండా ఉండగలడా?

"ఆపదలచేత ఆ పురుషశ్రేష్ఠుడు కదలింపబడడు. శచీదేవికి ఇంద్రుని ప్రభావం తెలుసు. నేను కూడా ఆ విధంగానే రాముని ప్రభావం తెలిసిన దానిని.

"రాముడనే సూర్యుడు బాణాలేకిరణాలుగా గల శూరుడు. ఓయి వానరుడా! అతడు శత్రువులైన రాక్షసులనే నీటిని ఇంకిపోయేటట్లు చేస్తాడు."

దుఃఖంతో పీడింపబడుతూ నీరు నిండిన కనులు కల సీతాదేవి రాముని కోసం పలుకుతూ ఉంటే వానరుడైన హనుమంతుడు ఆమెతో ఈ విధంగా పలికాడుః

"నేను చెప్పిన మాటలు వినగానే తొందరగా రాముడు వస్తాడు. కోతులు, ఎలుగుబంట్లు నిండిన పెద్ద సేనను తీసుకువస్తాడు. లేకపోతే, ఓ చక్కని ముఖం కలిగినదానా, నేడే నేను నిన్ను విముక్తురాలిగా చేస్తాను. నిన్ను నా వీపు మీద ఎక్కించుకొని సముద్రాన్ని దాటుతాను. రావణునితో కూడిన ఈ లంకను మోసుకు పోడానికి నాకు శక్తి ఉంది.

"హోమం చేసినప్పుడు అగ్ని దేవుడు హోమద్రవ్యాన్ని దేవేంద్రునికి అందజేస్తాడు. ఆ విధంగా ప్రస్రవణగిరి మీదనున్న రాముని దగ్గిరికి ఇప్పుడు నిన్ను చేరుస్తాను. విష్ణువు దైత్యులను వధించడానికి అన్ని విధాల సిద్ధంగా ఉన్నట్లు లక్ష్మణునితో కలసిన రాముడు సర్వసన్నద్ధుడై ఉన్నాడు. ఓ వైదేహీ! అతనిని ఇప్పుడే చూడగలవు.

" దేవేంద్రుడు స్వర్గంలో ఉన్నతమైన ప్రదేశంలో కూర్చొని ఉన్నట్లు మహా బలుడైన రాముడు ఆశ్రమంలో ఉన్నాడు. అతడు నిన్ను చూడాలని చాల ఉత్సాహంతో ఉన్నాడు.

"ఓదేవి! నువ్వు నా వీపు మీద ఎక్కవలసింది. ఓ మంగళరూపిణీ! ఉపేక్షించ వద్దు. రోహిణీదేవి చంద్రుని కలిసినట్లు రాముని కలియ వలసింది. చంద్రుడితోను గొప్ప ప్రకాశం కల సూర్యుడితోను మాట్లాడుతున్నట్లు నువ్వు నా వీపు మీద నెక్కి ఆకాశాన్ని మహా సముద్రాన్ని దాటవలసింది.

"ఓ అంగనా! నిన్ను తీసుకుపోతున్న నన్ను, లంకావాసులందరు కలిసినా వెంబడించలేరు. ఓ వైదేహీ! నువ్వు ఏ విధంగా లంకలోకి తేబడ్డావో ఆ విధంగా

నిన్ను ఎత్తుకొని ఆకాశం మీద నేను పోగలను. ఇందులో సందేహం లేదు."

హనుమంతుడు చెప్పిన అద్భుతమైన మాటలువిని మిథిలారాజపుత్రి అతనితో ఇట్లన్నది:

"ఓయి హనుమంతుడా! పోవలసినదారి చాల దూరమయినది. నన్నెట్లు ఎత్తుకు పోగలవు? నువ్వీ విధంగా తలంచడంచేత నీ యొక్క కోతి స్వభావం తెలుస్తున్నది. నా భర్త దగ్గిరికి ఎట్లు ఈ చిన్న శరీరంతో నువ్వు నన్ను తీసుకు పోగలవు?"

మంగళమూర్తియైన హనుమంతుడు సీతాదేవి మాటలు విని తాను క్రొత్తగా పరాభవింపబడినట్లు తలచాడు.

"ఈ నల్లని కనులు కల సీతాదేవి నా బలాన్ని కాని నా ప్రభావాన్ని కాని ఎరుగదు. అందుచేత ఈ విదేహరాజపుత్రి నాకామరూపాన్ని చూచుగాక!"

హనుమంతుడు వైదేహికి తన నిజస్వరూపాన్ని చూపించాడు. సీతాదేవికి విశ్వాసం కలిగించడానికి అతడు చెట్టు నుండి కిందికి దిగి తరువాత తన శరీరం పెంచడం ప్రారంభించాడు. అతడు అగ్నిదేవునితో సమానమైన కాంతి గలవాడై మేరుపర్వతానికి సరియైన ప్రమాణానికి పెరిగి సీతాదేవి ఎదుట నిలబడ్డాడు.

ఆ వానరుడు పర్వతం వలె ఎత్తైనవాడు; తామ్రముఖుడు; మహాబలుడు. వజ్రాలవంటి పళ్లు గోళ్ళు కలవాడు; మహాభీకరమైన శరీరం ధరించినవాడు. అతడు వైదేహితో ఇట్లున్నాడు:

"కొండలు అడవులు ఉన్నది, కోట బురుజులు ప్రాకారాలు పుర ద్వారాలతో కూడినది అయిన ఈ లంకను దాని ప్రభువైన రావణునితో కూడ మోసుకు పోయే శక్తి నాకున్నది. ఓ దేవి! ఇక నీ భయం చాలించు. మనస్సును స్థిరం చేసుకో! లక్ష్మణుడితో నున్న రాముడికి శోకం లేకుండా చేయవలసింది."

హనుమంతుడిని చూసిన జనక రాజపుత్రి ఇట్లు పలికింది:

"ఓయి మహావానరుడా! నీ శక్తి కాని, నీ బలంకాని, గాలివలె పోయే నీ వేగం కాని, అగ్నివలె నీకున్న అద్భుతమైన తేజస్సును కాని నేను ఎరుగను.

సామాన్యుడెవడూ దాటరాని సముద్రం అవ్వలి గట్టు చేరి ఈ భూమిని చేరడానికి అర్హుడు కాడు.

"నన్ను తీసుకొని పోగల నీ శక్తిని తెలుసుకున్నాను. కాని, మహాత్ముడైన రాముని కార్యం ఫలించడానికి అనుకూలమైనట్లు తప్పకుండా ఆలోచించాలి. ఓయి వానరుడా! నేను నీతో పోవడం సరియైన పనికాదు. వాయువేగంతో సమానమైన వేంగంగల నీగమనం నన్ను మూర్ఛలోముంచుతుంది. సముద్రంపై పైకి ఆకాశమార్గం నేను చేరితే వేగంగా పోతున్న నీ వీపు నుండి భయంతో కిందికి పడిపోతాను. తిమింగిలాలు, చేపలు, మొసళ్లు - వీటితో సంకులమైన సముద్రంలో నేను పడిపోతే తొందరగా తెలివి తప్పి ఆ సముద్రప్రాణులకు ఆహారాన్ని కాగలను. నేను నీతో పోడానికి సమర్థురాలిని కాను. నేను రక్షణ పొందవలసిన దానను. నీ సమీపంలో నేనున్నప్పుడు తప్పక నీకు కూడా ఆపద కలుగుతుంది.

"నన్ను నువ్వు తీసుకుపోతుంటే భీకరులు పరాక్రమవంతులైన రాక్షసులు రావణుడు పంపగా వెంటబడతారు. శూరులైన రాక్షసులు శూలాలు ముద్గరాలు ధరించినవారై నిన్ను చుట్టుముడితే, రక్షింపవలసిన నేను నీ దగ్గిర ఉండడంచేత, వారిని జయించగలనో లేదో అన్న సందేహం నీకు కలుగుతుంది. ఆయుధాలు ధరించిన రాక్షసులు నిరాయుధుడవైన నిన్ను ఆకాశం మీద వెంబడిస్తే వారిని ఎలా ఎదుర్కోగలవు? ఏ విధంగా నన్ను రక్షించగలవు?

"ఓయి వానరోత్తమా! క్రూరకర్ములైన రాక్షసులతో నువ్వు యుద్ధం చేస్తూ ఉంటే నేను భయంతో నీ వీపు నుండి పడిపోతాను.

"రాక్షసులు భీకరాకారులు, అధిక సంఖ్యలో నున్నవారు. బలవంతులు. ఏదో విధంగా నిన్ను యుద్ధంలో జయిస్తారు. లేకపోతే యుద్ధంచేస్తూ పరాఙ్ముఖుడివై నువ్వుంటే, ఓడిపోతే, పడిపోయిన నిన్ను పాపులైన ఆరాక్షసులు పట్టుకొని తీసుకుపోతారు.

"యుద్ధమందు జయాపజయాలు నిశ్చితాలు కావు. వాళ్లు నీచేతుల నుండి నన్ను దొంగిలిస్తారు. లేకపోతే చంపనేనా చంపుతారు. రాక్షసులచేత భయపెట్టబడిన దానినై నేను కూడా ఆపదలపాలవుతాను. ఓయి వానరశ్రేష్ఠుడా! అపుడు నీ ప్రయత్నం తప్పక విఫలమవుతుంది.

"అందరు రాక్షసులను చంపడానికి నువ్వొక్కడివే చాలుదువు. కాని ఆ విధంగా నువ్వు రాక్షసులను చంపుతే రామునికీర్తి క్షీణిస్తుంది. (నువ్వు అతను పంపిన దూతవు. అతను చేయవలసినపని నువ్వు చేస్తే అతని కీర్తి తరిగిపోదా?)

"లేకపోతే ఆ రాక్షసులు నన్ను చుట్టు ముట్టి మరొక చోట ఉంచుతారు. ఆ స్థలం నీకు కాని వానరులకు కానిరాఘవుడికి కాని తెలియకపోవచ్చు. ఆ విధంగా నువ్వు నాకోసం మొదలు పెట్టినపని నిరర్థకమవుతుంది. అట్లు కాకుండా నీతో కూడా రాముడు వచ్చినట్లయితేఎంతో గొప్ప ప్రయోజనం కలుగుతుంది.

"మహాత్ముడైన రాఘవుడి జీవితం అతని అన్నదమ్ముల జీవితాలు, నీ రాజు యొక్క వంశమంతా, ఓ మహానుభావుడా, నేను బ్రతికి ఉండడం మీదే ఆధారపడి ఉన్నాయి.

"రామలక్ష్మణులు నాకోసం నిరాశను పొందినవారై శోకమనే వేడిచేత పీడింపబడ్డవారై వానరులు ఎలుగులు అందరితో కలిసి ప్రాణాలను విడిచి పెడతారు.

"నా పతియందున్న భక్తిని పురస్కరించుకొని రాముని తప్ప మరొక పురుషుని శరీరాన్ని, ఓయి వానరపుంగవా, నేను తాకను. బలవంతంగా రావణుడు నన్ను తీసుకొని పోయినప్పుడు అతని శరీరాన్ని తాకితే నేనేం చేయగలను? పతివ్రతనైన నన్ను నానాథుడు లేకుండా తెలివి లేకుండా ఉన్నదానిని తెచ్చాడు కదా!

"బంధువులతో సహా దశకంఠుని ఇక్కడ సంహరించి రాముడు నన్ను తీసుకొని పోతే, ఆపని అతనికి యుక్తంగా ఉంటుంది. మహాత్ముడు, యుద్ధమందు శత్రువుల మదమడచేవాడు, అయిన రాముని పరాక్రమం గురించి నేను విన్నాను, చూశాను. దేవతలు గంధర్వులు నాగులు రాక్షసులు యుద్ధంలో రాముని సమానులు కాలేరు.

"గాలిచేత రేగిన అగ్నిని సహించడం సాధ్యంకాదు. ఆ విధంగానే మహాబల శాలి, ఆశ్చర్యం గొలిపే కోదండాన్ని ధరించినవాడు, ఇంద్రునితో సమానమైన పరాక్రమం కలవాడు, లక్ష్మణునితో కూడియున్నవాడు అయిన రాఘవుని ఎవరు సహించగలరు?

"ఓయి వానరముఖ్యుడా! యుద్ధంలో శత్రువులను మర్దించేవాడు, లక్ష్మణునితో కూడినవాడు, మదించిన దిగ్గజంవలె నిలిచినవాడు, ప్రళయకాల సూర్యునివలె బాణాలనే కిరణాలతో వెలుగొందుతున్నవాడు అయిన రాముని యుద్ధంలో ఎవడు సహించగలడు?

"ఓయి వానరోత్తమా! లక్ష్మణునితో నున్న నా పతిని వెంటనే వానరుల గుంపులతో ఇక్కడికి తీసుకొనిరా! ఓయి వానరముఖ్యుడా! చాల కాలమయి రాముని కోసం దుఃఖంతో పీడింపబడుతూ ఉన్నాను. నన్ను సంతోషించిన దానినిగా చేయవలసింది."

ఆ మాటలు విని సంతోషించిన కపిశ్రేష్ఠుడు, వాక్యవిశారదుడు సీతాదేవితో ఇట్లు పలికాడుః

"ఓదేవి! శుభదర్శనే! నువ్వు చాల సమంజసంగా పలికావు. ఇది స్త్రీ స్వభావానికి అనుగుణమైనది, పతివ్రత వినయసంపదకు తగినదై ఉన్నమాట. నూరు యోజనాలు వెడల్పుగల సముద్రాన్ని నాపై కూర్చొని దాటడమనేది స్త్రీలు చేయలేనిపని. ఓ జానకి! రాముని తప్ప ఇంకొకరిని తాకనని రెండవకారణమొకటి నువ్వు చెప్తున్నావు. మహాత్ముడైన రాముని భార్యవు నీవు. నీకు ఇది పలకడం యుక్తంగా ఉంది. నిజంగా, వేరొక వనిత ఇలా పలుకగలదా?

"నా ఎదుట నువ్వు దేనిని ఆచరించావో, దేనిని పలికావో దానింతటిని కొంచెమైన మిగులకుండా కాకుత్స్థ వంశజుడైన రామునికి నివేదిస్తాను.

"ఓ దేవి! రామునికి ప్రియం కలుగజేసే ఎన్నో కారణాలచేత, రాముని యందు స్నేహం నామనసు నిండి ఉండగా ఈ విధంగా నీతో పలికాను.

"లంకలో ప్రవేశించడం చాలకష్టమైనపని, మహా సముద్రాన్ని దాటడం చాల కష్టమైనది. వీటి నుండి నిన్ను తీసుకుపోయే సామర్థ్యం నాకుండడంచేత ఈ విధంగా చెప్పాను. నేడే నిన్ను రఘురాముని దగ్గిరికి తీసుకోవాలని కోరుతున్నాను. రామునియందున్న గొప్ప స్నేహం చేతను భక్తిచేతను ఈ విధంగా అన్నాను. మరో కారణం చేత కాదు.

"ఒకవేళ, ఓ ఉత్తమురాలా! నాతో కూడ నువ్వు పోవడానికి ఇష్టపడక పోతే

రాముడు తెలుసుకోగల గురుతొకటి ఇవ్వవలసింది. ఈ విధంగా హనుమంతుడు పలుకగా సీతాదేవి కన్నీటితో మాటలు తడబడుతుండగా మెల్లగా ఇట్లు పలికింది:

"నాకు ప్రియమైనట్టిది, ఉత్తమమైనది అయిన గురుతును నువ్వు రామునికి చెప్పవలసింది. పూర్వం చిత్రకూట పర్వతం యొక్క దిగువ భాగంలో ఈశాన్య దిశయందు తపస్సుచేసే ఆశ్రమవాసులున్నట్టిది, సమృద్ధిగా కందమూలాలు, ఫలాలు, నీళ్లూ ఉన్నట్టిది, సిద్ధులు నివసించేది, గంగానదికి సమీపంలో ఉన్నట్టిది అయిన ప్రదేశమందు నేను నివసించిన నాటి విషయమిది.

" 'ఓ రామా! ఆ ప్రదేశానికి చెందిన పూలతోటల్లో పలురకాలైన పూల వాసనలయందు విహరించి చెమటతో తడిసి నీఒడిలో పండుకున్నాను. అపుడు మాంసం మీద ఆశగల కాకి ఒకటి నన్ను పొడిచింది. ఆకాకిని నేను మట్టి బెడ్డ పట్టుకొని వారించాను. కాకి నన్ను పొడుస్తూ నా సమీపంలోనే దాగుంది. బలి భోజనం కోరే కాకి,మాంసం తినాలని కోరి,నామాంసాన్ని విడిచి పెట్టలేదు. ఆ పక్షి మీద కోపించి నా మొలత్రాడు తీస్తుంటే నా బట్టతొలగుతుండగా నువ్వు నన్ను చూశావు. చూసి పరిహాసపూర్వకంగా నవ్వావు. అపుడు నాకు కోపం కలిగింది. తరువాత సిగ్గువేసింది. మాంసం తినడానికి ఉద్యమిస్తున్న కాకి మళ్లా నన్ను గీరింది. దానిని తోలి నేను నీచెంతకు వచ్చాను. అలసి నీ ఒడిని చేరాను. సంతోషంగా ఉన్న నువ్వు కోపంగా ఉన్న నన్ను ఓదార్చావు. కనులు నిండిన నీరుగల ముఖంతో మెల్లగా కళ్లుతుడుచుకున్నాను. కాకి కారణంగా చాల హెచ్చుగా కోపించిన నన్ను, ఓనాథా! నువ్వు రక్షించావు.'

"శ్రమచేత అలసిన నేను చాలకాలం రాముని ఒడిలో నిదురించాను. భరతుని సోదరుడైన రాముడు నా ఒడిలో తానుకూడా పండుకున్నాడు.

"ఆ కాకి మళ్లా అక్కడికి వచ్చింది. నేను నిద్రనుండి మేల్కొని రాముని ఒడినుండి లేచాను. ఆకాకితొందరగా వచ్చి స్తనాలమధ్యను పొడిచింది. అధికంగా పొడిచింది. అపుడు కారిన నెత్తుటిబొట్లచేత రాముడు తడిసిపోయాడు. ఆకాకి ఆ విధంగా నన్ను బాధపెట్టింది. హాయిగా నిద్రపోతున్న రాముడిని మేల్కొలిపాను. స్తనాలమధ్య గాయం అయిన నన్ను చూసి పామువలె కోపించి, నిట్టూర్చి రాముడిట్లు పలికాడు 'ఏనుగు తొండము వంటి తొడలు కలదానా! స్తనాల మధ్య నున్న

చోటును ఎవడు గాయం చేశాడు? కోపగించిన ఐదుతలలపాముతో ఎవడాడుతున్నాడు?' నా ఎదుటనే ఉన్న ఆ కాకి ఇంద్రుని కొడుకా? రాముడు కాకి మీద కోపంతో ఆసనం నుండి దర్భనొకటి తీసి బ్రహ్మాస్త్రంగా అభిమంత్రించాడు. అది జ్వలిస్తున్న కాలాగ్నివలె ఆ పక్షి ఎదుట నిలిచింది. మండుతున్న దర్భను కాకిమీదికి రాముడు విసరివేశాడు. అపుడా కాకిని ఆకాశం మీద దర్భ వెంట బెట్టింది. కాకి పలురకాల దారులలో సంచరించింది. రక్షణ కోరుతూ అది లోకమంతా తిరిగింది. బ్రహ్మాదిదేవతలు, మహర్షులు దానిని విడిచి పెట్టారు. మూడు లోకాలు చుట్టముట్టి ఆ రామునే శరణుకోరింది. ఆ కాకి చంపదగినదైనా రాముడు దయతో దానిని కాపాడాడు. అతడు విడిచిన బ్రహ్మాస్త్రం వమ్ము చేయడానికి వీలుపడక, కాకి కుడికంటిని హింసించింది. కాకి తన కుడి కంటిని అర్పించి రాముడికి దశరథునికి నమస్కరించి, రాముడు విడిచి పెట్టగా తన ప్రాణాలను రక్షించుకొని తన నివాసం చేరుకొంది.

"ఓ 'మహీపతి! నన్ను అపహరించిన వాడిని ఎందుకు క్షమిస్తున్నావు? ఓయి పురుష శ్రేష్ఠుడా! నువ్వు మహోత్సాహం పొంది నామీద దయ చూపించవలసింది.

" 'నువ్వు నా భర్తవైనా నేను భర్తలేని దానివలె కనిపిస్తున్నాను. ఇతరుల దుఃఖాన్ని సహించకుండా ఉండడం పరమధర్మమని నీనుండే విన్నాను.

" 'నువ్వు మహాపరాక్రమవంతుడవని, మహోత్సాహం కలవాడివని, మహాబలుడవని నాకు తెలుసు. మహాసముద్రంవలె నువ్వు గంభీరుడవు. ధరణి కంతకూ ఇంద్రుడివలె నువ్వు అధిపతివి.'

"ఈ విధంగా అస్త్ర ప్రయోగకుశలుడు, సత్యవంతుడు, బలవంతుడు అయినప్పటికి రాముడు రాక్షసులమీద ఎందుకు అస్త్రప్రయోగం చేయడం లేదు? నాగులు కాని, గంధర్వులుకాని, అసురులు కాని మరుత్తుల గుంపులుకాని యుద్ధంలో రాముని వేగాన్ని అడ్డుకొనడానికి సమర్థులుకారు.

"వీర్యవంతుడైన ఆ రాముడికి నా మీద కొంచెమైనా తొందర ఉన్నట్లయితే వాడియైన బాణాలతో రాక్షసులను ఎందుకు నాశనం చేయడం లేదు? అన్నగారి ఆజ్ఞను అనుసరించి శత్రువులను పీడించేవాడు, మహావీరుడు, మహా

బలుడు అయిన లక్ష్మణుడు ఏ కారణం చేత నన్ను కాపాడడం లేదు. వాయువుతోను అగ్నితోను సమానమైన తేజస్సు కల పురుషశ్రేష్ఠులు కలిసి ఉన్నట్లయితే దేవతలకు కూడా వారు ఎదిరింపశక్యం కానివాళ్ళు, అటువంటి రామలక్ష్మణులు ఎందుకని నన్ను అశ్రద్ధ చేస్తున్నారు?

"నేను చేసిన పాపం కొంచమో గొప్పో ఉండితీరాలి. సందేహం లేదు. అందుచేతనే సమర్థులైనా రామలక్ష్మణులు నన్ను చూడడం లేదు."

కన్నీరు కారుస్తూ సీతాదేవి పలికిన పలుకులు విని హనుమంతుడు పలికాడుః

"ఓదేవి! నీయందలి దుఃఖం కారణంగా రాముడు అన్నిటియందు ఆసక్తి లేకుండా ఉన్నాడు. నేను సత్యం మీద శపథం చేస్తున్నాను. రాముడు దుఃఖంలో మునిగితే లక్ష్మణుడు అంతకన్న విచారిస్తున్నాడు. ఎంతో ప్రయత్నంచేత నిన్ను కనుగొనడమైనది. నువ్వు విచారించడానికి ఇది సమయం కాదు. ఉత్తమురాలా! ఈ క్షణమే దుఃఖాల అంతాన్ని నువ్వు చూడగలవు. పురుషశ్రేష్ఠులు, రాజపుత్రులు, మహాబలులు అయిన రామలక్ష్మణులు నిన్ను చూడవలె నన్న ఉత్సాహం కలవారై లంకను కాల్చివేస్తారు. క్రూరుడైన రావణుని బంధువులతో సహా యుద్ధమందు సంహరిస్తారు. ఓ విశాలాక్షి! రాముడు నిన్ను తనపురానికి తీసుకుపోతాడు. నేను రామునితో ఏమి చెప్పాలో మహాబలుడైన లక్ష్మణునితో ఏమి చెప్పాలో పలుక వలసింది. తేజస్వియైన సుగ్రీవుడికి అక్కడ సమాయుక్తులైన వానరులకు ఏమి చెప్పాలి?"

దేవకన్య వంటి సీతాదేవి దుఃఖపీడితయై వానరుడైన హనుమంతునితో ఇట్లు పలికిందిః

"విశాలహృదయం కల కౌసల్యాదేవి లోకాధిపతియైన ఎవరిని కన్నదో అతనిని నా కోసం కుశలమడుగ వలసింది. శిరసు వంచి ప్రణమిల్ల వలసింది.

"పుష్పమాలలను అన్ని రకాల రత్నాలను ప్రియురాలైన ఊర్మిళను ఉత్తమ స్త్రీలను విశాలమైన భూమి మీద లభించని ఐశ్వర్యాన్ని కూడా విడిచి, తండ్రిని తల్లిని గౌరవించి వారిని సుముఖులను చేసి సుమిత్రాదేవి కన్నట్టి సత్పుం తానమైన లక్ష్మణుడు సోదరుడైన రాముని అనుసరించాడు. ధర్మాత్ముడైన లక్ష్మణుడు

భక్తితో గొప్పదైన సుఖాన్ని విడిచిపెట్టి కాకుత్స్థుడైన అన్నను అరణ్యమందు కాపాడడం కోసం వెంట పోతున్నాడు. అతడు సింహస్కంధుడు, మహాబలుడు, మనస్వి, ప్రియదర్శనుడు. రాముడిని తండ్రివలె గౌరవిస్తాడు. నన్ను తల్లి వలె పూజిస్తాడు. నేను దొంగిలింపబడ్డానని అపుడు వీరుడైన లక్ష్మణుడు ఎరుగడు. అతడు పెద్దలను సేవించేవాడు, శ్రీమంతుడు, శక్తి కలవాడు, హెచ్చుగా మాట్లాడ వలసినవాడు కాడు, రాజపుత్రుడు, అందరికీ ప్రియమైనవాడు, ఉత్తముడు, నామాఘ్యమైన దశరథునికి సాటియైనవాడు, నాకు నిత్యమూ ప్రీతి కలిగించేవాడు - అతడు రాముని సోదరుడు లక్ష్మణుడు, అతడు తన కిచ్చిన పనిని బాగా నిర్వహించగలవాడు - ఎవరినయితే చూసుకొని తన తండ్రిని కూడా రాముడు తలంచడో అటువంటి లక్ష్మణుడిని నేను కుశలమడిగానని నా మాటలు చెప్పవలసింది. అతడు మృదువైనవాడు - నిత్యమూ శుచియైనవాడు, సమర్థుడు, రామునికి ప్రియమైనవాడు, లక్ష్మణుడు.

"ఓయి వానరశ్రేష్ఠుడా! ఏ విధంగా చేస్తే నా దుఃఖం క్షీణిస్తుందో ఆ విధంగా పని చేయడానికి నువ్వే సరియైనవాడివి. రాముడు నిన్ను కలిసిన తరువాత నా కోసం ప్రయత్నం చేయడం మొదలు పెడతాడు. శూరుడైన నానాథుడు రామునికి ఈ విషయం మళ్లీ మళ్లీ చెప్పవలసింది.

" 'ఓయి దశరథపుత్రుడా! ఒక మాసం మాత్రమే నేను ప్రాణాలను నిలుపు కొంటాను. నెలకుపైగా నేను జీవించను. నేను నీకీ సత్యాన్ని తెలుపుతున్నాను.

" 'పాతాళం నుండి రాజ్యలక్ష్మిని ఇంద్రుడు రక్షించాడు. అదే విధంగా పాపకర్ముడైన రావణుని చేత మోసగింపబడి నిర్బంధింపబడిన నన్ను రక్షించడానికి నువ్వు తగినవాడవు." '

అప్పుడు చీరకు కట్టిన దివ్యమైన శుభకరమైన చూడామణిని రాముడికి యిమ్మని సీతాదేవి హనుమంతుడికిచ్చింది. వీరుడైన హనుమంతుడు ఉత్తమమైన మణిరత్నాన్ని తీసుకుని దానిని తన వ్రేలికి ధరించాడు. అపుడాతని చేయి లావుగా లేదు.

చూడామణిని వానరోత్తముడు సీతాదేవి నుండి గ్రహించి, ఆమెను అభినందించి, ఆమెకు ప్రణామం చేసి ప్రక్కనే నిలబడ్డాడు. గొప్పగా సంతోషం పొందిన

వాడై హృదయంతో రాముని చేరుకున్నాడు. అతని శరీరం మాత్రం అక్కడుంది.

మణులలో ఉత్తమమైన చూడామణిని, తాను తీసుకొని పోవడానికి చాల అర్హమైన దానిని, జనకుని పుత్రికయైన సీతాదేవి నుండి హనుమంతుడు ప్రభావాతి శయంతో తీసుకున్నాడు.

బాగా గాలి వీచినపుడు వ్యాకులమైన కొండ ఆ గాలి తగ్గిపోగానే ఏ విధంగా శాంతి చెందుతుందో ఆ విధంగా హనుమంతుడు సుఖించిన మనసు కలవాడై తిరుగు ప్రయాణం కోసం సంకల్పించాడు.

సీతాదేవి చూడామణిని హనుమంతునికిచ్చి ఇట్లు పలికింది:

"ఈ గురుతు రాముడికి బాగా తెలిసినట్టిది. ఈ మణిని చూడగనే రాముడు ముగ్గురిని తలచుకుంటాడు. నా తల్లిని, నన్ను, దశరథమహారాజును అతను స్మరిస్తాడు.

"రాముడిని ఉత్సాహపరచి కార్యం జరిగేటట్లు చూడవలసిందని మరొకసారి చెప్తున్నాను. ఇకముందు చేయవలసినదేదో నువ్వు ఆలోచించవలసింది. ఓయి వానరోత్తమా! ఈ కార్యం నెరవేరడానికి నువ్వే తగినటువంటివాడివి. నువ్వు బాగా ప్రయత్నించి నా దుఃఖం తగ్గించేవాడవు కావలసింది. నువ్వు ఆలోచించి ప్రయత్నం చేస్తే నా దుఃఖం తగ్గిపోతుంది."

భీమవిక్రముడైన మారుతి సీతాదేవి పలుకులకు 'అట్లే' నని ప్రతిజ్ఞ చేసి శిరసుతో విదేహరాజపుత్రికి వందనం చేసి తిరుగు ప్రయాణానికి ఆయత్త పడ్డాడు.

మారుతపుత్రుడైన వానరుడు ప్రయాణానికి సిద్ధమవుతున్నాడని తెలుసు కున్న సీతాదేవి కళ్ల నీళ్లు కారుతుంటే గొంతు రుద్ధంకాగా ఇట్లు పలికింది:

"ఓయి హనుమంతుడా! రామలక్ష్మణుల యిద్దరి కుశలము అడుగు! మంత్రులతో కూడిన సుగ్రీవుని కుశలమడుగు! వృద్ధులైన వానరులందరి క్షేమం అడుగు. ధర్మబద్ధులైన వారందరిక్షేమం నేనడిగినట్లు చెప్పవలసింది.

"ఏ విధంగా చెప్తే మహాబాహువైన రాముడు నన్నీ దుఃఖసముద్రం నుండి తప్పిస్తాడో ఆ విధంగా చెప్పడానికి నువ్వు తగినవాడివి.

"కీర్తి శాలియైన రాముడు నేను ఏ విధంగా జీవించి ఉండాలని కోరుతాడో

ఆ విధంగా నేనున్నానని చెప్పు. ఈ విధంగా నువ్వు చెప్పినట్లయితే వాచాధర్మం (సరియైన మాటలను పలికిన విధిని) ఆచరించిన వాడివవుతావు.

"నువ్వు నిత్యం ఉత్సాహం కలిగేటట్లు మాట్లాడితే నీ వాడిన మాటలు విన్న దాశరథి యొక్క పౌరుషం, నన్ను పొందడం కోసం పెంపు చెందుంది.

"నా సందేశంతో కూడిన నీ మాటలు విన్న రాఘవుడు, వీరుడై తన పరాక్రమాన్ని తప్పకుండా ప్రదర్శించగలడు."

హనుమంతుడు సీతాదేవి మాటలు విని శిరసుతో అంజలి ఘటించి ఈ విధంగా బదులు పలికాడు.

"శ్రీరాముడు తొందరగా వస్తాడు. వానరులలోను, ఎలుగుబంట్లలోను ముఖ్యులైన వారితో పరివేష్టింపబడి వస్తాడు. అతడు యుద్ధంలో శత్రువులను జయించి నీ దుఃఖం పోగొడతాడు.

"మనుష్యులలోకాని, అసురులలోకాని, దేవతలలోకాని రాముడు బాణాలు విడుస్తూ ఉంటే ఎదుట నిలబడడానికి ఎవడూ ఉత్సాహం ప్రకటించడు. యుద్ధంలో అతని ఎదుట సూర్యుడు కాని, ఇంద్రుడుకాని, వైవస్వతుడైన యముడు కాని నిలువలేరు. విశేషించి, నీకోసం అతను యుద్ధంచేస్తుంటే ఎవరూ అతనిని ఎదిరించలేరు.

"రాముడు సాగరపర్యంతం ఉన్న భూమిని పాలించగోరుతున్నాడు. ఓ జనకనందినీ! నీ కోసం అతను లంకను జయిస్తాడు."

హనుమంతుని మాటలు సమంజసమైనవి; సత్యములైనవి; వీనులకు ఇంపైనవి. ఆ మాటలను జానకి చాల గౌరవించి ఇట్లు పలికింది:

"ఓయి అరిందముడా! ఇక్కడ నువ్వు ఉండగోరినట్లైతే మరుగుగా నున్న ఏదో ఒక చోట ఈ రోజు విశ్రాంతి తీసుకొని రేపు వెళ్లవచ్చు. అల్పభాగ్యనైన నా దగ్గిర నువ్వుంటే, ఈ దుఃఖం నుండి కొద్దికాలమైనా నాకు విముక్తి లభిస్తుంది.

"అలాగు కాకుండా నువ్విప్పుడే వెళ్లిపోతే, తిరిగి నువ్వు వచ్చేసరికి నా ప్రాణాలు నిలుస్తాయని చెప్పడానికి కూడా సందేహం కలుగుతుంది.

"నువ్వు కనిపించలేదన్న దుఃఖం మళ్లా నన్ను బాధిస్తుంది. ఇప్పటికే దుఃఖంలో ఉన్నాను. ఇంకా దుఃఖానికి నన్ను చేర్చి పరితాపం [illegible] చేసిన వాడవవుతావు.

"ఓయి వీరుడా! వానరశ్రేష్ఠుడా! నాకో సందేహం ఎదుట నిలుస్తున్నది. నీకు సహాయంగా వచ్చే కోతులు, ఎలుగుబంట్ల విషయంలో నాకీ సందేహం కలుగుతున్నది. దాటరాని మహాసముద్రాన్ని కోతులూ, ఎలుగుబంట్లూ గల సైన్యాలు కాని, రామలక్ష్మణులు కాని ఏ విధంగా దాటగలరు? ముగ్గురు మహా ప్రాణులకే ఈ సముద్రాన్ని దాటే శక్తి ఉంది. వినతాసుతుడైన గరుత్మంతుడికీ, నీకు, వాయువుకు మాత్రమే దీనిని దాటే సామర్థ్యముంది.

"ఓయి వీరుడా! కష్టతరమైన ఈ పనిచేయడానికి ఏ ఉపాయం ఆలోచించావు? నువ్వు పనులు చేయడం తెలిసిన వారిలో శ్రేష్ఠుడవు. ఈ పనిని సాధించడానికి నువ్వొక్కడివే చాలు. దానివలన నీకీర్తి పెరుగుతుంది.

"అట్లు కాకుండా రాముడు సమగ్రమైన సేనలతో యుద్ధంలో రావణుని జయించి విజయంతో నన్ను తన నగరానికి తీసుకొని పోయినట్లయితే అది నా యశస్సుకు కారణమవుతుంది. శత్రువులను మర్దించే రాముడు లంకానగరాన్ని బాణాలతో కలవరపరచి నన్ను తీసుకొని పోతే అది అతనికి యుక్తంగా ఉంటుంది.

"రాముడు యుద్ధమందు చాలశూరుడు. మహాత్ముడైన అతడు ఆ యుద్ధమందు విజృంభించడానికి ఏది అనుకూలంగా ఉంటుందో ఆ విధంగా అతనికి చెప్పవలసింది."

అర్థముతో కూడినది, హితమైనది, సహేతుకమైనది అయిన సీతాదేవి సంభాషణను హనుమంతుడు విని మిగిలిన కార్యం గురించి పలికాడు:

"ఓ సీతాదేవి! కోతులసేనలకు ఎలుగుబంట్ల సేనలకు అధిపతి, వానరులలో శ్రేష్ఠుడు, మహాబలశాలి అయిన సుగ్రీవుడు నీ విషయంలో ఒక అభిప్రాయానికి వచ్చాడు. అతడు వేలకోట్లు సంఖ్యగల వానరులచేత పరివేష్టింపబడిన వాడు; రాక్షసులను చంపగలడు; అతడు త్వరగా వస్తాడు. పరాక్రమం కలవారు, శక్తి వంతులు, మహాబలశాలురు అయిన వానరులు అతను మనసులో తలచుకున్న

దానిని చేయడానికి సిద్ధంగా ఉన్నారు. ఆ వానరవీరులు మీదకుగాని క్రిందకు గాని పక్కలకు గాని ఏ విధమైన ఆటంకం లేకుండా సంచరించగలరు. వాళ్లు గొప్ప తేజస్సు కలవారు. మహాకార్యాలు చేయడంలో వెనుకంజ వేయరు. వాళ్లు సముద్రం కొండలూ కల భూమిని గాలిలో ప్రయాణం చేస్తూ మహోత్సాహంతో ప్రదక్షిణలు చేశారు. నాకన్న గొప్పవాళ్లు, నాతో సమానులైనవారు అయిన వానరులు అక్కడ సుగ్రీవుని దగ్గిర ఉన్నారు. నా కన్న తక్కువవాడెవ్వడూ లేడు. నావంటి వాడినే ఈ చోటికి చేరుకున్నాను. మహాబలుల విషయంలో చెప్పేదేముంది. ఇటు వంటి పనులకు గొప్ప వారిని పంపరు కదా! ఇతరులైన జనులను పంపుతారు.

"ఓదేవి! ఇక పరితాపం చాలు! నీ శోకం తొలగిపోవుగాక! గుంపులోని వానరులు ఒకే గెంతుతో లంకకు వస్తారు. ఉదయించిన సూర్య చంద్రులవలె మహాశక్తి వంతులూ పురుష శ్రేష్ఠులూ అయిన రామలక్ష్మణులు నా వీపు మీద ఎక్కి నీ దగ్గిరికి వస్తారు. పిమ్మట లంకా పట్టణాన్ని బాణాలతో నాశనం చేస్తారు. రఘునందనుడు రావణుని బంధుగణంతో కూడా చంపి నిన్ను తీసుకొని తన పట్టణానికి తిరిగివస్తాడు.

"ఓ సీతాదేవి! నువ్వు ఇక ఊరడిల్లవలసింది. నీకు క్షేమమగుగాక! నువ్వు కలిసివచ్చే కాలం కోసం ఎదురు చూడవలసింది. అగ్నివలె ప్రజ్వలిస్తున్న రాముని తొందరగా నువ్వు చూడగలవు.

"ఈ యుద్ధమందు సపుత్రామాత్యబాంధవుడై రావణుడు చంపబడగా రోహిణీ దేవి చంద్రుని చేరినట్లు నువ్వు రాముని చేరగలవు. ఓ మైథిలి! తొందరగా నువ్వు ఈ దుఃఖం యొక్క అవ్వలిగట్టును చేరగలవు. వేగంగా శ్రీరాముని చేత చంపబడిన రావణుని చూస్తావు."

మారుతపుత్రుడైన హనుమంతుడు ఈ విధంగా వైదేహిని ఊరడించి వెళ్లిపోడానికి సంకల్పించి తిరిగి సీతాదేవితో ఇట్లు పలికాడుః

"శత్రువులను రూపుమాపేవాడు, ఒక నిశ్చయానికి వచ్చినవాడు అయిన రాముని తొందరగా చూస్తావు. లంకానగర ద్వారం చేరిన ధనుష్పాణియైన లక్ష్మణుని కూడా చూడగలవు. గోళ్లు కోరలు ఆయుధాలుగా నున్న వీరులను, సింహ శార్దూల విక్రములను,గజేంద్రులతో సమానులైనవారిని,వానరులను, రాగా చూస్తావు.

"ఓ ఆర్యా! కొండలవలె మేఘాలవలె ఉన్న వారిని లంకానగరమందలి మలయసానువులందు నాదం చేస్తున్న వానరముఖ్యులు కల సైన్యం నెన్నో చూస్తావు.

"మన్మథుని బాణాలచేత మర్మాలయందు తీవ్రంగా కొట్టబడిన రాముడు సింహం చేత పీడింపబడుతున్న ఏనుగువలె సుఖం పొందడం లేదు. ఓ దేవి! దుఃఖంతో ఇక ఏడువవద్దు! నీ మనసుకు అప్రియమైనట్టిది కాకుండుగాక! ఇంద్రునితో కలసిన శచీదేవివలె నువ్వు కూడా నీ భర్తను పొందగలవు.

"రాముని కన్న గొప్పవాడు ఎవడున్నాడు? లక్ష్మణునితో సమానమైన వాడెవడున్నాడు? అగ్ని, వాయువులతో సమానులైన అన్న దమ్ములిద్దరూ నీకు రక్షకులు.

"రాక్షసులకు నివాసమైన ఈ లంక చాల భయంకరమైనది. దీని యందు నువ్వు చాలకాలముండవు. తొందరలోనే నీ ప్రియుడు రావడం జరుగుతుంది. అతనిని నేను కలుసుకునే వరకు జరిగే ఆలస్యాన్ని క్షమించవలసింది."

మహాత్ముడైన హనుమంతుని మాటలు దేవకన్యతో సమానురాలైన సీతాదేవి విని తనకు సమ్మతమైన మాటలను పలికింది:

"ఓయి వానరుడా, భూమి మీద వర్షం పడితే సగం పెరిగిన పంట ఏ విధంగా సంతోషిస్తుందో ఆ విధంగా ప్రియంగా మాట్లాడే నిన్ను చూసి చాల సంతోషిస్తున్నాను.

"దుఃఖం చేత పీడింపబడిన అవయవాలతో కామార్తుడైన పురుష శ్రేష్ఠుడైన రాముని స్పృశించాలని కోరుతున్నాను. ఆ విధంగా జరుగుటకు నా యందు దయ చూపించవలసింది.

"కాకియొక్క ఒక కంటిని హరించడానికి తృణాన్ని విడిచిన సంగతి రామునికి గుర్తు చేయవలసింది.

" 'ఓ రామా! గండమనే పర్వతం పక్కను ఉన్నప్పుడు నానుదుట నున్న తిలకం చెరిగిపోయింది. అపుడు మణిశిలతో నువ్వు నా నుదుట తిలకం దిద్దినావు' ఈ సంగతి కూడా రామునికి గుర్తు చేయవలసింది.

"సీతాదేవి దొంగిలింపబడగా పరాక్రమవంతుడైన రాముడు ఏ విధంగా సహిస్తున్నాడు? రాక్షసుల మధ్యను సీత నివసిస్తూ ఉంటే, దేవేంద్రునితోను వరుణునితోను సమానుడైన రాముడు ఏ విధంగా సహిస్తున్నాడు?

"ఈ చూడామణి దివ్యమైనది. నాచే బాగుగా రక్షింపబడినది. దీనిని కష్టాలలో చూసుకుంటూ నిన్ను చూస్తున్నట్లు తలచుకొని సంతోషిస్తున్నాను. ఈ మణి జలాలలో పుట్టినది, మంగళకరమైనది. దీనిని నీకు తిరిగి పంపుతున్నాను.

"ఇకమీద దుఃఖంచేత పీడింపబడినదాన్నై బ్రతుకలేను. ఓ రామా! ఘోరమైన రాక్షసులు పెట్టే భరించరాని కష్టాలను, హృదయాన్ని చీల్చేమాటలను నీ కోసమనే సహిస్తున్నాను. నేను ఒక నెల వరకు జీవితాన్ని నిలుపుకుంటాను. ఈ నెల దాటిపోతే మరి బ్రతుకను.

"ఈ రాక్షసుల రాజు చాల భయంకరమైనవాడు. అతని ప్రవర్తన నాకు సుఖం కలిగించడంలేదు. నువ్వు కూడా ఆలస్యం చేస్తున్నావని వింటే నేను ఒక్క క్షణం కూడా బ్రతుకను."

కన్నీళ్లతో దయనీయంగా సీతాదేవి పలుకగా ఆ సంభాషణను మారుత పుత్రుడు విని, పలికాడు.

"ఓ సీతాదేవి! నీయందలి దుఃఖంతో రాముడు అన్నిటియందు విముఖుడై ఉన్నాడు. నేను సత్యంపై ఆనబెట్టి చెప్తున్నాను. రాముడు దుఃఖిస్తూ ఉంటే లక్ష్మణుడు కూడా పరితపిస్తున్నాడు. ఏదో విధంగా (చాల కష్టాలతరువాత) నువ్వు చూడబడ్డావు. ఇది విచారించడానికి తగిన కాలం కాదు. ఈక్షణమే దుఃఖాల అంతాన్ని నువ్వు చూస్తావు, ఓ భామిని!

"రామలక్ష్మణులు నిన్ను చూడవలెనన్న ఉత్సాహంతో లంకను తగుల బెడతారు. క్రూరుడైన రావణుని బంధువులతో కూడా యుద్ధంలో చంపి నిన్ను స్వనగరానికి తీసుకుపోతారు.

"ఓ ఉత్తమశీలం కలదానా! ఏ అభిజ్ఞానాన్ని రాముడు తెలుసుకోగలడో ఏది అతనికి ప్రీతిని కలిగిస్తుందో అటువంటి దానిని మరొకటి నువ్వు ఇవ్వదగుదువు."

ఆమె యిట్లు బదులు పలికింది:

"నేను నీకు ఉత్తమమైన అభిజ్ఞానమే యిచ్చాను. నాకేశభూషణం చూసి రాముడు శ్రద్ధతో నీ పలుకులు వింటాడు. వాటిని విశ్వసిస్తాడు."

శ్రీమంతుడైన హనుమంతుడు శిరసుతో సీతాదేవికి ప్రణామం చేసి ప్రయాణానికి ఉపక్రమించాడు. అపుడు సీతాదేవి గద్గదమైన కంఠస్వరంతో పలికింది:

"ఓయి హనుమంతుడా! సింహాలతో సాటియైన అన్నదమ్ములు రామలక్ష్మణులను, మంత్రులతో కూడిన సుగ్రీవుని, అందరినీ కుశలమడిగినట్లు చెప్పు.

"మహాబాహువైన రాముడు ఏ విధంగా నన్ను ఈ దుఃఖసముద్రం నుండి దాటించగలడో ఆ విధంగా చెప్పడానికి నువ్వు అర్హుడివి.

"నాయొక్క తీవ్రమైన శోకవేగం గురించి, ఈ రాక్షసుల బెదరింపుల గురించి, రాముని నువ్వు సమీపించి నప్పుడు చెప్పవలసింది.

"ఓ వానరోత్తమా! నీ మార్గం మంగళకరమగుగాక!"

ఆ వానరుడు, రాజపుత్రియైన సీతాదేవి విశదంగా సంగతులన్నీ చెప్పగా, వచ్చిన పని జరగడం చేత సంతోషించిన మనస్సు కలవాడై, తాను చేయ వలసిన పని కొంచెమే మిగిలిఉంటే దానిని బాగా ఆలోచించి, మనసుతో ఉత్తర దిక్కుగా ప్రయాణం చేసినాడు.

సీతాదేవి చేత ప్రశస్తములైన వాక్యాలతో గౌరవింపబడిన హనుమంతుడు ఆ చోటు నుండి వెడలి ఈ విధంగా తలచాడు:

"ఈ పని కొంచెమే మిగిలి ఉంది. నల్లని కనులు కల సీతాదేవిని చూశాను. ఇపుడు. సామదానభేదములనే మూడు ఉపాయాలను విడిచి నాలుగవదైన దండోపాయమే ఆచరింపదగినదిగా ఉంది. రాక్షసుల పట్ల సామోపాయం ప్రయోజ నకారికాదు. బాగుగా డబ్బు గలవారవడం చేత దానోపాయం కూడా వర్తించదు. ఈ పరిస్థితులలో పరాక్రమ మొక్కటే తగినదిగా ఉంది. యుద్ధమందు మహా వీరులైన రాక్షసులు హతమయితే ఏదో విధంగా మిగిలినవాళ్ళు మెత్తబడతారు.

"ఒకపని ఎలా చేయడమో నిర్దిష్టమయి ఉంది. ఆ పని చెడకుండా ఎవడయితే చాల పనులు చేయగలడో అతడు ఎటువంటి పనినైనా చెయ్యడానికి అర్హుడు. ఒకే ఒక కారణంతో చిన్న పని కూడా చేయడానికి వలను పడదు. మహా కార్యం విషయంలో ఇంకా చెప్పాలా? ఎవడయితే చాల కారణాలతో కార్య సాధనకు పూనుకుంటాడో అతడు ఆ పనిని సాధించడానికి సమర్థుడౌతాడు. ఇక్కడ నేనొక నిశ్చయానికి వచ్చి ఇతరుల సామర్థ్యం బాగా తెలుసుకొని సుగ్రీవుని సన్నిధికి పోతే ప్రభువు యొక్క ఆజ్ఞను పాలించిన వాడినవుతాను.

"అప్రయత్నంగా నాకు రాక్షసులతో యుద్ధమెట్లు కలుగుతుంది? అప్పుడే దశాననుడు యుద్ధమందు తన వారి బలాన్ని నా బలాన్ని బాగా తెలుసుకోగలడు.

"క్రూరుడైన రావణుని ఉద్యానవనమిది. చాల ఉత్తమమైనది. నందనవనంతో సాటియైనది. కళ్లకు, మనుగడకు ఇది హాయి నిస్తుంది. అన్ని రకాలైన చెట్లతోను, లతలతోను ఇది నిండి ఉంది. ఎండిన తోటను అగ్ని దహించినట్లు దీనిని నేను ధ్వంసం చేస్తాను. ఈ తోట పాడయితే దశాననుడు కోపిస్తాడు. అపుడు గుఱ్ఱాలు మహారథాలు ఏనుగులున్నట్టి సేనను అతడు పంపుతాడు. అందులోని వీరులు త్రిశూలాలు, కాలాయసాలు, పట్టిసాలు అన్న ఆయుధాలు ధరించి వస్తారు. అప్పుడు గొప్ప యుద్ధమిక్కడ జరుగుతుంది.

"నేనైతే చండ విక్రములైన రాక్షసులను ఎదిరించి, మహాపరాక్రమంతో రావణుడు పంపిన ఆ సేనను చంపి సుగ్రీవుని గృహమైన కిష్కింధకు పోతాను."

అపుడు భీమవిక్రముడైన హనుమంతుడు వాయుదేవుడి వలె కోపాన్ని చెంది గొప్పదైన తొడలవేగంతో చెట్లను విరవడం మొదలు పెట్టాడు. ఆ ప్రమదా వనాన్ని భగ్నం చేశాడు. పలురకాలైన పక్షుల అరపులతోను గట్లు తెగిన కొలను లతోను వాడిన ఎఱ్ఱని చివురుటాకులతోను వడలిపోయిన చెట్లూ లతలూ కలిగినదై ఆ ఉద్యానవనం అచ్చట దావానలం చేత తగుల బెట్టబడిన దానివలె అయింది. చుట్టూ ఉన్న ఆవరణలు ఛిన్నాభిన్నం కాగా ఆ లతలు వ్యాకులత చెందిన స్త్రీల వలె కనిపించాయి. లతాగృహాలు చిత్రగృహాలు నాశనం కాగా, మహా సర్పాలు దుష్ట జంతువులు చంపబడుటచేత, శిలాగృహాలు ఇతర గృహాలు పెకలింప బడగా ఆ వనం తన స్వరూపాన్నే కోల్పోయింది.

అశోక వృక్షాలు, లతలు, చిన్న మొలకలు కల ఆ ఉద్యానవనం రావణుని అంతఃపుర జనానికి ఆనందదాయకమైనది. అది వానరుని చేత విరువబడి దుఃఖించిన లతలు, మొలకలు కలదై స్వాధీనం తప్పినదై కనిపిస్తున్నది.

అర్థపతి, మహాత్ముడు అయిన రావణునికి గొప్ప అప్రియం కలుగ జేసినాడు, మహాకపి. చాలమంది మహాబలులతో తానొక్కడే యుద్ధం చేయదలచి శోభతో మెరుస్తూ ఆ వానరుడు అశోకవనం యొక్క బహిర్ద్వారం చేరుకున్నాడు.

అపుడు పక్షుల కూతలతోను, చెట్లు విరిగిన చప్పుడుతోను లంకలోనున్న వాళ్లందరూ భయంతో కలవరపడ్డారు. జంతువులు, పక్షులు తమతమ నెలవులు తప్పి భయంతో పీడింపబడి పారిపోతూ అరిచాయి. రాక్షసులకు క్రూరములైన దుఃశకునాలు కలిగాయి.

వికృతమైన ముఖాలుగల రాక్షస స్త్రీలు నిద్రవిడిచిపెట్టి ఆ అశోకవనం భగ్నం అయినట్లు చూశారు. వీరుడైన మహావానరుడిని చూశారు.

హనుమంతుడు అది చూసి రాక్షసస్త్రీలకు భయం కలిగించే పెద్ద ఆకారాన్ని ధరించాడు. కొండవలె నున్న వానరుని చూసి రాక్షస స్త్రీలు సీతాదేవిని ప్రశ్నించారు.

"ఇతడెవరు? ఎవరివాడు? ఎక్కడనుండి వచ్చాడు? ఎందుకని ఇక్కడికి వచ్చాడు? నీతో అతడికి సంభాషణ ఎట్లు జరిగింది? ఏ విశాలాక్షి? నీకు భయం లేదు. మాకు చెప్పు! ఓ నల్లని కనుగొనలు కలదానా! నీతో ఇతడు ఏమి మాట్లాడాడు?"

మహాసాధ్వి, సర్వాంగసుందరి అయిన సీతాదేవి అప్పుడు ఇట్లు పలికింది:

"భయంకరమైన రూపాలుకల రాక్షసుల గురించి తెలుసుకోడానికి నాకు అవసరమేమిటి? అతడెవడో ఏమిటి చేస్తున్నాడో మీరే తెలుసుకోవలసింది. పాము కాళ్లు పాముకే తెలుస్తవి. ఇందుకు సందేహం లేదు. నేను కూడా ఇతనికి భయపడ్డాను. ఇతడెవరో నాకు తెలియదు. ఇతడు కామరూపియై వచ్చిన రాక్షసుడని మాత్రం ఎరుగుదును."

విదేహ రాజపుత్రి మాటలను విని రాక్షస స్త్రీలు దిక్కులకు పరుగులెత్తారు. కొందరు అక్కడే ఉన్నారు. కొందరు రావణునికి ఈ సంగతి చెప్పడానికి పోయారు.

అతనిని సమీపించి విపరీతమైన ఆకారం కల వానరుడి గురించి చెప్పడం మొదలు పెట్టారు.

"ఓ రాజా! అశోకవనం మధ్యను మహాశరీరుడైన వానరుడొకడు సీతాదేవితో మాట్లాడి, చాల పరాక్రమవంతుడై, అక్కడున్నాడు. హరిణలోచన సీతాదేవి, ఎన్ని సార్లు మేమడిగినా, ఆవానరుడి గురించి చెప్పడానికి ఇష్టపడకున్నది.

" ఆ వానరుడు దేవేంద్రుని దూత అయి ఉండవచ్చు. లేకపోతే కుబేరుని దూత కావచ్చు. లేక సీతను వెదికే కోరికతో రాముడు పంపిన వాడేనా కావచ్చు.

"ఏదైతే నీకు మనోహరంగా ఉండేదో, అన్ని రకాల జంతువులతో సంకుల మైనదో, ఆ ప్రమదావనాన్ని ఆ అద్భుత రూపం కల వానరుడు నాశనం చేశాడు.

"అక్కడ అతడు నాశనం చేయని ప్రదేశమే లేదు కాని ఎక్కడయితే సీతాదేవి ఉందో ఆ చోటు మాత్రం అతడు నాశనం చేయలేదు.

"జానకిని కాపాడడం కోసం ఆ చోటు పాడుచేయలేదా? లేక శ్రమ వల్ల మానివేశాడా? అటువంటివాడికి శ్రమ ఎక్కడిది? ఆవిడను కాపాడడంకోసమే ఆ విధంగా చేశాడు.

"ఎక్కడ స్వయంగా సీతాదేవి కూర్చుందో, చక్కని చిగురులతోను పూవులతోను నిండిన ఆ శింశుపావృక్షం మాత్రం అతనిచే రక్షింపబడింది.

"ఉగ్రరూపం కల నువ్వు ఆ భీకరాకారుడికి శిక్షను విధించడానికి తగినవాడివి. ఎవడయితే సీతాదేవితో మాట్లాడాడో అతడే ఈ వనం కూడా నాశనం చేశాడు.

"ఓ రాక్షసుల ప్రభువా! నువ్వు మనసులో స్వీకరించిన సీతాదేవితో ఎవడు మాట్లాడాడో వాడు ప్రాణాలు విడిచినట్లే లెక్క."

రాక్షసస్త్రీల మాటలు విని రావణుడు హోమంచేసిన అగ్ని వలె కోపంతో తిరుగుతున్న కనులు కలవాడై దహించుకుపోయాడు. కోపంతో నున్న అతని కళ్లనుండి నీటి బొట్లు కారినవి. బాగా వెలుగుతున్న దీపాలనుండి మండుతూ పడుతున్న నూనె బిందువుల వలె అవి కనిపించాయి.

తనతో సమానమైన బలం కల కింకరులనే శూరులైన రాక్షసులను హను

మంతుని పట్టుకోడానికి రావణుడు పంపించాడు. వేగవంతులైన ఎనిమిది వేల మంది కింకరులనే రాక్షసులు కూటములు, ముద్గరములు, అను ఆయుధాలను ధరించి రావణుని భవనం నుండి వెలువడ్డారు. బహిర్ద్వారం దగ్గిర ఉన్న హనుమంతుడిని వాళ్లు చూసి అగ్ని మీద పడ్డ మిడతలవలె మహావేగంతో అతని మీద పడ్డారు.

వాళ్లు విచిత్రములైన గదలతోను, బంగారు కట్లు కల గుదియలతోను, సూర్యుని కాంతితో సమమైన బాణాలతోను, ఆ వానరోత్తముని కొట్టారు. ముద్గరాలు, పట్టిసాలు, శూలాలు, ఈటెలు, తోమరాలు, శక్తి అన్న ఆయుధాలను ధరించి వేగంగా హనుమంతుని చుట్టు ముట్టి అతని ఎదుట నిలబడ్డారు.

తేజోవంతుడు, మంగళకరుడు, పర్వతసన్నిభుడూ అయిన హనుమంతుడు నేలపై తోకతో కొట్టి మహానాదాన్ని పుట్టించాడు. లంకానగరాన్ని శబ్దంతో నింపుతూ స్వేచ్ఛగా తోకను విదలించాడు. ఆ ధ్వనికి పక్షులు ఆకాశంలో ఎత్తుకు ఎగిరి పోయాయి. అపుడు హనుమంతుడు డిట్లు ఘోషించాడుః

"జయత్యతిబలో రామో లక్ష్మణశ్చమహాబలః
రాజా జయతు సుగ్రీవో రాఘవేణాభిపాలితః
దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః
హనూమాన్ శత్రుసైన్యానాం విహంతా మారుతాత్మజః
న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః
అర్దయిత్వా పురీం లంకాం అభివాద్య చమైథిలీం
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వ రక్షసామ్.

ఇది జయ మంత్రం.

" చాల బలం కల రాముడికి జయం! మహాబలుడైన లక్ష్మణునికి జయం! రామునిచే కాపాడబడుతున్న రాజైన సుగ్రీవునికి జయం!

"సులువుగా పనులు నెరవేర్చేవాడు, కోసలదేశానికిప్రభువు అయిన రాముని దాసుడిని నేను. శత్రుసైన్యాలను సంహరించే మారుతపుత్రుడైన హనుమంతుడిని నేను.

"వేయి మంది రావణులు కూడా, యుద్ధమందు, నేను రాళ్లతోను, చెట్లతోను కొడుతూ ఉంటే నా ఎదుట నిలువలేరు.

"ఈ లంకాపురాన్ని పీడించి, మిథిలారాజపుత్రిని అభినందించి, నా పని ఫలవంతంగా చేసుకొని, అందరు రాక్షసులు చూస్తూ ఉంటే వెళ్లిపోతాను."

హనుమంతుడు చేసిన మహాధ్వనికి ఆ రాక్షసులు అతనిని భయంతో శంకించారు. సంధ్యామేఘం వలె ఉన్న అతనిని చూశారు. ప్రభువు ఆజ్ఞ చేత ఏ విధమైన జంకులేనివారై ఆ రాక్షసులు చిత్రములైనవి, భీకరములయినవి అయిన ఆయుధాలతో అతని మీదికి లంఘించారు. హనుమంతుడు శూరులైన రాక్షసులచేత అన్ని వేపుల చుట్టుకోబడి, బహిర్ద్వారం దగ్గిరనున్న భయంకరమైన ఇనుపగుది యను చేత పట్టుకున్నాడు. రాక్షసులను దానితో మోదాడు.

హనుమంతుడు వీరులైన కింకరులనే ఆరాక్షసులను చంపి ఆగుదియను పట్టుకొని ఆకాశం మీద సంచరించాడు. హనుమంతుడు మరల యుద్ధాన్ని కోరినవాడై బహిర్ద్వారం ఆశ్రయించాడు. అపుడు కొంతమంది రాక్షసులు హనుమంతుని వలన భయం తొలగి, కింకరులను రాక్షసులందరూ సంహరింపబడ్డారని రావణునికి తెలియ జేశారు.

రాక్షసుల గొప్ప సేన సంహరింపబడినదని రావణుడు విని, కన్నులు తిప్పుతూ, యుద్ధమందు జయించడానికి వీలు కానివాడు, పరాక్రమమందు సాటిలేనివాడు అయిన ప్రహస్త పుత్రుడిని హనుమంతుడి మీదికి పంపించాడు.

కింకరులను చంపిన తరువాత హనుమంతుడు ఇట్లు ఆలోచించాడు:

"ఉద్యానవనాన్ని విరిచి వేశాను. దేవాలయరూపంలో నున్న ఈ భవనాన్ని పాడు చేయలేదు. కాబట్టి దీనిని కూడా నేను ధ్వంసం చేస్తాను."

ఇట్లు తలచిన హనుమంతుడు బలాన్ని ప్రదర్శించాడు. మేరుపర్వత శిఖరం వలె ఎత్తుగా నున్న భవనం మీదికి వానర యూథపుడు ఎక్కి మహాతేజశ్శాలి అయిన అతడు ఉదయించిన రెండవ సూర్యుడివలె కనిపించాడు. మచ్చతో బాగా ప్రకాశిస్తున్న పారియాత్రమను కులపర్వతం వలె కనిపించాడు.

హనుమంతుడు తన మహిమ వల్ల చాల గొప్ప శరీరం కలవాడై శరీరాన్ని

చరుచుకుంటూ లంకానగరాన్ని ధ్వనితో నింపివేశాడు. గొప్ప చరుపుల ధ్వని చెవులను పగులగొడుతున్నది. అక్కడున్న పక్షులన్నీ ఆ చప్పుడుకి ఎగిరిపోయాయి. చైత్యపాలురు మూర్ఛపోయారు. తిరిగి హనుమంతుడు జయమంత్రం పఠించాడు.

"అస్త్రాలు ప్రయోగించడంలో నేర్పరి అయిన రాముడు జయించుగాక! మహాబలుడైన లక్ష్మణుడు జయం పొందుగాక! రామునిచే కాపాడబడుతున్న సుగ్రీవుడు జయిస్తాడు.

"సులభంగా పనులు నెరవేర్చే కోసలరాజు, రాముని దూతను నేను, శత్రు సైన్యాలను పరిమార్చే వాయుపుత్రుడైన హనుమంతుడిని.

"వేల కొలది రాళ్లను చెట్లను విసిరే నన్ను, యుద్ధమందు, వేయి మంది రావణులు కూడా ఎదుర్కోలేరు.

"లంకానగరాన్ని పీడించి, మైథిలిని అభినందించి, రాక్షసులందరూ చూస్తూ ఉండగా విజయవంతంగా వెళ్లిపోతాను."

హనుమంతుడు విమానమందున్న వాడై చైత్య ప్రాసాదంలో ఉన్న వారితో పలికి రాక్షసులకు భయాన్ని కలిగిస్తూ భీకరంగా గర్జించాడు.

ఆ మహాశబ్దంతో నూరు మంది చైత్య పాలకులు పలురకాలైన ఆయుధాలను, ప్రాసలను, ఖడ్గాలను, గండ్రగొడ్డళ్లను విసురుతూ హనుమంతుడిని చుట్టు ముట్టారు. గదలతోను సూర్యునికాంతివలె మెరుస్తున్న బాణాలతోను వానరశ్రేష్ఠుని కొట్టారు. గంగానదీజలాలలో ఏర్పడిన విపులమైన గొప్ప సుడివలె రాక్షసగణం అతనిని చుట్టు ముట్టింది. వాయుపుత్రుడు కోపించి భయంకరమైన ఆకారం దాల్చాడు.

బంగారు పనితో అలంకరించబడిన నూరు అంచులు కల ప్రాసాదం యొక్క మహాస్తంభాన్ని వేగంగా పెకలించి మహాబలుడైన హనుమంతుడు దానిని చుట్టూ తిప్పాడు. అపుడు దాని నుండి అగ్ని పుట్టింది. భవనం కూడా తగులబడింది.

తగుల బడుతున్న భవనాన్ని చూసి వానరయూథపుడు, ఇంద్రుడు వజ్రాయుధంతో అసురులను చంపినట్లు, నూరుమంది రాక్షసులను చంపివేశాడు.

అంతరిక్షమందుండి మంగళమూర్తియైన హనుమంతుడు ఇట్లు పలికాడుః

"మా వంటి మహాత్ములను వేయిమందిని పంపించారు. మేము సుగ్రీవుని ఆజ్ఞను పాలించేవారం. ఇతరవానరులు, మేము భూమి నంతటినీ తిరుతున్నాం. వాళ్లలో కొంతమంది పది ఏనుగుల బలంకలవారు. మరికొందరు దానికి పదిరెట్లు బలం కలవారు. ఇంకా కొంతమంది ఓఘమనుసంఖ్యగల ఏనుగుల బలం కలవారు. కొందరు వాయుదేవునితో సమానమైన బలం కలవారు. కొంత మంది చెప్పనలవి కాని బలం కలవారు. ఇటువంటి వానరులందరూ ఆ గుంపులో ఉన్నారు. దంతాలు, గోళ్లు వీరికి ఆయుధాలు. ఇటువంటి వానరులు నూర్లు, నూరువేలు, కోటి, ఆయత సంఖ్యలలో ఉన్నారు.

"శత్రువులను చంపే సుగ్రీవుడు వీరందరితో కలిసి వస్తాడు. అపుడీలంకా పురమూ ఉండదు, మీరూ ఉండరు, రావణుడు కూడా ఉండడు. ఎందుచేత నంటే ఇక్ష్వాకు ప్రభువుతో రావణునికి బద్ధవైరం కనుక."

ప్రహస్తుని కొడుకు జంబుమాలి. అతనికి పెద్దకోరలున్నాయి. మహాబల వంతుడు అతడు. రాక్షసరాజు అతనిని హనుమంతుని మీదికి పంపితే అతడు ధనువు పట్టుకొని బయలు దేరాడు. అతను ఎఱ్ఱటి పూలదండలు, ఎఱ్ఱని బట్టలు ధరించాడు. మెడలో హారం చెవులకు అందమైన కుండలాలు అతని కున్నవి.పెద్ద కళ్లు అతను తిప్పుతున్నాడు. అతడు చాల కోపం కలవాడు, యుద్ధంలో గెలువ శక్యం కానివాడు.

జంబుమాలి దాల్చిన ధనువు ఇంద్రుని ధనుస్సుతో సాటియైనది. గొప్ప అందమైన బాణాలు కలది. దాని అల్లె త్రాటిని లాగి విడుస్తే అది పిడుగులకు సరియైన శబ్దం చేస్తుంది. ఆ మహాధనస్సు చేసిన టంకారధ్వనితో, దిక్కులు మూలలు ఆకాశం, తొందరగా నిండిపోయాయి.

గాడిదలు పూన్చిన రథంతో వచ్చిన జంబుమాలిని చూసి వేగ సంపన్నుడైన హనుమంతుడు చాల సంతోషించి పెద్దశబ్దం చేశాడు.

బహిర్ద్వారం మూంజూరు మీద పావురాలగూళ్లున్నవి. అక్కడ కూర్చున్న మహావానరుడైన హనుమంతుడిని మహాబాహువైన జంబు మాలి బాణాలతో కొట్టాడు.

బాణాలతో కొట్టబడిన హనుమంతుని ముఖం శరత్కాలంలో సూర్యుని

కిరణాలకు విప్పబడి వికసించిన తామరపూవులా కనిపించింది. హనుమంతుని ఎఱ్ఱని ముఖం బాణాల దెబ్బలచేకారిన రక్తంతో ఇంకా ఎఱ్ఱబడి శోభించింది. ఆ ముఖం ఆకాశం మీద మహా పద్మమొకటి చందన బిందువులతో తడిసినట్లుంది.

రాక్షసుని బాణాలచేత కొట్టబడిన మహావానరుడు కోపగించాడు. తన పక్కనే ఉన్న పెద్దరాతిని పెరికి జంబుమాలిమీద విసిరాడు. రాక్షసుడు కోపించి ఆరాతిని పది బాణాలతో కొట్టాడు.

తన పని వ్యర్థమవడం చూచి చండవిక్రముడైన హనుమంతుడు పెద్ద సాల వృక్షాన్ని పెరికి చాలబలంగా తిప్పడం మొదలు పెట్టాడు. జంబుమాలి చాల బాణాలను దాని మీద విసిరాడు. నాలుగు బాణాలతో ఆ చెట్టును నరికివేశాడు. హనుమంతుడి భుజం మీద అయిదు బాణాలు, వక్షం మీద ఒకటి, గుండెల మధ్య మరో పది ప్రయోగించాడు.

బాణాలతో నిండిన శరీరం కల హనుమంతుడు, అక్కడున్న ఇనుపగుదియను గ్రహించి వేగంగా తిప్పడం ప్రారంభించాడు. ఆ గుదియను చాలవేగంతో తిప్పి, జంబుమాలి మహావక్షం మీద దానిని పడవేశాడు.

అపుడు జంబుమాలి శిరస్సూలేదు - అతని చేతులూ లేవు - మోకాళ్లూ లేవు - విల్లూ లేదు- రథమూ లేదు - గుఱ్ఱాలూలేవు - బాణాలు కూడా కనిపించలేదు. (గుఱ్ఱాలనిమూలంలో ఉంది. గాడిదలు దానికున్నవని ముందు చదివాము)

మహాబలుడైన జంబుమాలి హనుమంతునిచేత చంపబడ్డాడు. అతని శరీరాభరణాలు పిండయిపోయాయి. సంహరింపబడిన జంబుమాలి భూమి మీద పడి పోయాడు.

జంబుమాలి హతుడవడం, మహాబలులైన కింకరులు చంపబడడం విన్న రావణుడు క్రోధం చెందాడు.

అపుడా రాత్రించరుల రాజు అతిబలవంతులు పరాక్రమశాలురు అయిన మంత్రి పుత్రులను హనుమంతుని మీదకు పంపించాడు.

ఏడుగురు మంత్రి పుత్రులు, అగ్నివలె తేజోవంతులైనవారు, రావణ భవనాన్ని విడిచి పెట్టి బయలుదేరారు. వారు మహాసేనలతో కూడినవారు, ధనస్సులు

ధరించినవారు, మహాబలవంతులు, అస్త్రాలను దాల్చినవారు, అస్త్రవిద్యలో శ్రేష్ఠులు, ఒకరితో ఒకరు పోటీపడి గెలుపుకోరేవారు.

మేఘంగంభీరధ్వని కల మహారథాలతో ఆ ఏడుగురు మంత్రి పుత్రులు ధనుష్టంకారం చేస్తూ చాల సంతోషంగా ఉన్నారు. కాని, వారి తల్లులు మాత్రం, కింకరులు చంపబడ్డారన్న వార్త విని, మిత్రుల తోను బంధువులతోను దుఃఖించి వికలమైన మనసు కలవారయారు.

ఆ మంత్రిపుత్రులు నేనంటే నేనని ఘర్షణపడుతూ మేలిమి బంగారు నగలు ధరించిన వారై బహిర్ద్వారం దగ్గిర నున్న హనుమంతుని ఎదుర్కొన్నారు.

ఆ రాక్షసులు బాణ వృష్టిని సృష్టించారు. ఆ బాణాలవర్షంలో హనుమంతుడు చాల వేగంగా తిరుగుతూ వాటిని నిష్ప్రయోజనాలుగా చేశాడు. ఆకాశ వీథులలో తిరుగుతూ రథాల వేగం పనికి రాకుండా చేశాడు.

హనుమంతుడు ఆకాశంలో ఆ ధనుర్ధారులతో క్రీడించాడు. పెద్ద అరుపు అరచి హనుమంతుడు వారిపై విరుచుకుపడ్డాడు. కొంతమందిని చేతులతో చంపాడు - మరికొంత మందిని కాళ్లతో చంపాడు - కొందరిని పిడికిలితో పొడిచి చంపాడు - కొంతమందిని గోళ్లతో చీరాడు. వాళ్లు చనిపోయి భూమి మీద పడ్డారు - వారి సైన్యం పారిపోయింది. నెత్తుటి కాలువలతో మార్గాలు కనిపించాయి. లంకా నగరం పలురకాలైన వికృత శబ్దాలతో ధ్వనించింది. వీరుడైన హనుమంతుడు ఆ రాక్షసులను చంపి మరల తోరణమున్న చోటుకు చేరుకున్నాడు.

మహాత్ముడైన వానరునిచేత మంత్రి పుత్రులు చంపబడ్డారని తెలుసుకుని, ఖేదము బైటపడని ఆకారం కలవాడై రావణుడు ఉత్తమమైన ఆలోచన చేశాడు. విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు అన్న పేర్లు కల అగ్రసేనా నాయకులను రావణుడు ఆదేశించాడు. వారు, వీరులూ నీతి కోవిదులూ - హనుమంతుడిని పట్టుకోడానికి తొందరపడుతున్నారు. వారితో రావణుడీ విధంగా అన్నాడు.

"సేనాపతులందరూ మహాసేనలు తీసుకొని గుఱ్ఱాలు, రథాలు, ఏనుగులతో పోయి ఆవానరుడిని శిక్షింతురుగాక! ఆ కోతిని సమీపించి ఆలోచించి పట్టుకో

వలసింది. అతడు చేసే పనులు చూస్తుంటే వానరుడు కాడని తోస్తున్నది. మహాబలంతో కూడిన మహాభూతంవలె అతడు కనిపిస్తాడు. ఇంద్రుడు మన కోస మని ఇతడిని తపోబలంతో సృష్టించినట్లున్నాడు. మీతో కలసి నేను నాగులు యక్షులు గంధర్వులు దేవతలు అసురులు మహర్షులు – వీరందరినీ జయించాను. వాళ్లందరూ మనకీ అప్రియం కొంచెంగానైనా కల్పించి ఉంటారు. అందుకు సందేహం లేదు. బాగా ఓర్చి ఆ వానరుడిని పట్టుకోవలసింది.

"ధైర్యవంతుడు, పరాక్రమవంతుడు అయిన వానరుడిని మీరు అవమానించ కూడదు. ఇంతకు పూర్వం పరాక్రమవంతులైన వానరులను, వాలి, సుగ్రీవుడు, జాంబవంతుడు, సేనాపతి నీలుడు, ద్వివిదుడు మున్నగువారిని చూశాను. వారి గమనం ఈ విధంగా భయంకరమైనది కాదు. ఈ తేజస్సు, ఈ పరాక్రమం వారిలో లేవు. వారికి ఇటువంటి ఆలోచన కాని ఇటువంటి బలం కాని ఇటువంటి ఉత్సాహం కాని లేవు. ఇటువంటి రూపధారణా సామర్థ్యం వారికి లేదు, ఇతడు వానర రూపం ధరించిన మహాప్రాణి.

"చాల గొప్ప ప్రయత్నం చేసి ఇతనిని పట్టుకోవలసింది. మీ ఎదుట, దేవాసురమానవులూ ఇంద్రుడూ కల మూడు లోకాలు యుద్ధంలో నిలువ లేవు. అయినా యుద్ధమందు జయం కోరే నీతివంతుడు ప్రయత్నం చేసి అయినా తన్ను తాను రక్షించుకోవలెను. యుద్ధంలో గెలుపు అనేది చంచలమైనది."

మహాపరాక్రమవంతులైన వారందరూ ప్రభువు మాటలు స్వీకరించారు. మహావేగవంతులు, అగ్నితో సమమైన తేజస్సు కలవారు అయిన అయిదుగురు సేనాపతులు బయలు వెడలారు. రథాలతోను, మదించిన ఏనుగులతోను, చాల వేగంగల గుఱ్ఱాల తోను, శస్త్రాలు ధరించిన సేనలతోను వారు బయలు వెడలారు. అపుడు వారు ప్రకాశిస్తున్న మహా వానరుని చూశారు. అతనిని అన్ని వేపుల ఆవరించి, భయంకరములైన ఆయుధాలతో అక్కడి కక్కడే ఎదుర్కొన్నారు.

దుర్ధరుడు బాణాలను హనుమంతుని తలపై విసిరాడు. ఆ అయిదు బాణాలు హనుమంతుని శిరస్సు నందు తగిలాయి. అప్పుడు మారుతి తన అరుపుతో పది దిక్కులు ప్రతిధ్వనించగా ఆకాశం మీదికి ఎగిరాడు. దుర్ధరుడు రథం మీద నుండి నూరు బాణాలను చిమ్మి హనుమంతుని ఎదిరించాడు. వర్షాకాలం తరువాత

శరత్కాలంలో వర్షిస్తున్న మేఘాన్ని వాయువు అడ్డగించినట్లు అతనిని వానరుడు అడ్డుకున్నాడు.

దుర్ధరునిచేత పీడింపబడిన హనుమంతుడు తిరిగి శరీరం పెంచాడు. అతడు చాల దూరం ఎగిరి మహావేగంతో కొండమీద పిడుగులరాశి పడ్డట్లు దుర్ధరుని రథం మీద పడ్డాడు. అపుడు దుర్ధరుని రథానికి పూన్చిన ఎనిమిది గుఱ్ఱాలు తొక్కి వేయబడ్డవి. రథం యొక్క గవాక్షాలు, నొగ విరిగిపోయాయి. దుర్ధరుడు ప్రాణాలు పోయి రథాన్ని విడిచి క్రిందపడి పోయాడు.

అతడు భూమి మీద పడడం చూసి విరూపాక్షయూపాక్షులు కోపం గలిగిన వారై హనుమంతుని మీదికి దుమికారు. ఆకాశం మీదకు తొందరగా ఎగిరిన అతనిని వారు ముద్గరాలచేత వక్షం మీద కొట్టారు. హనుమంతుడు వారి వేగాన్ని అడ్డగించి తిరిగి భూమి మీదకు దుమికాడు. ఆ వానరుడు సాలవృక్షం దగ్గిరికి పోయి దానిని పెకలించి వారి నిద్దరిని దానితో చంపాడు.

వేగవంతుడైన వానరునిచేత ఆ ముగ్గురూ హతులైనారని తెలుసుకొని మహా వేగవంతుడైన ప్రఘసుడు అతనిని ఎదుర్కొన్నాడు. వాడియైన అంచు కల అడ్డ కత్తితో అతడు యుద్ధం చేశాడు. భాసకర్ణుడు కూడా కపిశ్రేష్ఠుని శూలంతో ఎదిరించాడు. వాళ్ల కొట్టిన దెబ్బలకు హనుమంతుడు నెత్తుటితో తడిసి క్రుద్ధుడయాడు. జంతువులతోను, పాములతోను చెట్లతోను ఉన్న గిరి శిఖర మొకటి పెరికి హనుమంతుడు ఆ రాక్షసుల నిద్దరిని దానితో చంపివేశాడు.

అయిదుగురు సేనానులను చంపిన తరువాత మిగిలిన సేనను కూడా వానరుడు నాశనం చేశాడు. గుఱ్ఱాలతో గుఱ్ఱాలను, ఏనుగులతో ఏనుగులను, యోధులతో యోధులనూ, రథాలతో రథాలను ఆ వానరుడు నాశనం చేశాడు. భూమి మీద నున్న దారులు, చచ్చిన ఏనుగులతోను, గుఱ్ఱాలతోను, విరిగిన గవాక్షాలు కల రథాలతోను నిండి నడవడానికి వీలు లేకుండా పోయాయి.

సేనాపతులను సేనలతో సహితం నాశనం చేసి ఆ వీరుడు ద్వారం చేరి ప్రజలు నాశనమయే సమయాన్న అవకాశం కోసం ఎదురు చూస్తున్న యముని వలె కనిపించాడు.

సేనాపతులను వారి అనుచరులను హనుమంతుడు నాశనం చేసినట్లు రావ

ణుడు తెలుసుకున్నాడు. యుద్ధంచేయడానికి ఉత్సాహం చూపుతున్న అక్ష కుమారుడి మీద తన చూపులు ప్రసరించాడు.

తండ్రి తన వేపు చూస్తుంటే సభలో నున్న అక్షకుమారుడు పైకి లేచాడు. వీర్యవంతుడు, రాక్షస శ్రేష్ఠుడు అయిన అక్షకుమారుడు మహారథం మీద ఎక్కి మహావానరుని మీదికి వెడలాడు.

అక్షకుమారుడు తపస్సులు అనేకం చేసి సంపాదించినది ఆ రథం. ఆకాశం మీద అది ప్రయాణం చేస్తుంది. దానిని అధిరోహించి అక్ష కుమారుడు వెడలాడు.

అక్షకుమారుడు సేనలతో కూడినవాడై మహాకపిని సమీపించాడు. ప్రజలను నాశనం చేసేటప్పుడుతోచే ప్రళయకాలమహాగ్ని వలె కనిపిస్తున్న ఆ వానరుని చిన్న చిరునవ్వుతో గౌరవకరమైన చూపులతో చూశాడు. మహాత్ముడైన ఆ వానరుని వేగం, అతని పరాక్రమం, తన బలాన్ని అక్షకుమారుడు విచారించి హేమంతం తగ్గగా అభివృద్ధి చెందిన సూర్యుని వలె పెంపొందాడు.

ఆ రాక్షసుడు హనుమంతుని పరిశీలించి స్థిరంగా నిలిచాడు. వాడిగల మూడు బాణాలతో అతనిని కొట్టాడు. బంగారపు బాహుపురులు చక్కని కుండలాలు కల అక్ష కుమారుడు వానరుని ఎదుర్కొన్నాడు. సురాసురులకు సంభ్రమం కలిగించే సాటిలేని వారి సమాగమం అపుడు కలిగింది. వారిద్దరి మధ్యజరిగే యుద్ధాన్ని చూసి భయంతో భూమి శబ్దం చేసింది. పర్వతం అధికంగా కంపించింది. ఆకా శం పెద్ద ధ్వని చేసింది. సముద్రం క్షోభించింది.

అపుడు విషం కక్కుతున్న సర్పాలవలె నున్న మూడు బాణాలను అక్ష కుమారుడు వానరుని శిరం మీద పడ్డట్లు విడిచి పెట్టాడు.

ఆ మూడు బాణాలు హనుమంతుని తలమీద సమానంగా తగిలాయి. దెబ్బతిని నెత్తుటితో తడిసి వృత్తాకారంగా నున్న కనులు కలవాడై, హనుమంతుడు,. శరములనే కిరణాలు కలవాడై, కిరణాలు దండలుగా ధరించిన సూర్యుడివలె శోభించాడు. చిత్రమైన ఆయుధాలను విచిత్రమైన బాణాన్ని ధరించిన అక్ష కుమారుని చూసి హనుమంతుడు యుద్ధమందు ముందంజ వేసి చాలగా హర్షించి శరీరాన్ని పెంచాడు.

ఆ హనుమంతుడు మందరగిరి శిఖరం మీద వెలుగుతున్న సూర్యుడి వలె కనిపించాడు. అతనికి కోపం బాగా పెంపు జెందింది. బలపరాక్రమాలు కలవాడ తడు. సేనతోనూ వాహనంతోనూ వచ్చిన అక్షకుమారుడిని తన కనుల నుండి మండుతూ వెలువడిన చూపు కాంతులతో దహించాడు అతడు.

ఆ రాక్షసుడు మేఘం వంటివాడు. మేఘానికి ఇంద్ర ధనువు వలె, చిత్రమైన బాణాలు కల వింటిని ధరించిన వాడు, మేఘం పెద్ద వర్షాన్ని కురిపించి నట్లు అతడు హనుమంతుడి మీద అమ్ముల వర్షం కురిపించాడు. ఆకపిశ్రేష్ఠుడెటువంటి వాడు? అతడు కొండవంటివాడు (అచలుడు). ఉన్నతమైన పర్వతం మీద మేఘం వర్షించినట్లు అక్షకుమారుడు హనుమంతుని మీద బాణ ప్రయోగం చేశాడు.

పెంపొందుతున్న కాంతి, బలం, పరాక్రమం - వీటితో కూడిన అక్ష కుమారుని, పోరులో బాగా చూసి, మేఘంతో సమాన పరాక్రమం కలవాడై హనుమంతుడు సంతోషంతో పెద్ద ధ్వని చేశాడు.

ఆ అక్షకుమారుడు కుఱ్ఱతనంతో తను యుద్ధమందు పరాక్రమవంతుడనని గర్వించి ఎఱ్ఱని కనులు కలవాడై, యుద్ధమందు సాటిలేని ఆ వానరుని ఎదిరించాడు.

హనుమంతుడు అతని బాణాలతో బాగా కొట్టబడి, భుజాలను తొడలను విదలించుకొని ఆకాశం మీదికి ఎగిరాడు. అక్షకుమారుడు ఎగురుతున్న హనుమంతుని అనుసరించి బాణాలు విడిచి పెట్టాడు. యుద్ధమందు ప్రచండమైన పరాక్రమం కల హనుమంతుడు అక్షకుమారుడు విడిచిన బాణాల మధ్యను గాలివలె తిరుగుతూ వాయువు తిరిగే ఆకాశమార్గాన సంచరించాడు.

అక్షకుమారుడు ఆకాశాన్ని అమ్ములతో నింపుతుంటే, భుజాల మధ్య భాగాన్న కొట్టబడిన హనుమంతుడు యుద్ధమందు పరాక్రమం చూపించడం గురించి ఆలోచించాడు.

"మహాబలుడైన అక్షకుమారుడు చిన్న వాడివలె కాక పెద్దవాడివలె ఈ మహాకార్యం చేస్తున్నాడు. అన్ని విధాలైన యుద్ధకార్యాల యందు ప్రకాశించు తున్న ఇతనని నాశనం చేయాలని నా మనసు కోరడం లేదు. ఇతడు మహాత్ముడు - చాల గొప్ప పరాక్రమం కలవాడు. యుద్ధంలో ఏమరు పాటు లేనివాడు. చాల

ఓర్పు కలవాడు. తన పనియందు నేర్పు కలవాడైన ఇతడు నిశ్చయంగా నాగులు, యక్షులు, మునుల చేత పూజింపదగినవాడు. ఈ అక్షకుమారుడు పరాక్రమం, ఉత్సాహం మనసులో పెంపొందగా ఎదుట నిలిచి నన్ను చూస్తున్నాడు. ఇతని పరాక్రమం మనసులలో కంపనం లేపుతోంది. ఇతడిని ఉపేక్షించకూడదు. ఇతడు పరాక్రమం యుద్ధంలో పెరుగుతున్నది. ఇతడిని చంపడమే నాకు యిష్టంగా ఉంది. పెరుగుతుండే అగ్నిని ఉపేక్షించరాదు!".

ఎదుట వాడి గొప్ప వేగాన్ని తర్కించి, తాను చేయవలసిన పనిని నిశ్చయించుకొని మహాబలుడు అపుడు వేగం పెంచాడు. అక్షకుమారుని వధ మీద మనసు నిలిపాడు.

చాల వేగం గలవి, ఏమరుపాటు లేనివి, పక్కలకు తిరిగేటప్పుడు కూడా బరువును ఓర్వగలిగేవి అయిన అక్షకుమారుని ఎనిమిది గుర్రాలను ఆకాశమార్గంలో హనుమంతుడు అరచేతితో మోది చంపివేశాడు. ఆ దెబ్బలతో మహారథం లోపలి భాగం బాగా విరిగి పూజుకు కట్టిన నొగ తొలగి, గుర్రాలు చచ్చి, ఆకాశం నుండి భూమి మీదకు పడిపోయింది.

మహారథి, భీమ పరాక్రమం కలవాడు అయిన అక్షకుమారుడు ఆ రథాన్ని విడిచి పెట్టాడు. ఋషి తన తపోబలంచేత శరీరాన్ని విడిచి పెట్టి దేవతల నివాసమైన స్వర్గానికి పోయినట్లు, అక్షకుమారుడు బాణాన్ని పట్టుకొని, ఖడ్గాన్ని ధరించి ఆకాశం మీదికి ఎగిరాడు.

ఆకాశమార్గంలో సంచరిస్తున్న ఆ అక్షకుమారుని, వాయుదేవునితో సమానమైన పరాక్రమం కల వానరుడు సమీపించి క్రమంగా అతని పాదాలను దృఢంగా పట్టుకున్నాడు. మహా సర్పాన్ని గరుడుడు పట్టుకున్నట్లు అతనిని పట్టుకొని వాయుదేవునితో సమానమైన పరాక్రమం కల హనుమంతుడు, వేయిసార్లు త్రిప్పి యుద్ధమందు భూమి మీదికి విడిచి పెట్టాడు.

చేతులు తొడలు కటిప్రదేశం మెడ విరిగి నెత్తురు ప్రవహిస్తుంటే, ఎముకలు కన్నులు నలుగకొట్టబడి, సంధులు విరిగి, కండరాలు వెదజల్లబడి రాక్షసుడైన అక్షకుమారుడు హనుమంతునిచే చంపబడి భూమి మీద పడ్డాడు.

హనుమంతుడు అతనిని భూమి మీద పీడించి చంపి రాక్షసరాజుకు గొప్ప భయం కలిగించాడు. అక్షకుమారుడిని చంపేటప్పుడు ఆకాశం మీద జ్యోతిశ్చక్ర మందు తిరిగే మహావ్రతులైన మహర్షులు, యక్షులు, పన్నగులు, మహాభూతాలు ఆనందంతో, ఇంద్రుడితో కూడిన దేవతలతోను ఆశ్చర్యాన్ని పొంది నిరీక్షించారు.

అక్షకుమారుని చంపి ప్రళయకాలం నాటి యమునివలె వీరుడైన హనుమంతుడు బహిర్ద్వారాన్ని చేరుకున్నాడు.

హనుమంతుడిచేత అక్షకుమారుడు చంపబడగా రాక్షసప్రభువు మనస్సును సమాధాన పరచుకున్నాడు. కోపంతో నున్నవాడు, ఇంద్రునితో సమానమైన వాడు అయిన ఇంద్ర జిత్తును ఈ విధంగా ఆదేశించాడు.

"నువ్వు అస్త్రాలను తెలిసిన వాడివి. శస్త్రాలప్రయోగంలో శ్రేష్ఠుడివి. దేవతలకు అసురులకు దుఃఖం కలిగించే వాడివి. నీ పరాక్రమం, ఇంద్రునితో సహా, అందరు దేవతలకూ తెలుసు. పితామహుడైన బ్రహ్మను ఆరాధించి బ్రహ్మాస్త్రం పొందిన వాడివి. నీ అస్త్ర బలం ఎదుట అసురులు కాని మరుద్గణాలు కాని దేవేంద్రుని ఆశ్రయించిన దేవతలు కాని యుద్ధమందు నిలువడానికి సమర్థులు కారు. మూడు లోకాల్లో యుద్ధమందు నిన్నెదిరించి శ్రమ పొందనివాడు ఉండడు. తన భుజబలంతో రక్షింపబడేవాడు ఉండడు; తన తపస్సుచేత రక్షింపబడేవాడు కూడా ఉండడు. దేశం గురించి కాలం గురించి ఏర్పడే విభాగాలను నువ్వే బాగా తెలిసిన వాడివి.

"నీ సామర్థ్యానికి యుద్ధమందు అసాధ్యమైనది ఏదీ లేదు. నీవు బాగుగా ఆలోచించి ఎటువంటి చెడ్డపని చేయవు. మూడు లోకాల్లోను నీ అస్త్రబలం, నీ బలం తెలియ వాడు లేడు.

"యుద్ధమందు నీ పరాక్రమం, అస్త్రబలం, తపోబలం, నాయీ శక్తులకు సమానమైనవి. నువ్వు, యుద్ధభూమిలో ఉంటే తప్పకుండా జయం కలుగుతుంది. అందుచేత నా మనస్సు కలతజెందదు.

"కింకరులు, జంబుమాలి, అమాత్యపుత్రులైన అయిదుగురుసేనాపతులు చనిపోయారు. గుఱ్ఱాలు ఏనుగులు రథాలతో నున్న వారి సేనలు నాశనమయాయి. నీ సోదరుడు కూడా చంపబడ్డాడు.

"నీ యందు నా బలమున్నట్లు వాళ్లయందు లేదు. ఈ పెద్దసేనను చూడు. వానరుని ప్రభావం గురించి అతని పరాక్రమం గురించి ఆలోచించు. నీ బలం గురించి ఆలోచించు. అపుడు నీ శక్తికి తగినట్టి వేగాన్ని పొందవలసింది.

"ఓయి అస్త్రవేత్తలలో గొప్పవాడా! శత్రువులను అణచగలిగే నువ్వు దగ్గరగా ఉండగా ఏ విధంగా మనసేనకు నాశం కలుగదో ఆ విధంగా నీ శక్తిని, ఎదుటి వాడి శక్తిని బాగుగా యోజంచి పని ప్రారంభించవలసింది.

"గుంపులుగా సైనికులను చంపే అతని ఎదుట సేన ప్రయోజనకారి కాదు. వజ్రం వంటి ఆయుధం కూడా నిష్ప్రయోజనమే. అతని గమనానికి వాయువు కూడా సరికాడు. అతడు అగ్నితో సమానుడవడం చేత మరే విధంగాను చంపడానికి వీలుపడదు.

"కాబట్టి నువ్వీ విషయాలన్నీ బాగా ఆలోచించు. నువ్వు చేసే పనులలో అతను తీసిపోడని ఒక నిశ్చయానికి వచ్చి దివ్యమైన నీ అస్త్రాల ప్రభావం, నీ వింటి గొప్పదనం తలచుకొని నాశనం కలుగని పని మొదలు పెట్టు.

"ఓయి మతిమంతుడా! నిన్ను నేను పంపించడం సరియైనది కాదు. కాని ఇది రాజధర్మం. ఇది క్షత్రియుని ఆలోచన. యుద్ధమందు పలు విధాలైన శస్త్రాలను ప్రయోగించే నేర్పు తప్పక ఉండవలసిందే. రణమందు విజయం కోరిన వాడు తప్పకుండా యుద్ధం చేయవలసిందే!"

అపుడు దేవతలతో సమానమైన ప్రభావం కల వీరుడైన ఇంద్రజిత్తు తండ్రి మాటలు విని యుద్ధం చేయడానికి కృతనిశ్చయుడై ప్రభువైన రావణునికి ప్రదక్షిణం చేశాడు. ఇంద్రజిత్తు యుద్ధసన్నద్ధుడై ఉత్సాహం కూడగట్టుకొని యుద్ధం వేపు తరలాడు. పర్వదినాలయందు సముద్రుడు పొంగినట్లు మహాతేజోవంతుడై అతడు వెడలినాడు.

ఇంద్రజిత్తు గరుత్మంతునితో సమానమైన వేగంకల, వాడియైన తెల్లని కోరలు గల, నాలుగు పులులను పూన్చిన రథాన్ని ఆరోహించాడు. అతడు విలుకాండ్రలో శ్రేష్ఠుడు; శస్త్రాలను, అస్త్రాలను ప్రయోగించడం తెలిసిన వారిలో గొప్పవాడు. వేగంగా అతడు హనుమంతుడున్న చోటికి పోయినాడు.

ఇంద్రజిత్తు రథ గర్జనను అతని బాణం యొక్క టంకారాన్ని విని వానర వీరుడు చాల సంతోషించాడు.

అన్ని దిక్కులు అపుడు కలుషితములయాయి. క్రూరమృగాలు పలు విధాలుగా అరిచాయి. అచటికి నాగులు యక్షులు మహర్షులు జ్యోతిశ్చక్రమందు తిరిగే సిద్ధులు గుమిగూడి వచ్చారు. పక్షిసమూహాలు చాలసంతోషించినవై ఆకాశం కప్పి వేసి పెద్ద గొంతుతో అరిచాయి.

చాల వేగంతో వస్తున్న ఇంద్రజిత్తు రథాన్ని చూసి ఆవానరుడు గొప్ప శబ్దంచేసి శరీరం పెంచాడు. ఇంద్రజిత్తు దివ్యమైన రథమెక్కి చిత్రమైన వింటిని ధరించి పిడుగు వంటి చప్పుడుతో ధనుష్టంకారం చేశాడు.

అపుడు రాక్షసప్రభువు కుమారుడూ వానరుడూ పోరుకు తలపడ్డారు. ఇద్దరూ చాల తీవ్రమైన వేగం కలవారు, మహా బలులు, యుద్ధమందు భయం లేనివారు. ఒకరియందు ఒకరికి విరోధం కల దేవరాజు ఇంద్రుడు,అసురరాజు బలి, ఒకరినొకరు ఎదుర్కొన్నట్లు వాళ్లిద్దరూ పోరుకు తలపడ్డారు.

యుద్ధవిశారదుడైన ఇంద్రజిత్తు యొక్క బాణాల మహావేగాన్ని హనుమంతుడు, తన తండ్రియైన వాయువు సంచరించే ఆకాశమార్గంలో, శరీరం పెంచి ఎదుర్కొన్నాడు.

ఇంద్రజిత్తు, వేగంకల బాణాలను హనుమంతుని మీద విడిచాడు. హనుమంతుడు, రథధ్వనిని, మృదంగాలు, భేరులు పటహాలు - వీటి చప్పుడును, ధనుష్టంకారాన్ని విని తిరిగి పైకి ఎగిరిపోయాడు. ఇంద్రజిత్తు గురిని వమ్ము చేసి మహా వానరుడు తొందరగా బాణాల మధ్య సంచరించాడు.

యుద్ధనిపుణులైన వారిద్దరూ సకల ప్రాణులకు మనోరంజకంగా గొప్ప యుద్ధం సలిపారు. రాక్షసునికి హనుమంతుని బాధించే అవకాశం కాని, మహాత్ముడైన ఇంద్రజిత్తును మారుతపుత్రుడు బాధించే అవకాశం కాని కలుగలేదు. దేవతలతో సమానపరాక్రమంకల వారిద్దరూ ఒకరినొకరు జయింపలేకపోయారు.

అపుడు లక్ష్యం తప్పిపోయినది కాగా అమోఘాలైన బాణాలు ప్రయోజనం లేకపోవడం చేసి ఇంద్రజిత్తు గొప్ప విచారం పొందాడు. అతడు బాణప్రయోగం

మీద మనసు కేంద్రీకరించాడు. హనుమంతునిపై మనసు నిలిపాడు. ఆ వానర వీరుడు చంపదగినవాడు కాడని తెలుసుకొని అతడిని ఎట్లు బంధించాలని ఆలోచించాడు.

అస్త్రవేత్తలలో గొప్పవాడు, వీరుడు, మహా తేజశ్శాలి అయిన ఇంద్ర జిత్తు పితామహుడైన బ్రహ్మ యొక్క అస్త్రాన్ని హరిశ్రేష్ఠుని మీద సంధించాడు. ఇంద్ర జిత్తు, హనుమంతుడు చంపరాని వాడని తెలుసుకొని, బ్రహ్మాస్త్రంతో అతనిని బంధించాడు. వానరుడు బ్రహ్మాస్త్రం చేత బంధింపబడి చేష్టలు లేనివాడై భూమి మీద పడిపోయాడు.

మారుతి బ్రహ్మాస్త్రంతో బంధింపబడి, బ్రహ్మదేవుని ప్రభావం వలన, పోయిన గమన వేగం కలవాడై, తనపై బ్రహ్మ దేవుని యొక్క అనుగ్రహాన్ని, అతడిచ్చిన వరాన్ని తలచుకున్నాడు. అస్త్రంనుండి హనుమంతునికి తప్పించుకునే శక్తి లేదని ఇంద్రజిత్తు తలచి, తన మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించాడని హనుమంతుడు అనుకున్నాడు. మారుతి అస్త్రం నుండి విడిపించుకునే తన శక్తిని బాగా ఆలోచించి బ్రహ్మ యొక్క ఆజ్ఞకు బద్ధుడై ఉండిపోయాడు.

"బ్రహ్మాస్త్రంచే కట్టబడినప్పటికీ బ్రహ్మ చేత, వాయువు చేత, మహేంద్రుని చేత రక్షింపబడుతున్న నాకు భయం కలుగడం లేదు. రాక్షసులచేత నేను బంధింపబడినా నాకు పర్యవసానంగా గుణమే కనబడుతున్నది. రాక్షసరాజుతో సంవాదం అవశ్యం చేయవలసి ఉంది. అందుచేత నన్ను శత్రువులు పట్టుకొందురు గాక!" అని హనుమంతుడు తలచాడు.

ఒక నిశ్చయానికి వచ్చిన హనుమంతుడు చేష్టలుడిగినవాడై, చాల శక్తితో వచ్చి బంధించిన శత్రువులచే బెదరింపబడ్డవాడై పెద్దగా అరిచాడు. వానరుని రాక్షసులు జనపనారలతోను, త్రాడుగా పేనిన నార చీరలతోను బంధించారు. రాక్షసరాజు ఒక వేళ తనను చూడగలడని హనుమంతుడు భావించి రాక్షసుల చేత నిర్బంధింపబడడాన్ని అంగీకరించాడు.

నారలతో కట్టబడిన హనుమంతుడు అస్త్రము యొక్క బంధం నుండి విముక్తి పొందాడు. అస్త్రబంధం, మరియొక బంధం జరిగినప్పుడు నిలువదు కదా!

ఇంద్రజిత్తు ఈ విషయం తెలుసుకొని చింతించాడు.

"అయ్యో! నేను చేసిన మహాకార్యం నిరర్థకమై పోయిందే! రాక్షసులు మంత్రం యొక్క ప్రభావాన్ని గురించి ఆలోచించలేదు. ఇక మరే అస్త్రం పని చేయదు. ఇప్పుడందరం సంశయం లోపడ్డామే!"

బ్రహ్మాస్త్రం నుండి విడువ బడినప్పటికీ తాను ముక్తుడైనట్లు హనుమంతుడు అనుకోలేదు. రాక్షసులు ఈడ్చుకొని పోతుంటే కట్లచేత అతడు పీడింపబడ్డాడు. రాక్షసులు కఱ్ఱలతోను, పిడికిళ్ల తోను కొడుతూ హనుమంతుని రాక్షసరాజు సమీపానికి ఈడ్చుకు పోయారు. అస్త్రబంధం నుండి విడినవాడు, నారచీరలతో బంధింప బడినవాడు అయిన వానరవీరుని, రాక్షసగణాలతో పరివేష్టితుడైన రావణునికి ఇంద్ర జిత్తు చూపించాడు. మదించిన ఏనుగువలె బంధింపబడిన హనుమంతుని గురించి రాక్షసులు రావణునితో విన్నవించారు.

"ఎవడు వీడు? ఎక్కడనుండి వచ్చాడు? ఏం పని? వీడి పేరేమిటి?" అని అక్కడున్న రాక్షసవీరులు పలికారు.

మరి కొందరు రాక్షసులు బాగా కోపం చెంది ఒకరితో నొకరు అనుకున్నారు! "వీడిని చంపండి! కాల్చండి! లేకపోతే తినివేయండి!"

రాక్షసులచేత అక్కడికి ఈడ్వబడుతున్న హనుమంతుని రావణుడు చూశాడు. తేజస్సుతో బలంతో ప్రకాశిస్తున్న రాక్షసరాజును కపిసత్తముడు కూడా చూశాడు.

పదిముఖాలు కల రావణుడు కోపంతో తిరుగుతున్న ఎఱ్ఱని కనులు గలవాడై వానరుని చూశాడు. అక్కడ ఆసీనులైన మంత్రిముఖ్యులవేపు తిరిగి, అతడు ఆదేశించాడు- వారు కులంలోను గుణంలోను వృద్ధులు.

క్రమంగా ఆ మంత్రులు వానరుని ప్రశ్నించారు.

"ఏం పని నీకు? ఎవరు నిన్ను పంపించారు?"

ఇటువంటి ప్రశ్నలు తొలినుండి వేశారు.

"నేను సుగ్రీవుని దూతను. అతడు పంపగా వచ్చాను." అని హనుమంతుడు తెలియజేశాడు.

రావణుడు చేసిన పనికి (తన దగ్గిరికే హనుమంతుని తెప్పించి నందుకు) వానరుడు ఆశ్చర్యపడినవాడై రాక్షసప్రభువును, కోపంతో ఎఱ్ఱబడిన కనులతో చూశాడు.

చాలకాంతిగల కిరీటంతో రావణుడు వెలుగొందుతున్నాడు. అతడు ధరించిన బంగారు నగలు చిత్రంగా ఉన్నాయి. చాల విలువైన పట్టుబట్టలను అతడు ధరించాడు. రక్తచందనం శరీరానికి అలదుకున్నాడు. ఆ చందనపు పూతలు పంక్తులు దీరి విచిత్రంగా కనిపించాయి.

పది శిరస్సులతో కూడిన రావణుడు దుష్టమృగాలున్న పలు శిఖరాల మందరపర్వతం వలె కనిపించాడు. రావణుని బాహువులకు బాహుపురులు తొడిగి ఉన్నవి. ఆ బాహువులు బలిసి అయిదు తలల పాములవలె కనిపిస్తున్నవి. శ్రేష్ఠమైన ఎఱ్ఱని కంబళి పరచిన ఉత్తమ సింహాసనమందు రావణుడు సుఖంగా కూర్చున్నాడు.

చామరాలు ధరించిన ప్రమదలు రావణుని చుట్టి బాగుగా సేవ చేస్తున్నారు. దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు అన్న మంత్రాలోచన తెలిసిన నలుగురు రాక్షస మంత్రులచేత, శుభప్రదమైన ఆలోచనలు కల ఇతర రాక్షసుల చేత రావణుడు సేవింపబడ్డాడు.

గొప్ప తేజస్సు కల రాక్షసప్రభువుని హనుమంతుడు చాల ఆశ్చర్యం పొంది చూశాడు. అతని తేజస్సుచేత భ్రమచెందిన వాడై హనుమంతుడు ఈ విధంగా తలచాడుః

"అహో! ఏమి ఇతని రూపం? అహో! ఎంత ధైర్యం? ఎంతబలం? ఎంతకాంతి? ఈ రాక్షసరాజు సర్వలక్షణ సమన్వితుడై ఉండడం ఎంత ఆశ్చర్యకరం?

"చాల బలమైన అధర్మం (సీతాపహరణమన్నది) ఇతడు చేయకపోతే ఇంద్రుడితో కూడిన దేవలోకమంతటిని ఇతడు పాలించదగినవాడు.

"ఇతని క్రూరమైన, నీచమైన, లోకనికృష్టములైన పనులకు ఈ లోకాలన్నీ భయపడుతున్నవి కదా! ఇతడు కోపించి, కోరితే, ఈ ప్రపంచాన్నంతటిని ఒక సముద్రంగా చేయగలడు."

హనుమంతుడు మహాపరాక్రమవంతుడైన రాక్షసరాజును చూసి చాల విధాలుగా ఆలోచించాడు.

లోకాన్ని పీడించే రావణుడు, పింగళవర్ణం కల కనులతో ఎదురుగా నున్నవాడిని, గొప్ప కోపంతో చూసి తేజస్సుతో చుట్టబడిన ఆ వానరేంద్రుని గురించి సందేహానికి లొంగిన ఆలోచనకలవాడై ఈ విధంగా తలచాడు:

"ఏమి? ఇతడు ఇక్కడికి వచ్చిన సాక్షాత్ నందీశ్వరుడు కాడుగద? పూర్వం కైలాసపర్వతం కదల్చినప్పుడు నన్ను అతడు శపించాడు. అతడే ఈ వానరమూర్తి అయి ఉంటాడు. లేకపోతే బాణుడనుపేరుకల రాక్షసుడేనా అయి ఉంటాడు."

ఆ రాజు కోపంతో ప్రహస్తుడన్న మంత్రితో పలికాడు:

"ఇతనిని అడగ వలసింది. దురాత్ముడైన ఇతడు ఎక్కడ నుండి వచ్చాడు? ఏ కారణం చేత వచ్చాడు? ఎందుకోసం అశోకవనం నాశనం చేశాడు? రాక్షస స్త్రీలను ఎందుకు భయపెట్టాడు? చొరరాని నా నగరానికి ఏ పని మీద వచ్చాడు? ఎందుకోసం యుద్ధం చేశాడు? ఈ దుష్టబుద్ధిని అన్నీ అడగవలసింది."

రావణుని మాటలు విని ప్రహస్తుడు పలికాడు:

"ఓయి వానరుడా! ఊరట చెందవలసింది. నీకు క్షేమమగు గాక! నువ్వు చేసిన పనికి భయపడవద్దు. నువ్వు కాని రావణాలయానికి ఇంద్రుడిచే పంపబడితే ఆ నిజం చెప్పు. నీకు భయం లేదు. నిన్ను విడిచిపెడతాము. ఒక వేళ నువ్వు కుబేరుడికి, యముడికి, వరుణుడికి చారుడవైన రూపం ధరించి మా నగరం ప్రవేశించావా? విజయకాంక్షియైన విష్ణువు పంపిన దూతవా? నీ తేజస్సు వానరుడిది కాదు, నీ రూపం మాత్రం వానరుడిది. ఇప్పుడు నువ్వు నిజం చెప్తే విడిచిపెడతాము. నువ్వు అబద్ధం కాని చెప్తే నీ బ్రతుకు దుర్లభమౌతుంది. లేకపోతే, కనీసం ఎందు కోసం రావణుని నివాసం ప్రవేశించావో చెప్పు."

అపుడు రాక్షసగణాలకు ప్రభువైన రావణునితో హనుమంతుడు ఇలా అన్నాడు:

"నేను ఇంద్రునికిగాని, యమునికిగాని, వరుణునికి గాని చారుడను కాను. నాకు కుబేరుడితో స్నేహం లేదు. నేను విష్ణువుచే పంపబడలేదు. నా జాతిని బట్టి వానరుడిని. ఆ విధంగానే ఇక్కడికి వచ్చాను. రాక్షసరాజు యొక్క దర్శనం

దుర్లభమవడంచేత ఈ అశోకవనం అతని దర్శనం కోసం ధ్వంసం చేశాను. అపుడు నాకు యుద్ధమందు ఆసక్తికల రాక్షసులు ఎదురుపడ్డారు. యుద్ధంలో నా శరీరం రక్షించుకోడం కోసం ఎదురుపోరాటం జరిపాను. దేవతలచేతగాని, అసురుల చేత గాని, అస్త్రబంధాలచేత కాని నన్ను కట్టిపెట్టడం సాధ్యంకాదు. బ్రహ్మదేవుడు నాకీ వరమిచ్చాడు. రాజును చూడాలన్న కోరికచే నేను అస్త్రానికి లొంగాను. రాక్షసులు నన్ను బంధించి పీడించడం చేత బ్రహ్మాస్త్రం నుండి విముక్తుడనయాను. ఒకానొక రాచరికపు పని మీద నీ దగ్గిరకు వచ్చాను. అత్యధికబలం కల రాముని యొక్క దూతనని విజ్ఞాపన చేస్తున్నాను. ఓ ప్రభువా! హితకరములైన మాటలను వినవలసింది."

ధైర్యశాలియైన హనుమంతుడు దశముఖుడిని చూసి అర్థవంతంగా, నిలకడగా ఈ మాటలన్నాడుః

"నేను సుగ్రీవుని సందేశం కారణంగా నీ నివాసానికి వచ్చాను. వానర రాజైన సుగ్రీవుడు నీకు సోదరసమానుడు. అతడు నీకుశలమడిగాడు. ధర్మంతో కూడినది, ఈ లోకానికి పై లోకానికి సరిపడ్డది అయిన వాక్యం వినవలసిందిః

"దశరథుడనే రాజు ఉండేవాడు. రథాలు, ఏనుగులు, గుఱ్ఱాలు కలవాడాయన. ప్రజలకుబంధువతడు; దేవేంద్రునితో సమానమైన కాంతి కలవాడు. అతని పెద్ద కొడుకు మహాబాహువు, తండ్రికి ప్రియం కూర్చేవాడు. అతడు తండ్రి ఆజ్ఞనను సరించి ఇల్లు వెడలి దండకారణ్యం ప్రవేశించాడు. మహాతేజశ్శాలియైన రాముడను పేరుగల అతడు తమ్ముడైన లక్ష్మణుడితోను భార్య అయిన సీతతోను ధర్మబద్ధమైన మార్గాన్ని అనుసరించాడు. పతిని అనుసరించే అతని భార్య, విదేహరాజూ మహాత్ముడూ అయిన జనకరాజు కూతురు, అరణ్యమందు అపహరింపబడింది. ఆ రాజపుత్రుడు తన సోదరునితో కలిసి తన దేవిని వెదకుతూ ఋశ్యమూకపర్వతం చేరుకున్నాడు. అక్కడ సుగ్రీవుని కలిశాడు. సీతాదేవి అన్వేషణ గురించి సుగ్రీవుడు ప్రతిజ్ఞ చేశాడు. రాముడు కూడా వానర రాజ్యాన్ని సుగ్రీవుడికి అర్పిస్తానన్నాడు. వాలిని యుద్ధంలో చంపి కోతులు ఎలుగుబంట్లు- వీటి సమూహాలకు అధిపతిగా రాజ్యమందు సుగ్రీవుని ప్రతిష్ఠించాడు. వానరశ్రేష్ఠుడైన వాలి గురించి ఇంతకు ముందే నీకు తెలుసు. ఆ వానరుడు ఒక్క బాణంతో రాముని చేత చంపబడ్డాడు.

"సీతాదేవిని వెదకుటయందే మనసు నిలిపిన వాడు, సత్యం కోసమే యుద్ధం చేసేవాడు, వానరులకు రాజు అయిన సుగ్రీవుడు కోతులను అన్ని దిక్కులకు పంపించాడు. వేలు, వందలు, లక్షలు - వీటి సంఖ్యలో వానరులు అన్ని దిక్కులను, క్రిందను, ఆకాశం మీదను సీతాదేవిని వెదకుతున్నారు. వానరులలో కొంతమంది వినతాసుతుడైన గరుడుడితో సమానులు. కొంతమంది వాయుదేవునికి సరియైనవారు. వేగంగా నిరాటంకంగా ప్రయాణం చేసే మహాబలులైన వానరవీరులు వారు.

"నేను హనుమంతుడనే పేరు గలవాడిని. నూరు యోజనాలు పొడవున్న సముద్రాన్ని సీతాదేవి కోసం దాటిన వాడిని. సీతాదేవిని చూడడానికి ఇక్కడికి వచ్చాను. ఇక్కడ తిరుగుతుంటే నీ గృహమందు జనకుని కూతురైన సీతాదేవిని చూశాను.

"ఓయి మహాప్రాజ్ఞుడా! నువ్వు ధర్మం తెలిసినవాడివి. తపస్సు చేసిన వాడివి. అటువంటి నీకు, ఇతరుని భార్యను నిర్బంధించడం తగిన పనికాదు. ధర్మ విరుద్ధాలు, చాల అపాయకరాలు, ఆత్మవినాశం కలిగించేవి అయిన పనులలో నీవంటి బుద్ధిమంతులు జోక్యం కలుగజేసుకోరు.

"లక్ష్మణుడు విడిచే బాణాల ముందు, రాముడు కోపంతో విడిచే బాణాల ముందు నిలువడానికి దేవతలలోకాని అసురులలో కాని సమర్థులు లేరు. ఓ రాజా! రామునికి అప్రియం ఒనగూర్చి సుఖాన్ని పొందేవాడు మూడులోకాల్లో ఎవడూ ఉండడు.

"మూడు కాలాలకు (భూత, భవిష్యత్, వర్తమానాలకు) అనుగుణమైనది, ధర్మయుక్తమైనది, అర్థవంతమయినది అయిన నా మాటను నువ్వు పరిగణించి, నరదేవుడైన రామునికి జానకిని ఇచ్చి వేయవలసింది.

"సీతాదేవిని నేను చూశాను. దుర్లభమైన ఆమె దర్శనం నాకు లభించింది. ఏ పనయితే ఇంకా మిగిలి ఉందో దానిని రాముడు నిర్ణయిస్తాడు.

"సీతాదేవిని నేను చూశాను. ఆమె దుఃఖంలో మునిగి ఉంది. ఆమె అయిదు తలల పాము వంటిది. ఆమెను నిర్బంధించి నువ్వీ సంగతి తెలుసుకో లేకుండా ఉన్నావు.బాగా విషం కలిసిన అన్నాన్ని బలం గలవాడు తినినప్పటికీ ఏ విధంగా

జీర్ణం కాదో, అదే విధంగా ఈమె అసురులకు గాని దేవతలకు కాని వశమయేది కాదు.

"నువ్వు తపస్సుచే శ్రమించి సంపాదించిన ఈ ధర్మమనే సంపద నీ యొక్క ఆయుర్వృద్ధి చేస్తుంది. దానిని ఈ విధంగా నాశనం చేయడం న్యాయం కాదు. నువ్వు తపస్సుచేసి దేవతలు కాని అసురులు కాని నిన్ను చంపలేనట్టి వరాన్ని పొంది అమరుడవైనావని తలుస్తున్నావేమో! కాని, సుగ్రీవుడు దేవతకాడు-అసురుడుకాడు-రాక్షసుడుకాడు-దానవుడు కాడు-గంధర్వుడు కాడు-యక్షుడు కాడు - పన్నగుడు కాడు-

"కాబట్టి, ఓరాజా! నువ్వెట్లు ప్రాణాలను రక్షించుకోగలవు? ధర్మాన్ని నాశనం చేసే పని అటువంటి ఫలితాన్నే పొందుతుంది. నువ్వీసరికి ధర్మం ఇచ్చే ఫలితాన్ని పొందే ఉన్నావు. ఈ అధర్మకార్యం ఫలితాన్ని కూడా తొందరలో పొందుతావు.

"జనస్థానంలో జరిగిన రాక్షసవధ తెలుసుకొని, ఆ విధంగానే వాలివధకూడా తెలుసుకొని, రామసుగ్రీవుల స్నేహం కూడా తెలుసుకొని నీ యొక్క హితం ఆలోచించుకో!

"కోరినట్లయితే గుఱ్ఱాలు, రథాలు, ఏనుగులు కల లంకను నాశనం చేయడానికి నేనొక్కడినే చాలు. కాని, రాముడు ఆ విధంగా నిర్ణయించలేదు. కోతులు, ఎలుగులు వీరి ముందు రాముడు ప్రతిజ్ఞ చేశాడు. సీతాదేవిని నిర్బంధించిన శత్రువులను నాశనం చేస్తానని అతను ప్రతిజ్ఞ చేశాడు. సాక్షాత్తు దేవేంద్రుడైనా రామునికి అపకారం చేసి సుఖాన్ని పొందలేడు. అటువంటప్పుడు నీ వంటి మరొకడు సుఖమెలా పొందగలడు?

"నీ అధీనంలో ఉన్న ఎవరిని నువ్వు సీత అని భావిస్తున్నావో ఆమె లంకా నగరాన్ని నాశనం చేసే కాళరాత్రి అను శక్తిగా తలచవలసింది. సీతాదేవి శరీరాకృతి దాల్చిన యమపాశం వంటిది. దానిని స్వయంగా మెడకు చుట్టుకోకు. నీ గురించి తగిన విధంగా ఆలోచించుకో. ఈ లంకానగరం సీతాదేవి కోపంతో తగుల బడుతుంది. రాముడి కోపంచేత బాధను పొందుతుంది. అటువంటి ఈ లంక మేడలతో మిద్దెలతో తగులబడుతుంటేచూడలవలసింది. నీ మిత్రులు మంత్రులు

జ్ఞాతులు అన్నదమ్ములు పుత్రులు హితులు భోగాలు భార్యలు లంకానగరం - వీటన్నింటికి నాశనం కలుగజేయకు.

"రాక్షసరాజా! సత్యమైన నామాట విను. నేను రాముడి దాసుడిని; దూతను; విశేషించి వానరుడిని. భూతాదులూ, చరాచరాలూ, వీటితో కూడిన అన్ని లోకాలను పూర్తిగా సంహరించి, తిరిగి యథాప్రకారం సృష్టిచేయడానికి మహాయశస్వియైన రాముడు సమర్థుడు. దేవతలయందు అసురులయందు రాజుల యందు యక్షుల యందు రాక్షసుల గణాలందు విద్యాధరులయందు గంధర్వులందరియందు ఉరగుల యందు సిద్ధులయందు పక్షులయందు అంతటనూ సర్వభూతాలందు, అన్ని సమయాల యందు, విష్ణువుతో సమానమైన పరాక్రమం కల రామునికి ఎదురు నిలిచి యుద్ధం చేసేవాడెవడూ లేదు. ఈ విధంగా రామునికి అపకారం చేసి నువ్వు జీవించడం దుర్లభమే. బ్రహ్మకాని, రుద్రుడు కాని, ఇంద్రుడు కాని, రాముని చేతి చావు నుండి తప్పించడానికి శక్తివంతులు కారు."

చాల గంభీరంగా మాట్లాడే ఆ వానరుని యొక్క అర్థవంతమైనది అప్రియమైనది అయిన సంభాషణను రావణుడు విని కోపంతో తిరుగుతున్న కనులు కలవాడై ఆ మహావానరుని వధను ఆజ్ఞాపించాడు.

దూతకార్యాన్ని హనుమంతుడు నివేదించడంచేత అతని వధను విభీషణుడు అంగీకరించలేదు. కార్య నిర్వహణమందు స్థిరబుద్ధికల విభీషణుడు చేయవలసిన పనిని గురించి ఆలోచించాడు.

శత్రువులను జయించే విభీషణుడు తన అన్నను సామవాక్యాలతో పూజించాడు. వాక్యవిశారదుడైన విభీషణుడు హితము కలిగించు మాటలు పలి కాడు:

"ఓ రాక్షసరాజా! నువ్వు ఈ వానరుని క్షమించవలసింది. కోపాన్ని విడువవలసింది. శాంతించి ఈ మాటలు వినవలసింది. యుక్తాయుక్తాలు తెలిసిన సత్పురుషులైన రాజులు దూతను వధించరు. ఓయి వీరుడా! ఈ వానరుని చంపడం రాజధర్మానికి విరుద్ధమైనది.. లోకవ్యవహారానికి నింద్యమైనది. నీ వంటి వాడికి తగనిది. నువ్వు ధర్మ మెరిగిన వాడివి; కృతజ్ఞుడవు, రాజధర్మ విశారదుడవు. నీవే పరమార్థ మెరిగిన వాడివి. నీ వంటి పండితులు కూడా కోపానికి దాసులైతే

శాస్త్రాలలో పాండిత్యం పొందడం కేవలం శ్రమదాయకమే. కాబట్టి ఓ రాక్షస ప్రభువా! శత్రువులను చంపే వాడా, ఇతరులు చేరలేనివాడా! శాంతించవలసింది. మంచి పెద్దలు ఆలోచించి దూతకు శిక్ష విధించవలసింది."

రావణుడు విభీషణుని మాటలు విని, ఆవేశాన్ని పొంది బదులు పలికాడు:

"ఓ శత్రుసూదన! పాపులను చంపడం వలన పాపం కలుగదు. కాబట్టి పాపాత్ముడైన ఈ వానరుని చంపుతాను."

బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైన విభీషణుడు. అధర్మానికి మూలమైనట్టిది, చాల దోషాలతో కూడినట్టిది, అనార్యులు సేవించు నట్టిది అయిన మాటను విని, నిజం తెలిపే సర్వోత్తమమైన వాక్యాన్ని పలికినాడు.

"ఓయి లంకాధిపతి! ప్రసన్నుడవుకావలసింది. ధర్మంతో కూడిన మాటలు వినవలసింది. దౌత్యం జరిపే సమయాలలో, ఏ జాతికి చెందినా, ఎచ్చటనైనా, దూతలు చంపదగినవారు కారని సత్పురుషులంటారు. ఇతడు బలవంతుడైన శత్రువనడంలో సందేహంలేదు. ఇతడు చేసిన అపకారం మితిలేనట్టిది. దూతను వధించరాదని సత్పురుషులు పలుకుతారు. దూతకు విధించవలసిన శిక్షలు చాలా ఉన్నవి. శరీరభాగాలను వికారంగా చేయడమో, కొరడాలతో కొట్టడమో, తల గొరిగించడమో, చుక్కలవంటి గుర్తులుంచడమో – వీటిని దూతకు విధించవలసిన దండనలని చెప్తారు. దూతను చంపడమన్న మాట వినలేదు.

"నువ్వు ధర్మాచరణమందు శిక్షితమైన బుద్ధి కలవాడివి. ఉత్తమమైనట్టివి, అనుత్తమములు అయిన కార్యాలను తెలిసి నిశ్చయమైన బుద్ధితో ఆచరించే వాడివి. అటువంటి నీవే కోపానికి లొంగిపోతే ఎలా? దేహబలం కలవారు కోపాన్ని నిగ్రహించుకుంటారు.

"ఓయి వీరుడా! ధర్మశాస్త్రంలోకాని, లోకవ్యవహారంలోకాని, శాస్త్రజ్ఞానం గ్రహించడంలోకాని నీకు సాటియైనవాడెవడూ లేడు. అందరు సురులలోను అసురులలోను నువ్వు ఉత్తముడివి. ఈ కోతిని చంపడంలో గొప్పదనం నాకు కనిపించదు. నీవు విధించిన శిక్ష ఈ కోతికి చెందదు. అతనిని పంపిన వానికి చెందుతుంది. ఇతడు యోగ్యుడే కావచ్చు, అయోగ్యుడే కావచ్చు. కాని ఇతడు ఇతరులచే పంపబడ్డవాడు. ఇతరుల ప్రయోజనం కోసం మాట్లాడే దూత చంపదగిన

వాడు కాడు. ఇంకా, ఇతనిని చంపుతే ఆకాశం మీద సంచరించే మరొకడు తిరిగి ఇక్కడికి మహాసముద్రాన్ని దాటి వచ్చేవాడు కనిపించడంలేదు. ఓయి శత్రువుల నగరాలను జయించేవాడా! కాబట్టి ఇతని వధకు ప్రయత్నాలు చేయవద్దు.

"యుద్ధమందు ఆసక్తికల రావణా! ఈ దూత నశిస్తే నరరాజు కొడుకులైన వారు, వినయవంతులు కానివారు, బహుదూరంలో ఉన్నవారు ఇక్కడికి రావడానికి దారి అడ్డగింపబడినవారై, యుద్ధానికి ప్రోత్సాహమిచ్చే మరో దూతను పంపించే అవకాశం లేని వారవుతారు.

"నువ్వు పరాక్రమం, ఉత్సాహం, అభిమానం కల దేవాసురులకైనా జయింప రాని వాడివి. రాక్షసుల మనస్సును ఆనందింపజేసేవాడా! ఈ యుద్ధావకాశాన్నినాశనం చేయడం యుక్తమైనది కాదు. నీ మేలు కోరేవారు, శూరులు, ఏకాగ్రత కలవారు, సత్కులమందు పుట్టినవారు, మహాగుణవంతులు – వీరియందు మంచి మనసు కలవారు ఆయుధధారులలో శ్రేష్ఠులు, యోధులు అయిన భృత్యులు కోట్ల కొలది నీకున్నారు. అటువంటి నీ సైన్యంలో ఏ కొద్ది భాగమో నీ ఆజ్ఞలను స్వీకరించి ముందుకు పోవుగాక! మూఢులైన ఆరాజపుత్రు లిద్దరినీ బంధించి ఇతరులకు నీ ప్రభావాన్ని చాటుదువుగాక!"

రావణుడు విభీషణుని ఉత్తమమైన మాటలను బుద్ధి పూర్వకంగా స్వీకరించాడు.

దశకంఠుడు విభీషణుని మాటలు విని దేశానికి కాలానికి అనుగుణ్యమైన మాటలు తమ్ముడితో బదులు పలికాడుః

"నువ్వు సమంజసంగానే చెప్పావు. దూతను చంపడం నింద్యమే. తప్పకుండా వధాదండన కాకుండా మరొకటి ఇతనికి విధించవలసింది. కోతులకు ఇష్టమైన అలంకారం తోకయే. ఈ వానరుని తోకను తొందరగా తగుల బెట్ట వలసింది. తోక కాల్చిన కోతి వెళ్లవచ్చు. ఈ దీనుడిని, శరీరభాగాలు వికారం చెంది కృశించిన వాడిని, ఇతనిని మిత్రులు జ్ఞాతులు అందరు బంధువులు, మంచి వాళ్లందరూ చూచెదరుగాక!"

"నగరమంతా చతుష్పథాలు సహితంగా కాలుతున్న తోకతో నున్న ఈ

వానరునితిప్పుదురుగాక!" అంటూ రాక్షసరాజు ఆజ్ఞాపించాడు.

రావణుని మాటలు విని రాక్షసులు కోపంతో హనుమంతుని తోకకు చినిగిన గుడ్డ పీలికలు చుట్టారు. తోకను నూనెతో తడిపి దానికి నిప్పు పెట్టారు. తోక బాగా మండుతుంటే రాక్షసులు ఆ వానరుని విడిచి పెట్టారు. హనుమంతుడు తీవ్రమైన కోపం పొందాడు.

బాగా కాలుతున్న హనుమంతుని తోకను చూడడానికి స్త్రీలు బాలురు తోడురాగా రాక్షసులు పోయారు. వాళ్లందరూ తిరిగి అతనిని బంధించారు. అపుడు హనుమంతుడు ఆలోచించాడు:

"నేను బంధింపబడినా రాక్షసులు నన్ను నిగ్రహించడానికి సమర్థులు కారు. బంధనాలను తెంపుకొని పైకెగిరి వీరిని మళ్లీ చంపుతాను. ప్రభువు హితం కోసం అతని ఆజ్ఞానుసారంగా చరిస్తూ ఉంటే ఈ దురాత్ములు నన్ను బంధిస్తున్నారు. నేను వీరికి ప్రతీకారం చేయలేదు. నేను ఈ రాక్షసులనందరినీ యుద్ధంలో చంపగలను. కాని రాముని ప్రీతికోసం అటువంటి పనిచేయడానికి ఇష్టపడను. వీరి పనులు ఓర్చుకుంటాను. లంకలో మరల సంచరించడం ప్రాప్తమవుతున్నది. కోటలో జరిగే పనులు రాత్రి పూట నేను బాగా చూడలేదు. కాబట్టి రాత్రిగడచి పోయే వేళ లంకను తప్పకుండా చూస్తాను. నన్ను బంధించినది చాలక నా తోకకు నిప్పంటించారు. రాక్షసులు నన్ను పీడింతురుగాక! నా మనసుకు మాత్రం శ్రమ కలుగడం లేదు."

అపుడు రాక్షసులు హనుమంతుని పట్టుకొని సంతోషంతో బయలు దేరారు. శంఖాలను ఊదుతూ భేరీలను వాయిస్తూ అనిని నగరంలో త్రిప్పారు. హనుమంతుడు రాక్షసుల మహానగరాన్ని సంచరించాడు. విచిత్రాలైన విమానాలను చూశాడు. మూసి యుంచిన భూమిభాగాలను, బాగా విభజింపబడిన వాకిళ్లను చూశాడు. రెండు వేపులా యిళ్లున్న వీథులను, చతుష్పథాలను, పెద్ద వీథులను, సందు గొందులను, చిన్న యిళ్లను, లోపలిద్వారాలను, మేఘాలవలె ఎత్తుగా నున్న యిళ్లను హను మంతుడు చూశాడు.

రాక్షసులందరూ ఆ కపిని చారుడని పిలవడం మొదలు పెట్టారు. స్త్రీ బాలవృద్ధులు అతనిని చూడడానికి కుతూహలంతో పైకి వచ్చారు - అతని

మండుతున్న తోకను చూడాలని వచ్చారు.

హనుమంతుని తోక మండుతుంటే రాక్షసస్త్రీలు సీతాదేవికి అప్రియమైన వార్తను చెప్పారు.

"ఓ సీతా! ఎఱ్ఱటి ముఖం కల ఏ కోతి నీతో మాట్లాడిందో దానిని, తోక కాలుతుంటే, తిప్పుతున్నారు."

తన ప్రాణాలను హరించునంతటి క్రూరమైన ఆ మాటలు విని దుఃఖించి సీతాదేవి అగ్ని దేవుని ప్రార్థించింది. ఆమె హనుమంతుడి శుభం కోరింది.

" ఓ అగ్నిదేవుడా! నేను పతిసేవ చేసిన దాననైతే, తపస్సును ఆచరించి నట్లయితే, ఒకే భార్యయను నియమమునకు చెందిన దాననైతే హనుమంతుని యందు చల్లారవలసింది. ధీమంతుడైన నా భర్తకు కొంచెమైన నా యందు దయ ఉన్నట్లయితే నా భాగ్యం ఇంకా మిగిలిఉంటే హనుమంతుని యందు చల్లార వలసింది. నేను పతివ్రతనై నా భర్త యొక్క సమాగమానికి ఎదురు చూస్తున్నట్లయితే ఆ ధర్మాత్ముడైన రాముడు ఆ విషయం తెలుసుకున్నట్లయితే హనుమంతుని యందు నువ్వు చల్లారవలసింది. నన్నే కాని సత్యవ్రతుడైన సుగ్రీవుడు ఈ దుఃఖ సముద్రం నుండి కాపాడితే హనుమంతుని యందు చల్లారవలసింది."

అపుడు వేడియైన మంటలు కల అగ్నిదేవుడు తీవ్రత తగ్గిన వాడై సీతాదేవికి శుభం తెలుపు తున్నట్లు మండినాడు. హనుమంతుని తండ్రియైన వాయుదేవుడు కూడా తోకనున్న అగ్నితో కలిసి మంచుగాలివలె చల్లనై సీతాదేవికి సుఖం సమ కూరుస్తూ వీచాడు.

తనతోక తగుల బడుతుంటే హనుమంతుడు ఈ విధంగా ఆలోచించాడు:

"బాగా మండుతున్న ఈ అగ్ని నన్నెందుకు అంతటా కాల్చడం లేదు? చూస్తే ఇది మహాజ్వాలగా కనిపిస్తున్నది. కాని నాకు బాధ కలిగించడం లేదు. శిశిరమందలి చల్లదనం నాతోకయందు వ్యక్తమవుతున్నది. నేను ఎగురుతున్నప్పుడు నేనేది చూశానో ఆ విధంగా ఇప్పుడు కూడా వ్యక్తమవుతున్నది. ఇది రాముడి ప్రభావం. సముద్రుని యందు పర్వత మొకటిలేచి ఆశ్చర్యం కలిగించింది. సము ద్రుడికి మైనాకుడికి ఏ విధంగా రామకార్యమందు ఆసక్తి కలిగిందో ఆ విధంగా

అగ్నిదేవుడు కూడా సహకారం చేస్తున్నాడు. సీతాదేవి సౌమ్యత చేతను, రాముని తేజస్సు చేతను, నాతో నా తండ్రికి గల స్నేహం చేతను అగ్నిదేవుడు నన్ను దహించడం లేదు."

తిరిగి హనుమంతుడు ఆలోచించి రాక్షసుల సంచారం లేని ఎత్తుగా నున్న పురద్వారం చేరుకున్నాడు. పర్వతం వలె నున్న అతడు ఒక్కసారి చిన్నవాడుగా మారి కట్ల నుండి బయట పడ్డాడు. బంధాలనుండి విముక్తుడై హనుమంతుడు పర్వతం వలె పెరిగిపోయాడు. అపుడుతోరణం దగ్గిరనున్న ఇనుప గుదియ అతని కళ్ల బడింది. దానిని తీసుకొని అతడు కాపలా కాసే వారి నందరినీ దానితో మోది చంపాడు.

హనుమంతుడు వాళ్లనందరినీ చంపి మళ్లా లంకాపట్టణాన్ని చూస్తూ తోక నుండి వెడలే మంటలను మాలికలవలె దాల్చి కిరణ సమూహంతో కూడిన సూర్యుని వలె ప్రకాశించాడు.

హనుమంతుడు తన కోరిక తీరగా లంకను చూస్తూ పెరుగుతున్న ఉత్సాహం కలవాడై మిగిలిన పని గురించి ఆలోచించాడు.

"మళ్లీ ఈ రాక్షసులకు దుఃఖం కలిగించే పని ఏది మిగిలి ఉంది? అశోకవనం నాశనం చేయబడింది. శ్రేష్ఠులైన రాక్షసులు చంపబడ్డారు. సైన్యం కూడా కొంతవరకు నాశనమయింది. ఇక కోటను పాడుచేయడమే మిగిలిపోయింది. ఈ పని నాకు సుఖమిస్తుంది. కొద్దిపాటిప్రయత్నంతో నా శ్రమ ఫలిస్తుంది. నాతోక మీద ఏ అగ్ని వెలుగుతున్నదో దానికి సంతర్పణగా ఈ ఉత్తమ గృహాలను అర్పించడం న్యాయమైన పని."

అపుడు మహా వానరుడు మండుతున్న తోకతో ఆ భవనాల పైభాగాల యందు సంచరించాడు.

హనుమంతుడు ప్రహస్తుని యింటివద్ద దిగి అగ్నిని నిక్షేపించాడు. మహాపార్శ్వుని యింటివద్ద ప్రళయాగ్ని శిఖల వంటి నిప్పును విడిచాడు. ఆ విధంగానే వజ్రదంష్ట్రుని యింటికి ఎగిరాడు. మహాకపి, తేజశ్శాలియైన శుకుని యింటిని, ధీమంతుడైన సారణుని యింటిని, అట్లే ఇంద్రజిత్తు ఇంటిని వానర

యూథపుడు దహించాడు. పిమ్మట జంబుమాలి, సుమాలుల భవనాలు కాల్చాడు.

రశ్మికేతుని భవనం, సూర్యశత్రుడిది, హ్రస్వకర్ణుడు మొదలయిన వార్ల భవనాలను, విభీషణుడి గృహం మాత్రం విడిచి పెట్టి మిగిలిన వార్ల భవనాలను, వానరపుంగవుడు దహించాడు. ఆ గొప్ప భవనాలలోని సంపన్నులైన వారి సంపదను హనుమంతుడు కాల్చివేశాడు. రావణుని గృహాన్ని సమీపించి, సర్వ మంగళ లక్షణా లతో శోభిల్లుతున్న ఆముఖ్య భవనమందు తన తోక కున్న మండు తున్న అగ్నిని విడిచి పెట్టి ప్రళయకాలమేఘంవలె వీరుడైన హనుమంతుడు నాదం చేశాడు.

అగ్నిదేవుడు ప్రళయకాలపుటగ్ని వలె వృద్ధి పొందాడు. వారి వారి యిండ్లకు మండుతుండే అగ్నిని వాయువు ప్రాకించాడు. అపుడు గొప్ప భవనాలు కూలిపోయాయి.

ఉత్సాహం, సంపద నాశనం కాగా రాక్షసులు తమ తమ యిండ్లను కాపాడు కోడానికి పరుగెత్తారు.

"ఓహో! కోతి రూపాన్ని ధరించి అగ్నిదేవుడే వచ్చాడు" ఈ విధంగా పాలు త్రాగుతున్న బిడ్డలు కల తల్లులు ఏడుస్తూ తొందరగా పడిపోయారు.

అగ్నిదేవుడు ఎండిన కట్టెలతో కాని, గడ్డితో కాని తృప్తి చెందలేదు. ఆ విధంగానే హనుమంతుడు రాక్షసభవనాలలో అగ్ని పడవేయడంతో తృప్తి చెంద లేదు. అట్లే చనిపోయిన రాక్షసులతో భూమి తృప్తి చెందలేదు.

అగ్నిశిఖలు ఒక చోట మోదుగపూలవలె ఉన్నవి. ఒక చోట బూరుగు పూలవలె ఉన్నవి. ఇంకొక చోట కుంకుమను పోలి ఉన్నవి. ఆ శిఖలు ఆ విధంగా ప్రకాశించాయి.

ఆ మహాగ్ని కోటిమంది సూర్యులకు సమానమైన గొప్ప వెలుగు కలది. అది లంకనంతటిని చుట్టుకొని ఉంది. పిడుగులకుసమానమైన చప్పుళ్లతో బ్రహ్మాం డాన్ని బద్దలు చేస్తున్నట్లు వృద్ధి పొందింది.

"ఇతడు వజ్రాయుధం ధరించిన దేవతల ప్రభువైన దేవేంద్రుడో, లేక సాక్షాత్తు యముడో, వరుణుడో, వాయుదేవుడో, రుద్రుడో, అగ్నిదేవుడో, సూర్యుడో,

కుబేరుడో, చంద్రుడో అయి ఉండాలి. కాని ఇతను వానరుడు కాడు. స్వయంగా వచ్చిన యముడే ఇతడు.

"రాక్షసుల నాశనం కోసం వచ్చిన మహాతేజమూ, అనన్యమూ అవ్యక్తమూ అచింత్యమూ ఏకమూ అయిన వైష్ణవ తేజం తనమాయచేతనే కపి రూపం ధరించి ఇక్కడికి వచ్చిందా?"

చాల మంది రాక్షసులు గుంపులుగా చేరి ఈ విధంగా అన్నారు.

"ఓ తండ్రీ! ఓ కొడుకా! ఓ ప్రియుడా! ఓయిమిత్రుడా! పుణ్యంతో భోగాలతో కూడిన జీవితమా!" రాక్షసులు అంటున్న శబ్దం చాలఘోరమై మహా భయంకరమై వినిపించింది.

చాలమంది రాక్షసులను చంపి, చాలచెట్లు కల అశోకవనాన్ని విరిచి, రాక్షసుల భవనాల యందు అగ్నిని విడిచి పెట్టి మహాత్ముడైన హనుమంతుడు మనసుతో రాముని కోసం పోయాడు.

శ్రేష్ఠుడైనట్టి వాయుదేవుని కుమారుని దేవతాగణాలు పొగడాయి.

వానరోత్తముడు మహాకపి అయిన హనుమంతుడిని చూసి సర్వభూతాలు ప్రళయాగ్ని అని భయం చెందాయి.

అందరు దేవతలు, మునిపుంగవులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు యక్షులు; గొప్పవైన సర్వప్రాణాలు సాటిలేని ఆనందాన్ని పొందారు.

హనుమంతుడు లంకను బాగా కాల్చి అపుడు సముద్రమందు తనతోక కున్న నిప్పును ఆర్పాడు.

లంక బాగా కాలుతున్నది. ధ్వంసం చేయబడింది. రాక్షసుల గుంపులు భయపడ్డారు. ఆ నగరాన్ని చూడగా హనుమంతునికి గొప్ప భయం కలిగింది. తన్ను తానే నిందించుకుని అతడీ విధంగా చింతించాడు.

"అయ్యో! ఈ లంకను తగుల బెట్టి ఎంత నింద్యమైన పని చేశాను? ఏ పురుషశ్రేష్ఠులైతే తమకు కలిగిన కోపాన్ని, మండుతున్న నిప్పును నీటితో చల్లార్చినట్లు, తమ బుద్ధితో నిరోధిస్తారో, ఆ మహాత్ములు ధన్యులు కదా!

"కోపంగలవాడు పాపం చేయకుండా ఉంటాడా? కోపంతో పెద్దలను కూడా చంపుతాడు. కోపించిన మనుష్యుడు కఠినమైన మాటలతో సజ్జనులను ఆక్షేపిస్తాడు. బాగాకోపం చెందినవాడు ఏది మాట్లాడాలో ఏది మాట్లాడ కూడదో తెలియలేడు. కోపించిన వాడు చేయరాని పనిలేదు. అతనికి పలుకరాని మాట కూడా లేదు. ఎవరయితే తనలో పెల్లుబికిన కోపాన్ని ఓర్పుతో, పాము తన చినిగిన పొరను తొలగించుకొన్నట్లు, తొలగించుకుంటాడో అతనినే పురుషు డంటారు.

"నేను బాగా దుర్బుద్ధి కలవాడిని, లజ్జ లేనివాడిని, పాపం ఆచరించిన వాడిని. నాకు క్షేమం కలుగదు. ఆలోచింకుండా స్వామిఘాతుకుడనై ఆ సీతాదేవిని దహించాను. లంకంతా కాలిపోతే తప్పక ఆర్యయైన సీతాదేవి కాలిపోయి ఉంటుంది. ఆమె కాలిపోవడంతో తెలియకుండానే ప్రభువు కార్యం నాచే నాశనం చేయబడింది.

"ఏ ప్రయోజనం కోసం నా చేత ఈ పని ప్రారంభించబడిందో ఆ పని నావలననే నాశనం చేయబడింది. నేను లంకను దహించాను. కాని సీతాదేవిని రక్షించలేదు.

"నేనీ పని కొద్దిగానే చేశాను. అందుకు సందేహం లేదు. కోపం పొందిన నాచేత ఈ పనికి మూలాధారమైన దానినే నాశనం చేయడం జరిగింది. తప్పకుండా సీతాదేవి నశించే ఉంటుంది. లంకలో ఇక్కడ కాలిపోనిదేదీ కనిపించడం లేదు. ఏదో ఒక ఉద్దేశంతో పురమంతా బూడిద చేయబడింది. ఈ కార్యం వికటించినఫా నా బుద్ధి వలననే చెడిపోతే నేను ఇక్కడే ప్రాణాలు విడువగోరుతున్నాను.

"నే నిప్పుడు అగ్నిలో పడుదానా? లేక బడబాగ్నిలో పడుదునా? సముద్రంలో నివసించే జీవులకు ఈ శరీరాన్ని సమర్పించేదా?

"కార్యాన్ని పూర్తిగా చెడగొట్టిన నేను వానరరాజైన సుగ్రీవుడిని కాని, పురుష శ్రేష్ఠులైన రామలక్ష్మణులను కాని ఎలా చూడగలను?

"నా కోపం యొక్క దోషం చేత నేనీ పని చేశాను. చంచలమైన కోతి పనులు మూడులోకాలలోను ప్రసిద్ధి పొందినవి కదా!

"రాజసమైన ఈ భావం ఎందుకూ కొరగానిది, నిలుకడలేనిది. ఈ రజో

గుణం కారణంగా నేను సమర్థుడనైనా సీతాదేవిని రక్షించ లేకపోయాను.

"సీతాదేవి నశిస్తే రామలక్ష్మణులిద్దరూ నశించిపోతారు. వారి నాశనంతో, తన బంధువులతో కూడా సుగ్రీవుడు నాశన మవుతాడు. అన్నయందు అనురాగం గల ధర్మాత్ముడైన భరతుడు ఈ మాటలు విని శత్రుఘ్నునితో కూడి ఏ విధంగా బ్రతుకగలడు? ఇక్ష్వాకు వంశమందు ధర్మనిష్ఠులు సందేహం లేకుండా నాశనం పొందితే ప్రజలందరూ దుఃఖంతో పీడింపబడ్డ వారవుతారు.

"కోపం వలన దోషం నిండినవాడనై భాగ్యం లేనివాడినై ధర్మం వలన సంపాదించిన ప్రయోజనం పోయిన వాడినై లోకానికి నేను చేటు తెచ్చిన వాడినవుతాను."

ఈ విధంగా ఆలోచిస్తున్న హనుమంతుడికి శుభశకునాలు కలిగాయి. వాటిని గమనించి అతను తిరిగి ఆలోచించాడుః

"సీతాదేవి తన తేజము చేతనే రక్షింపబడినట్లయితే మంగళమూర్తి అయిన ఆమె నాశనం పొందదు. అగ్నిని అగ్ని దహించదు.

"ధర్మాత్ముడైన రాముని భార్యను, తన శీలమే రక్షణ కలిగిన సీతాదేవిని అగ్నిదేవుడు తాకడానికి అర్హుడు కాడు. రాముని ప్రభావం చేత, వైదేహి చేసిన పుణ్యం చేత, హవ్యవాహనుడు దహించే స్వభావం కలవాడైనా నన్ను కాల్చలేదు. అటువంటిది భరతుడు మొదలైన ముగ్గురు అన్న దమ్ములకు దేవత వంటిది. రామునికి మనసుకెక్కిన ప్రియురాలు, ఏ విధంగా నాశనం చెందుతుంది."

ఈ విధంగా హనుమంతుడు సీతాదేవి యొక్క ధర్మపరాయణత్వం తలంచుతూ ఉంటే మహాత్ములైన చారణుల మాటలను విన్నాడు.

"చాల భయంకరమైనది, భరించరానిది అయిన అగ్నిని రాక్షసుల యిండ్లలో విడిచి ఇతరులు చేయలేని పనిని హనుమంతుడు చేశాడు. ఈ లంక అంతా తగులబడి పోయింది. కాని జానకి మాత్రం దహింపబడలేదు. ఇది చాల ఆశ్చర్యకరమైన విషయం."

ఈ విధంగా నిదర్శనమిచ్చే శుభశకునాలతోను, ఇతరకారణాలతోను ఋషుల పలుకులతోను హనుమంతుడు ప్రీతి చెందిన మనసు కలవాడయాడు. తాను

మనసారా కోరిన పని విజయంకాగా రాజపుత్రిక అక్షత అని తెలుసుకొని, ప్రత్యక్షంగా లంకను మరొక సారి చూచి తిరుగు ప్రయాణానికి సంకల్పించాడు.

అటు పిమ్మట శింశుపావృక్షం క్రింద కూర్చున్న జానకీదేవిని అభివాదన చేసి హనుమంతుడిట్లు పలికాడుః

"నా అదృష్టం వలన నువ్వు అక్షతగా ఉండడం చూస్తున్నాను"

అపుడు తిరుగు ప్రయాణానికి సిద్ధపడుతున్న హనుమంతుని మళ్లా మళ్లా చూసి భర్తృప్రేమకు అనుగుణమైన పలుకులను సీతాదేవి ఉడివింది.

"శత్రు వీరులను చంపేవాడా! కార్యం పూర్తిగా సాధించడానికి నువ్వొక్కడివే చాలు. ఈ బలీయమైన కార్యం నీకు కీర్తిని కలిగిస్తుంది. శత్రుసైన్యాలను కల్లోల పరచే రాముడు తన బాణపరంపరచేత లంకను కల్లోలపరచి నన్ను ఇక్కడి నుండి తీసుకొనిపోతే ఆ కార్యం అతనికి తగినదిగా ఉంటుంది. యుద్ధమందు మహాశూరుడైన రాముడు విజృంభించడానికి అనుగుణమైన పని ఏది ఉంటుందో దానిని ఆచరించవలసింది."

అర్థవంతమైనది, విశ్వాసపూర్వకమైనది, హేతుబద్ధమైనది అయిన సీతాదేవి మాటను హనుమంతుడు విని బదులు పలికాడుః

"తొందరగా శ్రేష్ఠులైన కోతులు ఎలుగులు - వీరితో కూడి రాముడు వస్తాడు. అతడు యుద్ధంలో శత్రువులను జయించి నీ దుఃఖాన్ని పోగొట్టగలడు."

హనుమంతుడు తిరిగి వెళ్లిపోడానికి నిశ్చయించి సీతాదేవికి అభివాదనం చేశాడు. ప్రభువును దర్శించ వలెనన్న ఉత్సాహంతో అరిష్టమను ఉత్తమమైన పర్వతాన్ని హనుమంతుడు ఎక్కినాడు. మహావానరుడు ఉప్పు సముద్రం యొక్క దక్షిణతీరం నుండి ఉత్తరతీరం చేరడం కోసం శరీరం పెంచాడు. సముద్రాన్ని దర్శించాడు. వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు వాయుదేవునివలె ఆకాశమార్గాన దక్షిణ తీరం నుండి ఉత్తర తీరానికి పోయాడు.

శ్రీమంతమగు పర్వతం హనుమంతునిచే పీడింపబడినదై పాతాళం ప్రవేశించింది. భూమితో సమంగా లోనికి దిగిపోయింది.

కెరటాలచే కొట్టబడిన తీరం కల ఉప్పు సముద్రాన్ని అవలీలగా దాటడం

కోసం వానరుడు ఆకాశం మీదికి ఎగిరిపోయాడు.

ఆకాశమనే ఒడ్డులేని సముద్రాన్ని పెద్ద నావ సముద్రాన్ని దాటినట్లు గాలితో సమానమైన వేగం కల హనుమంతుడు శ్రమ పడకుండా దాటాడు. మేఘాల గుంపులను చీల్చుకొని మాటి మాటికి పైకి వస్తూ మేఘగర్జన వంటి గొప్పకంఠం కల హనుమంతుడు గొప్ప నాదం చేస్తూ గరుత్మంతుడి వలె ఆకాశమందు ప్రకాశించాడు.

చాల గొప్ప రాక్షసులను చంపి, తన పేరు అందరికీ వినిపించి లంకా నగరాన్ని కల్లోలం చేసి, రావణుడిని దుఃఖపెట్టి భయంకరమైన రాక్షససేనను నాశనం చేసి, విదేహరాజ పుత్రియైన సీతకు ప్రణామం చేసి, మహాతేజశ్శాలి యైన హనుమంతుడు తిరిగి సముద్రమధ్యం చేరుకున్నాడు. అతడు పర్వత రాజైన మైనాకుని చేతితో తాకి వింటిత్రాటినుండి వెలువడ్డ బాణం వలె మహావేగం పొందాడు. ఆ విధంగా కొంత దూరం పోయి మహాపర్వతం మహేంద్రగిరిని చూసి వానరోత్తముడు పెద్దనాదం చేశాడు. దానితో పది దిక్కులూ నింపి వేశాడు. ఆ ప్రదేశాన్ని చేరి తన స్నేహితులను చూడాలన్న కోరికతో తోక విదలించి పెద్దగా నాదం చేశాడు. గరుత్మంతుడు పోయే మార్గాన నాదం చేశాడు. ఆ మహాశబ్దానికి సూర్యమండలంతో కూడిన ఆకాశం బ్రద్దలయినట్లయింది.

సముద్రం యొక్క ఉత్తరతీరమందు అంతకుముందు ఉంచినట్టి వానర వీరులు హనుమంతుని గర్జన విన్నారు, అతని తొడల వేగంచే ఏర్పడిన ఘోషను విన్నారు. దీనమైన మనసులు కల వానరులు స్నేహితుని చూడవలె నన్నకోరిక కలవారై ఉత్సుకతను పొందారు.

వానర శ్రేష్ఠుడైన జాంబవంతుడు సంతుష్టి చెందిన మనసు కలవాడై అందరు వానరులను పిలిచి ఈ మాటలన్నాడుః

"హనుమంతుడు అన్ని విధాల కార్యాన్ని సాధిస్తాడు. దీనిలో సందేహం లేదు. అతడు కార్యం సాధించకపోతే మహానాదం ఈ విధంగా ఉండదు."

హనుమంతుడు చేసిన నాదాన్ని విని వానరులు సంతసించి అక్కడికక్కడ గెంతులు వేశారు. అతనిని చూడగోరిన వాళ్లై ఒక చెట్టు చివర నుండి మరొక చివరికి, ఒక పర్వత శిఖరం నుండి మరొక దానికి సంతోషంతో దూకారు.

సంజ్ఞలు చేసినట్లు పెద్దకొమ్మలను ఆడించారు.

ఆకాశం మీది మేఘం వంటి హనుమంతుడు కిందికి దిగుతుంటే వానరులందరూ చూసి అంజలి ఘటించి నిలుచున్నారు.

వేగవంతుడూ పర్వతంతో సమానమైన వాడూ అయిన వానరుడు చెట్లతో సంకులమైన మహేంద్రగిరి మీద పడ్డాడు. సంతోషంతో కొండ సెలయేటిలో హనుమంతుడు పడ్డాడు.

అందరు వానరశ్రేష్ఠులు సంతుష్టి చెందినవారై మహాత్ముడైన హనుమంతుని చుట్టూ చేరి నిలిచారు. అత్యధికమైన ప్రీతిని పొంది, ఆనందించే ముఖాలతో ఆరోగ్యవంతుడైన హనుమంతుని సమీపించారు. కందమూలాలను పండ్లను కానుకలుగా తెచ్చి అతనికి సమర్పించారు.

మహావానరుడైన హనుమంతుడు, గురువులకు, వృద్ధులకు, జాంబవంతుడు మొదలైన ముఖ్యులకు, యువరాజైన అంగదుడికి నమస్కరించాడు.

హనుమంతుడు వారిచేత పూజింపబడ్డాడు; పూజ్యులైన  వానరుల చేత ప్రసన్నుడుగా చేయబడ్డాడు. పరాక్రమవంతుడైన హనుమంతుడు 'చూశాను సీతను' అని  సంగ్రహంగా చెప్పాడు.

వాలిపుత్రుడైన అంగదుని హనుమంతుడు చేతితో పట్టుకొని మహేంద్రగిరి యందలి మనోహరమైన వనప్రదేశంలో కూర్చున్నాడు. అపుడు హనుమంతుడు హర్షంతో ఆ వానరశ్రేష్ఠులతో ఈ విధంగా  పలికాడు:

"అశోకవనం ఘోరమైన ఆకారాలు కల రాక్షసస్త్రీలచేత రక్షింప బడుతున్నది, ఉపవాసాలచేత బాగా అలసిపోయినది, పొగడదగిన శీలము కలది అయిన జనకుని కూతురు సీతాదేవిని చూశాను. ఆమె ఒంటి జడ ధరించింది. రాముని దర్శనం కోరుతున్నది. జడలు దాల్చింది. మురికిగా ఉంది, కృశించిపోయింది."

గొప్ప అర్థమిచ్చేది, అమృతంతో సమానమైనది, 'చూడబడ్డది సీతాదేవి' అన్న హనుమంతుని మాటను విని వానరులందరూ సంతోషించారు. కొందరు వానరులు సింహనాదం చేశారు. మహాబలులైన మరికొందరు గర్జించారు. కొంతమంది వానరసహజమైన కిచకిచలు పలికారు. కొంతమంది పొడవుగా నున్న తోకలను

పైకెత్తి కొట్టారు. పర్వత శిఖరాల నుండి కొంతమంది వానరులు దిగి హనుమంతుని ఆనందంతో స్పృశించారు.

అంగదుడు హనుమంతునితో అన్నాడు:

“ఓయి వానరుడా! బలమందు పరాక్రమమందు నీతో సాటియైన వాడెవ్వడూ లేడు. విస్తరించిన సముద్రాన్ని నువ్వు దాటి వచ్చావు. అహో! ప్రభువుపై నీ భక్తి ఎంతది? నీ పరాక్రమమెంతది? అదృష్టం వలన యశస్వినియైన రాముని భార్యను నువ్వు చూశావు. భాగ్యవశాన, సీతాదేవి ఎడబాటు వలన కలిగిన శోకాన్ని రాముడిప్పుడు విడిచిపెడతాడు.”

పిమ్మట వానరులు అంగదుని హనుమంతుని జాంబవంతుని చుట్టుకొని విశాలమైన శిలల మీద కూర్చున్నారు. సముద్రాన్ని దాటడం, లంకను సీతను రావణుని దర్శించడం - వీటి గురించి విన కోరిక గలవారై వానరశ్రేష్ఠులు చేతులు జోడించి హనుమంతుని ముఖం చూస్తూ ఉన్నారు. అంగదుడు వారి మధ్య ఇంద్రుడివలె కూర్చున్నాడు.

అపుడు జాంబవంతుడు సంతోషంతో పులకించినవాడై హనుమంతుని, అతను చేసిన కార్యం గురించి అడిగాడు.

“నువ్వు ఎలా సీతాదేవిని చూశావు? ఆమె అక్కడ ఎలా ఉంది. క్రూరుడైన దశకంఠుడు ఆమె పట్ల ఏ విధంగా ప్రవర్తిస్తున్నాడు? ఆ విషయమంతా సమగ్రంగా, ఓ మహావానరా చెప్పవలసింది. విన్న తరువాత మళ్లా ఏ పని చేయాలోఆలోచించు దాము. మేము కిష్కింధకుపోయి ఏమి చెప్పాలి? ఏది చెప్పకుండా ఉంచాలి? అదంతా నువ్వు మాకు వినిపించవలసింది.”

ఆ విధంగా వారిచేత ఆదేశింపబడినవాడై హనుమంతుడు పులకించిన శరీరం కలవాడై సీతాదేవికి శిరసుతో ప్రణామం చేసి ఇట్లు పలికాడు:

“నేను మీ అందరి ఎదుటే మహేంద్రగిరి శిఖరాన్ని ఎక్కి సముద్రం యొక్క దక్షిణతీరం చూడడానికి సన్నద్ధుడనయాను...”

తరువాత హనుమంతుడు మైనాకుని వృత్తాంతం చెప్పాడు. కామరూపిణి యైన సురస నోటిలో ప్రవేశించి తిరిగి పైకి రావడం గురించి చెప్పాడు. సింహికా

సంహారం గురించి విన్నవించాడు. లంకాపురిని ప్రవేశించిన దగ్గిర నుండి, సీతాదేవి నుండి సెలవు తీసుకున్న వరకు జరిగిన సంగతులను సంక్షేపంగా నివేదించాడు.

చివరను అన్నాడు:

"రాముని ప్రభావంచేత, మీ యొక్క తేజస్సుచేత, సుగ్రీవుని కార్యం గురించి ఈ పని అంతా నాచే చేయబడింది. అక్కడ నేను చేసినవన్నీ, ఉన్నవి ఉన్నట్లుగా నివేదించాను. అక్కడ ఏ పని చేయబడలేదో దాని నంతటినీ చేయవలసి ఉంది."

మళ్లీ హనుమంతుడు మిగిలిన విషయం చెప్పడానికి ఆరంభించాడు:

"రాఘవుని కార్యం సఫలమయింది. సుగ్రీవుని ఉత్సాహం కూడా ఫలించింది. సీతాదేవి శీలాన్ని తెలుసుకొని నా మనసు కూడా పరవశమయింది. రాక్షస ప్రభువైన రావణుడు తన తపస్సు చేతనే లోకాలను ధరించగలడు. అతడు కోపించితే లోకాలను దగ్ధం చేయగలడు. అతడు అన్ని విధాల తన తపోబలంచేత వృద్ధి పొందినవాడు. అటువంటి రావణుడు ఆమె శరీరాన్ని తాకినా తన తపస్సు చేతనే నాశనం పొందలేదు. సీతాదేవికికోపం వస్తే ఆమె శరీరాన్ని తాకినందుకు రావణుడు మండిపోతాడు. అగ్ని కూడా ఆ పని చేయలేదు.

"జాంబవంతుడు మొదలైన మహావానరుల అనుజ్ఞ పొంది అయిన పని అంతా మీకు నివేదించి, సీతాదేవిని మనతో తీసుకొని ఆరాజపుత్రులనిద్దరినీ చూడడం సరియైనది. నేనొక్కడినే రాక్షసులుండే లంకాపురిని ఆక్రమించి రావణుని చంపడానికి సరిపోతాను. వీరులు, ధీమంతులు, అస్త్రధారులు, శూరులు, విజయాన్ని కోరేవారు అయిన మీ వంటి వానరులు కలిస్తే జయించ గలనని మళ్లా చెప్పాలా?

"నేను రావణుని, యుద్ధమందు పుత్రులతో సోదరులతో కలిపి వధిస్తాను. బ్రహ్మాస్త్రం మొదలైన దివ్యాస్త్రాలను యుద్ధమందు ఇంద్రజిత్తు ప్రయోగిస్తే వాటి నన్నిటిని నేను నిష్ఫలం చేయగలను. రాక్షసులను చంపుతాను. మీరు అనుమతిస్తే రావణుని నాశనం చేస్తాను. యుద్ధమందు నేను రాళ్ళ వర్షం కురిపిస్తే దేవతలే చచ్చి పోతారు. రాక్షసుల సంగతి చెప్పేదేముంది!

"సముద్రం చెలియలి కట్ట దాటవచ్చు. మందరపర్వతం బాగా కదిలి

పోవచ్చు. కాని శత్రువుల సేనావాహిని యుద్ధంలో జాంబవంతుని కంపించలేదు. రాక్షస సంఘాలను వారికన్న పైవారైన రాక్షసులను నాశనం చేయడానికి వీరుడైన అంగదుడు చాలును. పనసుడు, నీలుడు - వీరి తొడలవేగానికి మందరపర్వతం కూడా ముక్కలవుతుంది. అటువంటప్పుడు యుద్ధంలో రాక్షసుల సంగతి చెప్పాలా?

"మైందుడు ద్వివిదుడు అశ్వనీ దేవతలకు పుట్టినవారు. వీరు అమృతాన్ని త్రాగినవారు. వీరు కోపించితే లంకను నాశనం చేయడానికి సమర్థులు.

"నేను లంకను నాశనం చేశాను. తగులబెట్టాను - బూడిద చేశాను. రాజ మార్గాలలో నా పేరు మారు మ్రోగింది. దురాత్ముడైన రావణుని అశోకవనంలో శింశుపావృక్షం క్రింద సాధ్వియైన సీతాదేవి దీనమైన స్థితిలో ఉంది. ఆమె రాక్షస స్త్రీల చేత చుట్టబడి ఉంది. విచారంతోను దుఃఖంతోను పీడింపబడుతున్నది. నిర్బంధంలోనున్న సీతాదేవి రావణుని తలంచదు. మంగళమూర్తియైన సీతాదేవి రాముని యందు అన్ని విధాల అనురక్తయై ఉంది. ఆమె ఒకే వస్త్రం ధరించింది. ఆమె శరీరం ధూళిచేత కప్పబడి ఉంది. విచారం చేత దుఃఖంచేత దీనమైన అవయవాలు కలదై ఆమె భర్త యొక్క హితమునే కోరుతున్నది. ఆమె రాక్షస స్త్రీల మధ్య మాటి మాటికి బెదరింపబడుతునే ఉంది. అంతఃపుర స్త్రీలు సంచరించే ఉద్యానవనమందు రాక్షసాంగనల మధ్య ఆమెను చూశాను.

"సీతాదేవి ఒంటి జడ ధరించింది. దీనురాలుగా ఉంది. పతిని ధ్యానిస్తూ ఉంది. నేల మీద పండుకుంటున్నది. ఆమె కాంతి తరిగి, హేమంతఋతువు వస్తే తామరపూవు ఏ విధంగా ఉంటుందో అలా ఉంది.

"ఆమె రావణుని నుండి మరలిపోదలచింది. చనిపోవాలని నిశ్చయించుకుంది. అటువంటి సీతాదేవి ఏదో విధంగా నా యందు విశ్వాసం ఉంచింది. ఆమెతో నేను మాట్లాడాను. విషయమంతా తెలియజేశాను. రామసుగ్రీవుల స్నేహం గురించి విని ఆమె చాల సంతోషించింది.

"ఆమె యొక్క సత్ప్రవర్తన నియమబద్ధంగా ఉంది. భర్తయందు ఆమెకు గల భక్తి అచంచలమైనది. తప్పుచేసిన దశకంఠుని ఆమె చంపలేదంటే అతడు మహాత్ముడే అనుకోవచ్చు. రావణుని వధకు రాముడు కేవలం నిమిత్తమాత్రుడే.

"సీతాదేవి సహజంగా కృశించిన శరీరం కలది. ఇపుడు రాముని ఎడబాటు

చేత మరింత చిక్కిపోయింది. ఆరంభశూరుని విద్యవలె చిక్కిపోయింది.

"ఈ విధంగా మహాపతివ్రతయైన సీతాదేవి ఎప్పుడూ దుఃఖించుతునే ఉంది. కాబట్టి ఇప్పుడేది చేయాలో దానిని తొందరగా నిర్ణయించవలసింది."

హనుమంతుడి మాటలు విని వాలిపుత్రుడైన అంగదుడు ఇట్లన్నాడుః

"ఓ వానరులారా! సీతాదేవిని చూసి ఆమెను తీసుకొని పోకుండా మహాత్ముడైన రాముని సమీపానికి మనం వెళ్లడం సరియైన పనికాదు. మీరందరూ ప్రఖ్యాత విక్రములు 'చూడబడింది సీతాదేవి. తీసుకొని రాబడలేదు' అని అక్కడ మీరందరూ నివేదించడం తగదని నాకు అనిపిస్తుంది. ఎగరడంలోకాని పరాక్రమంలో కాని లోకంలో హనుమంతునికిసాటియైనవారు లేరు. ఈ హనుమంతుని చేతనే రాక్షసవీరులు సంహరింపబడ్డారు. ఇప్పుడు మనం చేయవలసినపని వేరే ఏముంది? మనం సీతాదేవిని తీసుకొని రాముడి దగ్గిరికి పోదాం."

జాంబవంతుడు కృతసంకల్పుడైన అంగదునితో, పరమప్రీతుడై, అర్థవంతమైన మాటలు పలికాడుః

"ఓ రాజపుత్రుడా! నువ్వు ఏ విధంగా తలంచావో అది ప్రయోజనకారి కావచ్చు. కాని ఆ విధంగా చేయవద్దు. రాముని మనసు ఏ విధంగా నిలిచిందో ఆ ప్రకారం నువ్వు కార్యసిద్ధికి ప్రయత్నంచేయవలసింది."

జాంబవంతుని మాటలు అంగదుడు మొదలైన వీరులు, మహాకపి హను మంతుడు, ఇతరవానరులు అంగీకరించారు.

వానరులందరూ సంతుష్టిని చెంది హనుమంతుని ముందుంచుకొని మహేంద్ర గిరిని విడిచి పైకెగిరిపోయారు. ఆ వానరులు మందరపర్వం మేరు పర్వతంతో సాటియైన వాళ్లు, మహాగజాలవలె మదించిన వాళ్లు, మహాశరీరాలు కలవాళ్లు;వాళ్లు ఆకాశాన్ని కప్పినట్లు ఎగురుతున్నారు.

వాళ్లందరూ రాముని ప్రియురాలి వృత్తాంతం తెలుపడానికి తొందరపడుతున్న వాళ్లే. రాముడు చేసే ప్రతీకారచర్యకు నిశ్చయమైన మనస్సులు కలవారే.

వానరులు సుగ్రీవుని కోసం కాపాడబడుతున్న మధువనం చేరుకున్నారు.

దానిని కాపాడుతున్న దధిముఖుడు సుగ్రీవుని మేనమామ. ఆ వనం చేరుకొని వానరులందరూ ఉగ్రంగా మారిపోయారు. గొప్పదైన మధువనాన్ని చూసి తేనె త్రాగడానికి అంగదుని అనుమతి కోరారు.

జాంబవంతుడు మొదలైన ముఖ్య వానరులను, వృద్ధులను అంగదుడు అనుమతి ఇవ్వమని కోరి, పిమ్మట వానరులకుతేనె త్రాగడానికి అనుమతి నిచ్చాడు.

వానరులు అంగదుని అనుమతిని పొంది నృత్యం చేయడానికి మొదలు పెట్టారు. కొంతమంది పాడారు. కొంతమంది ప్రణామాలు చేస్తున్నట్లు వంగారు. కొంతమంది హెచ్చుగా నవ్వసాగారు. కొందరు పడిపోయారు. కొందరు అటూ ఇటూ తిరిగారు. కొందరు ఎగిరారు, కొందరు వదరడం మొదలు పెట్టారు.

మధువు బాగా త్రాగి మత్తెక్కి విపరీతమైన చేష్టలు చేస్తూ ఆ వానరసైన్యం వ్యాకులమయిపోయింది. వాళ్లలో మత్తెక్కని వాడుకొని, మధువు త్రాగడంలో తృప్తి పొందనివాడు కాని లేడు.

మధువనం భక్షింపబడుతూ ఉంటే దధిముఖుడు చూసి కోపంతో అడ్డుకున్నాడు. కొంతమందిని సమీకరించి జగడమాడాడు. కొందరిని సామ్య వాక్యాలతోబుజ్జగించాడు; బలంగా వారిని ఎదుర్కొన్నాడు.

వానరులందరూ కలిసి భయం లేనివాళ్లై దధిముఖుని యందు దోషం లేకపోయినా పీడించారు. గోళ్లతోను దంతాలతోను అతనిని రక్కారు. అరచేతులతోను కాళ్లతోను మోదారు. ఆ మహావనంలో మరేవీ లేకుండా ఆ వానరులు చేశారు.

హనుమంతుడు ఆ వానరులతో ఇలా అన్నాడుః

"ఓ వానరులారా! తొందరపడకుండా మధువు సేవించండి. మీ శత్రువులను నేను అడ్డుకుంటాను."

వానరుల ప్రభువైన అంగదుడు హనుమంతుని మాటలు విని ప్రసన్నుడై అన్నాడుః "వానరులు మధువు త్రాగుదురుగాక! హనుమంతుడు రాముని కార్యం నిర్వహించుకొని వచ్చాడు. అతని పలుకులు అకార్యాన్ని సూచించినా ఆచరించ దగినవే. అటువంటప్పుడు ఈ మాటల గురించి వేరే చెప్పాలా?"

వానరశ్రేష్ఠులు అంగదుడి నోటి నుండి ఈ మాటలు విని బాగు బాగని ప్రశంసించి ఆనందించారు. అంగదుని వారందరూ పూజించి మధువనం ప్రవేశించారు. పాలకులను బలవంతంగా ఆక్రమించారు. అంగదుడు మధుపానానికి అనుజ్ఞనిచ్చాడు. సీతాదేవిని చూసి ఆమె గురించి విన్న సంతోషంతో అందరూ మధువును పానం చేశారు. తీయని పండ్లను తిన్నారు.

మధువనం ప్రవేశించిన వందలకొలది వానరులు తమ పైకి వచ్చిన వనపాలకులను కొట్టడం మొదలుపెట్టారు. తూములంత తేనె తెట్టెలను వారు చేత బట్టుకొని అందరూ ఒక చోట చేరి పానం చేశారు. తరువాత వాటిని విరుగగొట్టారు. మరికొందరు తేను పట్టులతో ఒకరి నొకరు కొట్టుకున్నారు. మధుపానంతో సంతోషించిన వానరులు ఒకరిమీద ఒకరు పడ్డారు, సింహనాదం చేశారు కొంతమంది. మధువుచేత మత్తులైన వానరులు కొందరు నేల మీద నిదురించారు. కొందరు చేయరాని పని చేసి నవ్వుతున్నారు. వానరులు కామక్రీడలలో ఆసక్తులయారు.

దధిముఖుడు ఇతర వనపాలకులను పంపించాడు. వాళ్లను వానరులు మోకాళ్ల పట్టి లాగారు. దేవమార్గం చూపించారు. వాళ్లు దధిముఖుడి దగ్గిరికి పోయి జరిగినది చెప్పారు. మధువనం పాడయిందని దధిముఖుడు విని చాల కోపించాడు. వన పాలురు, వచ్చిన వానరులను, దధిముఖుని ఆజ్ఞను పాటించి ఎదుర్కొన్నారు. దధిముఖుడు కోపంగా ఉండడం చూసి హనుమంతుడు మొదలైన వానరశ్రేష్ఠులు అతని మీదికి పోయారు. మదాంధుడైన అంగదుడు కోపించి తాతను కొట్టి, భూమి మీదకు తోసి భుజాలతో పొడిచాడు.

విరిగిన చేతులు తొడలు భుజాలు కలవాడై నెత్తురుకారి నట్లు కొట్టబడినవాడై దధిముఖుడు ఒక క్షణం మూర్ఛపోయాడు. తొందరగా తెలివి తెచ్చుకొని వానరులను కఱ్ఱతో త్రోలివేశేడు. ఆ వానరుల నుండి తప్పించుకొని తన భృత్యులతో ఇట్లు పలికాడు:

"వీళ్లను ఇక్కడే ఉండనీయండి. అంగదుడు చేసిన తప్పునంతా మన ప్రభువుతో చెప్తాను. అతను రాముడితో ఉన్నాడు. అతడు ఈ వానరులనందరినీ, స్నేహితులతో కూడా దండన విధించి చంపిస్తాడు."

మహాబలుడైన దధిముఖుడు కనురెప్ప పాటులో సుగ్రీవుడు ఉన్న చోటు చేరుకున్నాడు.

రాముడిని, లక్ష్మణుడిని, సుగ్రీవుడిని చూసి ఆకాశం నుండి భూమికి దధిముఖుడు దిగాడు. సుగ్రీవుడి మంగళకరములైన పాదాలు తగిలేటట్లు శిరస్సుతో అతనికి ప్రణామం చేశాడు.

తలను భూమికి ఆన్చి మ్రొక్కిన వానరుని వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు చూసి కలత చెందిన మనసు కలవాడై ఇట్లన్నాడుః

"ఓయి వీరుడా! లే!లే! ఎందుకు నా పాదాల మీద పడ్డావు? నీకు అభయమిస్తున్నాను. జరిగినందంతా చెప్పవలసింది."

సుగ్రీవుని చేత విశ్వసింపబడిన వాడై దధిముఖుడు లేచి ఇట్లు పలికాడుః

" నీ తండ్రియైన ఋక్షరజస్సు కాలంలో కాని, నీ పరిపాలనలో కాని, నీ అన్న వాలి పరిపాలనలో కాని, మధువనం ఈ విధంగా నాశనం చేయబడలేదు. దానినిప్పుడు ఆ వానరులు భగ్నం చేసి మధువు భక్షించారు. వనపాలురు వారిని బెదరించినా వాళ్లు మధువు తింటున్నారు, త్రాగుతున్నారు. త్రాగినంత త్రాగి మిలినది పారబోస్తున్నారు. వారిని అడ్డగిస్తే కనుబొమలు చూపుతున్నారు. చాలమంది వీరులు వనపాలురను తరిమి వేశారు. కొంత మందిని చేతులతో కొట్టారు. కొంతమందిని మోకాళ్లతో మోదారు. కొంతమందిని ఇష్టం వచ్చినట్లు లాగారు. వారికి దేవమార్గం చూపించారు. నువ్వు మాకు ప్రభువై ఉండగా ఈ శూరులను కొట్టి, మధువనాన్ని హెచ్చుగా భక్షించారు."

సుగ్రీవునికి దధిముఖుడు ఈ విధంగా విన్న విస్తూ ఉంటే బుద్ధిశాలి అయిన లక్ష్మణుడు అతనిని అడిగాడుః

"ఓయి రాజా! ఈ వనపాలుడైన వానరుడు నీ దగ్గిరికి ఎందుకు వచ్చాడు? ఏ ప్రయోజనం కోసం దుఃఖంతో మాట్లాడుతున్నాడు."

సుగ్రీవుడు ఈ విధంగా బదులు పలికాడుః

"ఆర్యుడవైన లక్ష్మణా! దక్షిణ దిశను వెదకి వచ్చిన వానర శ్రేష్ఠులైన

అంగదుడు మొదలైన వానర వీరులు మధువు భక్షించారు. ఈ విధంగా చేయరాని పనులకు ప్రారంభం జరిగింది.

"వానరులు కార్యం సాధించారు కాబట్టే మధువనంలోకి ప్రవేశించారు. సీతాదేవి హనుమంతుడిచేతనే చూడబడింది. కార్యసిద్ధి పట్టుదల, పరాక్రమం, విద్య - ఇవన్నీ ఆ వానరశ్రేష్ఠునియందున్నవి. ఎక్కడయితే జాంబవంతుడు నాయకుడుగా ఉంటాడో, మహాబలుడైన అంగదుడుంటాడో, హనుమంతుడు సహాయకారిగా ఉంటాడో ఆ పని విజయం తప్ప మరో విధంగా అవదు. అంగదుడు మొదలైన వీరులు మధువనాన్ని పాడు చేశారు. వనపాలురు వారిస్తే వాళ్ళను మోకాళ్ళతో మోదారు. ప్రఖ్యాతవిక్రముడైన దధిముఖుడను పేరు గల వానరుడు నా దగ్గిరికి వచ్చి ఈ వృత్తాంతం చెప్పాడు.

"ఓ మహాబాహువైన సౌమిత్రి! సీతాదేవిని వీళ్లు చూశారు. సీతాదేవిని చూడకుండా వరమీయబడిన ఈ మధువనంలోకి వానరులు ప్రవేశించరు."

చెవులకు సుఖం కలిగించే సుగ్రీవుని మాటలు విని ధర్మాత్ముడైన రాముడు లక్ష్మణునితో కూడా చాల సంతోషించాడు. రాముడు హెచ్చుగా సంతోషించాడు. మహాబలుడైన లక్ష్మణుడు కూడా సంతోషించాడు.

దధిముఖుని మాటలు విని సంతోషించిన సుగ్రీవుడు అతనితో ఇలా బదులు పలికాడుః

"కార్యం పూర్తి చేసివచ్చిన వారు మధువనం భక్షించినందుకు నేను చాల ప్రీతుడనయాను. కార్యసాధకులైన వారి చేష్ట క్షమించదగినది. దానిని నేను క్షమించాను. హనుమంతుడూ మొదలగు వానరులందరినీ నేను, రామలక్ష్మణులతో కూడి, చూడ గోరుతున్నాను. సీతాదేవి గురించి వాళ్లు చేసిన ప్రయత్నాన్ని వినగోరుతున్నాను."

ప్రీతిచేత విశాలమైన కన్నులుకల రాజకుమారులిద్దరూ అధికంగా సంతోషించారు. పులకించిన వారి శరీరభాగాలను చూసి కార్య సాఫల్యం తెలుసుకొని, ఆ కార్య సిద్ధి చేతులకు చిక్కిందని సంతోషించాడు, సుగ్రీవుడు.

సుగ్రీవుడు ఈ విధంగా చెప్పగా వానరుడైన దధిముఖుడు హర్షించి రాముడిని లక్ష్మణుడిని సుగ్రీవుడిని అభినందించాడు. వారికి ప్రణామం చేసి వచ్చిన వానరులతో

కలిసి ఆకాశం మీదికి ఎగిరిపోయాడు. ఆకాశం నుండి భూమికిదిగి మధువనం ప్రవేశించాడు. వానరులను చూశాడు. వాళ్లు, మధువులోని నీరు మూత్రరూపంగా పోయి, మదం తొలగి లేచి కూర్చున్నారు.

దధిముఖుడు చేతులను అంజలిగా ఘటించి వారిని సమీపించాడు. సంతోషించిన వాడివలె అతడు అంగదునితో మృదువుగా పలికాడు:

"ఓయి సౌమ్యుడా! మిమ్మల్ని అడ్డుకున్నామని కోపించడం తగదు. అజ్ఞానులైన వనపాలకులు మిమ్మల్ని అడ్డగించారు. యువరాజైన నువ్వు ఈ వనానికి అధిపతివి. మునుపు మేము మూర్ఖత్వంతో చేసిన తప్పును నువ్వు క్షమించదగుదువు. నేను పోయి మీ పినతండ్రితో ఇక్కడికి వచ్చిన వానరుల గురించి చెప్పాను. మిగిలిన వానరశ్రేష్ఠులతో కలిసి మీ రాకను విని అతడు సంతోషించాడు. మధువనం నాశనమయిందని విని కోపగించలేదు. అందరిని తొందరగా అక్కడికి పంపమని ఆ రాజు అన్నాడు."

దధిముఖుని మాటలు విని అంగదుడిట్లు పలికాడు:

"గుంపులోని వానరులారా! ఈ సంగతి రాముడికి తెలిసిందని నేను సందేహిస్తున్నాను. కార్యం నెరవేర్చి ఇక్కడ మనం ఉండడం తగినపని కాదు. కోరికతీరా మధువు త్రాగి వానరులంతా విశ్రమించారు. నాకు పూజ్యుడైన సుగ్రీవుడు ఎక్కడుంటాడో అక్కడికి పోవడమే మిగిలింది. మీరందరూ ఎలా చెప్తారో ఆ విధంగా నేను చేస్తాను. కర్తవ్యవిషయంలో నేను మీకు పరాధీనుడినే. నేను యువరాజును, మీకు ప్రభువును. అయినా మిమ్మల్ని ఆజ్ఞాపించుటకు సమర్థుడిని కాను. కార్యం సాధించుకొని వచ్చిన మీరు నాచేత ఆజ్ఞాపించబడడం యుక్తం కాదు."

అంగదుని మాటలు విని వానరులు సంతోషించి అన్నారు:

"ఓయి వానరశ్రేష్ఠుడవైన యువరాజా! ప్రభువైన వాడెవడు ఈ విధంగా వినయంగా మాట్లాడుతాడు? ఆ ప్రభువు ఐశ్వర్య మదమత్తుడైతే తానే సర్వమని భావిస్తాడు. నీ వలె ఇటువంటి మంచి మాటలెవడూ పలుకడు. నీకు రాబోయే శుభాలకు ఈ మాటలు యోగ్యతను కలిగిస్తున్నవి. వానరవీరులకు ప్రభువైన

సుగ్రీవుడు ఎక్కడుంటాడో అక్కడికే మనమందరంపోదాం. ఆ అవకాశం కోసం ఎదురు చూస్తున్నాం. నువ్వు ఆజ్ఞ నివ్వనిదే వానరులందరం ఒక అడుగు కూడా ముందుకు పోలేము. ఈ సత్యం నీతో చెప్తున్నాం."

అంగదుడు బదులు పలికాడు: "తప్పకుండా మనం పోదాం!" వేగవంతులైన వానరులు ఆకాశం మీదికి ఎగిరి మహానాదంచేశారు.

అంగదుడు ఎప్పటికీ రాలేదు. దుఃఖంతో పీడింపబడుతున్న రాముడితో సుగ్రీవుడన్నాడు:

"నీవు ఊరడిల్లవలసింది. నీకు క్షేమమగుగాక! సీతాదేవి కనపబడింది. సందేహం లేదు. ఆ విధంగా కాకపోతే వాళ్లీ విధంగా ఆలస్యంగా రారు. యువరాజైన అంగదుడు కార్యం చెడిపోతే నాదగ్గిరికి రానేరాడు. ఆ వానరరాజు సంతుష్టుడు కాకపోతే నా మేనమామ చేత రక్షింపబడుతున్న మధువనాన్ని పాడు చేయడు.

"కౌసల్యాదేవి సత్సంతానమైన రాముడా! సుపుతుడా! ఊరడిల్ల వలసింది. సీతాదేవి చూడబడింది. సందేహంలేదు, మరెవరూ కారు. హనుమంతుడే చూశాడు. అతడే తప్ప మరొకడు ఈ పని సాధించలేడు. ఓయి మతిమంతుడా! సూర్యుని యందు తేజస్సు ఉన్నట్లు హనుమంతుడియందు సిద్ధి, మతి, పట్టుదల, పరాక్రమము ఉన్నాయి. ఇది నిజమైన సంగతి.

"జాంబవంతుడు ఎక్కడ నాయకుడుగా ఉంటాడో, అంగదుడు సేనాధిపతిగా ఉంటాడో, హనుమంతుడు సహాయకారియో, అక్కడ విజయం తప్ప మరొకటి జరుగదు. అందువలన అమితపరాక్రమవంతుడవైన నువ్వు చింతాక్రాంతుడివి కావద్దు."

అపుడు కార్యసిద్ధిచే గర్వితులైన హనుమంతుడు మొదలైన వానరుల కిలకిలా శబ్దం ఆకాశం మీద దగ్గిరగా వినబడింది.

సుగ్రీవుడు సంతుష్టి చెంది తోకను మూలగా చుట్టుకున్నాడు. రామదర్శనం కోరుతున్న వానరులందరూ అంగదుని, హనుమంతుని ముందుంచుకొని వచ్చారు. వీరులు, మోదాంకితులు అయిన అంగద ప్రముఖులు రాముని సమీపంలో దిగారు.

మహాబాహువైన హనుమంతుడు రామునికి శిరసు వంచి ప్రణామం చేసి

సీతాదేవి నియమవతిగా ఉందని, అక్షత అని నివేదించాడు. వాయుపుత్రుడైన హనుమంతుడు కార్యం సాధించి వచ్చాడని సుగ్రీవుడు నిశ్చయానికి వచ్చాడు.

లక్ష్మణుడు హనుమంతుని చూసి, సంతోషించి, అతనిని ఆదరంతో చూశాడు.

శత్రువులను సంహరించేవాడు, మనోజ్ఞమైనవాడు అయిన రాముడు గొప్పదైన ఆదరంతో హనుమంతుడిని చూశాడు.

అపుడు వానరులందరూ చిత్రములైన అడవులు కల ప్రస్రవణగిరికి పోయి శిరసుతో రామునికి, మహాబలుడైన లక్ష్మణునికి ప్రణామం చేశారు.

అంగదుని ముందుంచుకొని, సుగ్రీవునికి ప్రణామం చేసి, సీతాదేవి యొక్క వృత్తాంతం చెప్పడానికి మొదలు పెట్టారు.

సీతాదేవి రావణుని అంతఃపురంలో నిర్బంధింపబడి ఉన్నదని, రాక్షస స్త్రీలచేత భయపెట్టబడుతున్నదని, రామునికి ఆమె యందు ఎంత అనురాగముందో అంత అనురాగము ఆమెకు అతనిపై ఉందని. వానరులందరూ రాముని సన్నిధియందు చెప్పారు. ఆమె కివ్వబడిన వ్యవధి గురించి అతనికి విన్నవించారు.

సీతాదేవి అక్షత అని విని రాముడు బదులు పలికాడు:

"ఓ వానరులారా! సీతాదేవి ఎక్కడుంది? నా పట్ల ఎలా ఉంది? విదేహ రాజపుత్రిక గురించి విషయమంతా నాకు చెప్పవలసింది."

రాముని మాటలు విని అతని సమీపంలో నున్న వానరులు సీతా వృత్తాంతకోవిదుడైన హనుమంతుని ముందుకు తోశారు.

వారి మాటలు విని హనుమంతుడు సీతాదేవి ఉన్నదిక్కుగా తిరిగి, శిరసుతో సీతాదేవికి ప్రణామం చేసి, సీతాదేవి దర్శనం ఏ విధంగా లభ్యమయిందో చెప్పాడు:

"నేను నూరు యోజనాలు పొడవైన సముద్రాన్ని లంఘించి జనకరాజ పుత్రియైన సీతాదేవిని చూడాలన్న కోరికతో వెదకుతూ పోయాను. అక్కడ దక్షిణంగా నున్న సముద్ర తీరానికి దక్షిణంగా లంక అన్న పేరుగల నగరం ఉంది. అది దురాత్ముడైన రావణునిది. అక్కడ రావణుని అంతఃపురంలో పతివ్రతయైన సీతాదేవిని చూశాను.

"ఓ రాముడా! ఆ సుందరి తన కోరికను నీ యందే నిలిపి బ్రతికి ఉంది. రాక్షసస్త్రీల మధ్యను మాటిమాటికి బెదరింపబడుతూ వికృతమైన ఆకారాలు కల రాక్షసస్త్రీలచేత ప్రమదావనంలో కాపాడబడుతూ ఉంటే నేను చూశాను.

"ఆ పతివ్రతయైన సీతాదేవి సుఖాలను అనుభవించదగినది. కాని, ఆమె దుఃఖమే అనుభవిస్తున్నది. ఆమె రావణుని అంతఃపురంలో బంధింపబడి ఉంది. రాక్షసస్త్రీలచే బాగా కాపాడబడుతున్నది. ఒంటి జడను ధరించింది. దీనురాలుగా ఉంది. నీ యందే మనసు నిలుపుకొని ఉంది.

"నియమం, సదాచారంభక్తి అన్నవి ఆమెకు నీ యందు పూర్వమున్నట్లే ఉన్నవి. ఓ పురుష శ్రేష్ఠుడా! ఈ విధంగా చాల అదృష్టవంతురాలైన జానకి నాచే చూడబడింది. నీ యందలి భక్తిచేత తీవ్రమయిన తపస్సు చేస్తున్నది సీతాదేవి.

"ఓయి మహాప్రాజ్ఞుడా! చిత్రకూటమందు నీ సన్నిధిని కాకి విషయంలో జరిగిన అభిజ్ఞానం ఆమెనాకు యథాతథంగా చెప్పింది. ఆమె నాతో ఈ విధంగా పలికింది. 'ఓయి వాయుపుత్రుడా! నువ్వు ఇక్కడ చూసినదంతా నరవ్యాఘ్రుడైన రామునికి చెప్పవలసింది. చాల ప్రయత్నంతో కాపాడుతున్న ఈ చూడామణిని అతనికి సమర్పించవలసింది. ఓయి శ్రీమంతుడా! ఈ చూడామణిని నేను జాగ్రత్తగా కాపాడాను.

" 'ఒకప్పుడు నానుదుట తిలకం చెరిగిపోయింది. అపుడు నువ్వు గుండ్రాతి మీద మణిశిలను పెట్టి దానికిరణాలు నా నుదుట బొట్టుగా ఏర్పడినట్లు చేశావు. దానిని నువ్వు జ్ఞాపకం తెచ్చుకో వలసింది.

" 'ఓయి శ్రీమంతుడా! సముద్రంలో పుట్టిన చూడామణిని నీ కోసం పంపుతున్నాను. ఓయి పాపరహితుడా! దీనిని చూసి కష్టాలయందు నువ్వు సంతోషిస్తావు.

" 'ఓయి దశరథపుత్రా! నేనొక నెల్లాళ్ల మాత్రం బ్రతుకుతాను. రాక్షసులకు వశమైన నేను నెలకు పైగా జీవించను.'

"ఈ విధంగా కృశించిన శరీరం కలది, రాముని ధర్మపత్ని, రావణుని అంతఃపురంలో నిర్బంధింపబడినది, లేడికన్నులవలె విశాలమైన కనులు కలది

అయిన సీతాదేవి నాతో చెప్పింది.

"ఓయి రాముడా! ఇంతవరకు ఉన్నదున్నట్లు నీతో చెప్పాను. ఇటు పిమ్మట సముద్రజలాలను దాటడం గురించి ఆలోచించ వలసింది."

ఈ మాటలతో రాజపుత్రు లిద్దరూ ఊరడిల్లిన సంగతి తెలుసుకొని, సీతాదేవి ఇచ్చిన అభిజ్ఞానాన్ని రాముడికిచ్చి, అంతకు పూర్వం సీతాదేవి చెప్పినదంతా సక్రమంగా రామునికి హనుమంతుడు తెలియజేశాడు.

హనుమంతుడీ విధంగా పలుకగా రాముడు లక్ష్మణునితో కూడి ఆ మణిని హృదయమందుంచుకొని చాల హెచ్చుగా రోదించాడు. ఉత్తమమైన చూడామణిని చూసి దుఃఖంచే పీడింపబడిన రాముడు నీరు నిండిన కనులు కలవాడై సుగ్రీవునితో ఇలా అన్నాడుః

"దూడ మీద వాత్సల్యం కల ఆవు ఏ విధంగా పాలను కార్చుతుందో ఆ విధంగా నా హృదయం కూడా ఈ మణిశ్రేష్ఠాన్ని చూసి ద్రవిస్తున్నది. ఈ మణిరత్నాన్ని నా మామ వైదేహికి ఇచ్చాడు. పెండ్లి సమయంలో ఆమె దీనిని తలపై ధరించింది. అప్పుడు ఈ మణి హెచ్చుగా శోభించింది. ఈ మణి సముద్రం నుండి జన్మించింది. సజ్జనులచేత పూజింపబడింది. జనకుడు చేసిన యజ్ఞమందు దేవేంద్రుడు దీనిని అనుగ్రహించాడు. ఓయి సౌమ్యుడా! ఈ మణిని చూస్తుంటే నా తండ్రి దశరథుని, విదేహరాజైన జనకుని చూసినట్లుంది. (వీరిద్దరూ ఈ మణిని సీతాదేవి తలపై ఉంచారు). ఈ చూడామణి నా ప్రియురాలి తలపై శోభిల్లుతుంది. నేను దీనిని చూడడంచేత సీతాదేవిని పొందినట్లే తలుస్తున్నాను.

"విదేహరాజపుత్రియైన సీతాదేవి ఏమంది? ఓయి సౌమ్యుడా! మరల మరల చెప్పు. దప్పిగొన్నవాడు నీటితో సేదదీరినట్లు నన్ను నీ మాటలనే నీటితో తడపవలసింది.

"లక్ష్మణా! సీతాదేవి రాలేదు. సముద్రమందు పుట్టిన ఈ చూడామణిని మాత్రమే చూస్తున్నాను. ఇంతకన్న దుఃఖం కలిగించేది మరొకటి ఉందా?

"సీతాదేవి ఒక నెల బ్రతికితే చిరకాలం జీవిస్తుంది. నేను మాత్రం ఆ నల్లని కనుల దానిని విడిచి ఒక క్షణం కూడా బ్రతుకక లేను. ఏ దేశమందు నా

ప్రియురాలైన సీతాదేవి కనపడిందో నన్ను కూడా అక్కడికి తీసుకుపోవలసింది. ఆమె వృత్తాంతం తెలిసిన తరువాత ఒక క్షణం కూడా నిలువలేను.

"భీరువు, సుశ్రోణి అయిన నా భార్య ఘోర రూపులైన రాక్షసుల మధ్య ఎలా ఉండగలుగుతున్నది? శరత్కాలమందు మేఘాలచే కప్పబడిన చంద్రుడు ప్రకాశించనట్లు, ఆ ముఖం కూడా రాక్షసులతో చుట్టబడి ప్రకాశించడం లేదు.

"ఓయి హనుమంతుడా! సీతాదేవి ఏమి చెప్పింది? దాని నంతటినీ నాకు చెప్పు. దీనిని విని ఔషధం సేవించి రోగి బ్రతికినట్లు నేను కూడా బ్రతుకుతాను.

"ఓయి హనుమంతుడా! చాల చక్కనిది, మధురంగా మాట్లాడునది, వరారోహ, భామినియైన సీత నన్నెడబాసి ఏమన్నది? దానిని నాకు చెప్పవలసింది."

మహాత్ముడైన రాముడు ఈ విధంగా హనుమంతుడితో పలికాడు. అతడు రామునికి సీతాదేవి చెప్పినదంతా నివేదించాడు. చిత్రకూటంలో జరిగిన కాకాసుర వృత్తాంతం సీతాదేవి చెప్పినది తెలియజేశాడు. తరువాత ఆమె మాటలు ఈ విధంగా చెప్పాడు.

"అస్త్రప్రయోగంలో నేర్పుకలవాడు, మహాబలవంతుడు గుణవంతుడు అయినప్పటికీ రాముడు ఎందుకని రాక్షసుల మీద అస్త్ర సంధానం చేయడం లేదు?

"యుద్ధంలో నాగులు కాని, గంధర్వులు కాని, అసురులు కాని, మరుద్గణాలు కాని రాముని ఎదుట నిలవడానికి సమర్థులు కారు. పరాక్రమవంతుడైన రాముడికి నా యందు తొందరుంటే వెంటనే యుద్ధమందు రావణుని వాడియైన బాణాలతో చంపవలసింది. అన్నగారి ఆజ్ఞను పొంది, శత్రువులను తపింపజేసేవాడు. రఘుకుల మందు పుట్టినవాడు అయిన లక్ష్మణుడు, నరులలో శ్రేష్ఠుడు, ఏల నన్ను కాపాడడు?

"ఆ పురుషశ్రేష్ఠులిద్దరూ శక్తివంతులు. వాయువుతోను, అగ్నితోను సమమైన తేజస్సు కలవారు. దేవతలకైనను ఎదిరించరానివాళ్లు, వాళ్లిద్దరూ నన్నెందుకు ఉపేక్షిస్తున్నారు?

"నాలో ఏదో గొప్ప లోపం ఉండి ఉంటుంది-దీనికి సందేహం లేదు. శత్రువులను తపింపజేసేవాళ్లు, కలిసి ఉన్నవాళ్లు, అయిన రామలక్ష్మణులు ఎందుకు

నన్ను దయ చూడకుండా ఉన్నారు?

"దయ నీయమైనవి, కన్నీటితో పలుకబడినవి అయిన సీతాదేవి మాటలు విని ఆర్యయైన ఆమెతో నేను మళ్లా పలికాను:

" 'ఓ దేవి! నీ ఎడబాటు వలన రాముడు దేని మీద ఆసక్తి లేకుండా ఉన్నాడు. ఇది నిజం. ఒట్టు పెడుతున్నాను. రాముడు దుఃఖంలో మునిగితే లక్ష్మణుడు కూడా పరితాపం చెందుతున్నాడు.

" 'ఏదో విధంగా నువ్వు చూడబడ్డావు. ఇది విచారించడానికి సమయం కాదు. ఈ క్షణమందే దుఃఖాలకు అంతం చూడగలవు. రామలక్ష్మణులు, నిన్ను చూడవలెనన్న కోరికగలవారు, లంకను భస్మం చేస్తారు. రావణుని బంధువులతో కూడా చంపి, రాముడు తన నగరానికి తప్పకుండా నిన్ను తీసుకొని పోతాడు. ఓ ఉత్తమురాలా! రాముడు తెలుసుకోదగిన గుర్తొకటి, ప్రీతిని కలిగించేది, అతని కోసం నువ్వు ఇవ్వవలసింది.'

"ఆమె అప్పుడు చుట్టూచూసి, జడలో దాల్చవలసిన ఉత్తమమైన ఆభర ణాన్ని చీరముడి నుండి విప్పి, ఈ చూడామణిని నాకిచ్చింది.

"ఓరామా! నీకోసం ఆదివ్యమైన మణిని గ్రహించి, ఆర్యకు శిరసుతో ప్రణామం చేసి నేను తిరిగిరావడానికి తొందరపడ్డాను. నేను ప్రయాణానికి తొందర పడుతుంటే సీతాదేవి నన్ను చూసి శరీరం పెంచుతున్న నాతో అంది:

"'హనుమంతుడా! సింహసములైన రామలక్ష్మణులిద్దరిని, మంత్రులతో కూడిన సుగ్రీవుడిని, అందరినీ కుశలమడిగానని చెప్పు. ఏ విధంగా నన్ను రాముడు ఈ దుఃఖ సముద్రం నుండి దాటించగలడో ఆ విధంగా నువ్వు సన్నాహాలు చేయవల సింది. నా శోకవేగం చాలతీవ్రమైనది. ఈ రాక్షసులు నన్ను భయపెడుతున్నారు. రాముడిదగ్గిరికి పోయి ఇదంతా చెప్పవలసింది. ఓ వానరశ్రేష్ఠుడా! నీ మార్గం మంగళప్రదమగుగాక!'

"ఓ నృపరాజసింహ! ఆర్యయైన సీతాదేవి ఈ మాటలను చాల దుఃఖంతో పలికింది.నేను చెప్పినది నువ్వు తెలుసుకొని సీతాదేవి సంపూర్ణంగా కుశలంగా ఉందని నమ్మవలసింది.

"ఓరామా! సీతాదేవి కలవరపాటుతో మరల పలికింది- ఆదరంతో, నీకు నాపైగల స్నేహాన్ని పురస్కరించుకొని, ఆమె నన్ను చూసి పలికిందిః

" 'ఓ అరిందమ! నీవు కోరినట్లయితే ఏదో ఒక చాటయిన చోట విశ్రమించి రేపు వెళ్లవచ్చు. నువ్వు నా సమీపంలో ఉంటే మందభాగ్యనైన నా యొక్క పరిణతి పొందిన శోకానికి కొద్దికాలం ఉపశాంతి కలుగుతుంది. పరాక్రమ శాలివైన నువ్వు మళ్లీ రావడానికని వెళ్లిపోతే నా ప్రాణాలు నిలుస్తాయో లేదో అన్న సందేహం కలుగుతున్నది.

" 'దుఃఖం నుండి ఇంకా దుఃఖం పొందినదానను. దుర్గతి పొందిన దానను, దుఃఖాన్ని అనుభవిస్తున్న దానను - నాకు నువ్వు కనిపించ కుండా వెళ్లిపోతే శోకం నన్ను మళ్లా బాధపెడుతుంది.

" 'నీకు సహాయం చేయవలసిన వానరులు - ఎలుగుబంట్లు - వీరి విషయంలో నాకొక సందేహం ఎదురవుతున్నది. నరశ్రేష్ఠుని పుత్రులిద్దరూ కాని, వానరులు ఎలుగుల సైన్యాలు కాని, దాటరాని ఈ మహా సముద్రాన్ని ఎలా దాటుతారు? ఈ సముద్రాన్ని దాటడానికి ముగ్గురు మహాప్రాణులకు మాత్రమే శక్తి ఉంది. వినతాసుతుడైన గరుత్మంతుడు, నువ్వు, వాయుదేవుడు - మీరు మాత్రమే ఈ పని చేయగలరు. కార్యనిర్వహణ ఈ విధంగా దుష్కరంగా ఉంది. ఓయి వీరుడా! దీనికే సమాధానం ఆలోచిస్తున్నావు? ఈ ఉపాయం గురించి చెప్ప వలసింది.

" 'ఈ కార్యాన్ని పూర్తిగా సాధించడానికి నువ్వొక్కడవే చాలు. ఈ బలప్రదర్శన నీ యశస్సుకు కారణమవుతుంది. సంపూర్ణములైన సేనలతో వచ్చి రావణుని యుద్ధమందు చంపి, విజయం పొంది, రాముడు నన్ను తీసుకుపోతే ఆ పని రామునికి యశస్సును కలిగిస్తుంది.

" 'వీరుడైన రాముడు లేనప్పుడు అతనికి భయపడిన రాక్షసునిచేత నేను అపహరింపబడ్డాను. ఆ విధంగా నన్ను రహస్యంగా రాముడు తీసుకొని పోవడం సరియైన పనికాదు. రాముడు లంకా పట్టణాన్ని తన సేనలతో వ్యాకులపరచి నన్ను తీసుకొని పోతే ఆపని అతనికి సరిపడినట్లుంటుంది. యుద్ధమందు పరాక్రమ వంతుడు, మహాత్ముడు అయిన రాముడికి ఏ విధంగా అనుకూలంగా ఉంటుందో,

ఆ విధంగా నువ్వు ఆచరించవలసింది.'

"అర్థంతో కూడినది వినయపూర్వకమైనది, సహేతుకమైనది అయిన సీతాదేవి వాక్యాన్ని విని నేను బదులు పలికాను.

" 'ఓ దేవి! వానరుల సైన్యానికి ఎలుగుల సైన్యానికి ప్రభువైన మహాబల సంపన్నుడు, సుగ్రీవుడు నీ విషయంలో కృతనిశ్చయుడై ఉన్నాడు. మహాశరీరులు, మహాబలులు అయిన వానరులు సుగ్రీవుని చెప్పుచేతలలో ఉన్నారు. వీరు ఆకాశంలో కాని పాతాళంలోకాని, భూతలం మీద కాని అడ్డులేని సంచారం కల వాళ్లు. గొప్ప పనులు చేయడంలో వీరు భంగపడరు. వీరు ఆకాశమార్గంలో భూమినంతా ప్రదక్షిణం చేశారు. నాకన్న గొప్ప వారు, నాకు సమానులు అయిన వానరులే ఉన్నారు. సుగ్రీవుని దగ్గిర నాకన్న తక్కువయినవాడు లేనే లేడు.

" 'నా వంటి వాడే ఇక్కడికి వచ్చాడు. ఇతరుల విషయంలో చెప్పేదేముంది. దౌత్యానికి శ్రేష్ఠులను పంపరు – సామాన్యులనే పంపుతారు.

" 'ఓదేవి! ఈ పరితాపం చాలు! నువ్వు దుఃఖాన్ని విడిచిపెట్టు. ఒక్కదాటుకే వానరుల మూకలు లంకను చేరుకుంటాయి. నా వీపు మీద నెక్కి నరశ్రేష్ఠులిద్దరూ నీ దగ్గిరికి రాగలరు. రాముని తొందరలోనే చూస్తావు. విల్లు దాల్చి లంకానగరం ద్వారానికి వచ్చిన లక్ష్మణుని చూస్తావు. వానరులు తొందరగా ఇక్కడికి రావడం చూస్తావు.

" 'లంకా పట్టణం యొక్క మలయపర్వతం నెత్తాలో సింహనాదం చేసే వానరముఖ్యుల ధ్వనిని త్వరలోనే వినగలవు. శత్రువులను అణచే రాముడు వనవాసం ముగించి నీతో కూడ అయోధ్యయందు అభిషిక్తుడవడం తొందరలోనే చూస్తావు.' "

సీతాదేవితో తానాడిన మాటలను హనుమంతుడు వివరంగా చెప్పి తన కథనాన్ని ఈ విధంగా ముగించాడు.

> "తతో మయా వాగ్భి రదీనభాషిణా
> శివాభి రిష్టాభి రభి ప్రసాదితా
> జగామ శాంతిం మమ మైథిలాత్మజా
> తవాపి శోకేన తదాభిపీడితా.

"ఓ రామా! సీతాదేవి కోసం నువ్వు శోకిస్తున్నావని తెలిసి ఆమె బాధపడుతుంటే, నేను దీనత్వం లేనివి, మంగళకరములైనవి, ఇష్టమైనవి అయిన మాటలను పలికి ఆమెను ప్రసన్నురాలిగా చేశాను. నాయందు కూడా మిథిలా రాజతనూజ శాంతిని వహించింది."

ఈ విధంగా హనుమంతుడు రాముడికి సీతాదేవి వృత్తాంతం నివేదించాడు.

* * *

శ్రీమత్ సుందరకాండ-సౌందర్యదర్శనంలో

ప్రథమభాగం సమాప్తం.

శుభం.

*ఆత్మాత్వం క్షితిజామతిః పరిజనాః ప్రాణాః శరీరం గృహం*
*పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః*
*సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరో*
*యద్యత్కర్మ కరోమి తత్త దఖిలం రామాస్తుతే పూజనమ్.*

ఓ రామా! నువ్వు నా ఆత్మవు - భూమి పుత్రి సీతాదేవి నా మనస్సు - నా ప్రాణాలు నీ సేవకులు - నా శరీరం నీ యిల్లు - నేను చేసుకునే అలంకారాదులు నీ పూజయే - నీ యందు సమాధి గతుడనవడమే నా నిద్ర - నాకాళ్ల నడక నీ ప్రదక్షిణమే - నా మాటలన్నీ నీ స్తోత్రాలే - నేనే పని చేస్తానో, అదంతా, ఓ రామా! నీ పూజయే-

**శుభం**

## శ్రీమత్సుందరకాండ - సౌందర్య దర్శనం ముద్రణకు విరాళాలు ఇచ్చిన దాతల పేర్లు.

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సోమయాజుల శ్రీధర్ - జంషెడ్‌పూరు | 125.00 |
| 2. | శ్రీ ఘండికోట బ్రహ్మాజీరావు - శ్రీమతి సీతారామ, విశాఖపట్నం | 101.00 |
| 3. | శ్రీ వి.సి.జే. మిశ్రో - కరవంజ | 125.00 |
| 4. | శ్రీ డి.వి.ఎస్. నారాయణ - కరవంజ | 125.00 |
| 5. | శ్రీ మల్లెమడుగుల కామేశ్వరరావు, శ్రీమతి ఉమ - విశాఖపట్నం | 125.00 |
| 6. | శ్రీ భమిడిపాటి సాంబమూర్తి, శ్రీమతి లక్ష్మి - విశాఖపట్నం | 116.00 |
| 7. | శ్రీ ఎమ్. ఆర్. కే. మూర్తి, శ్రీమతి వరలక్ష్మి | 125.00 |
| 8. | శ్రీ పుల్లెల వెంకటరామారావు, శ్రీమతి రాజ్యం - విశాఖపట్నం | 116.00 |
| 9. | శ్రీ బి. మధుకర్, శ్రీమతి సావిత్రి - కుల్టి. | 125.00 |
| 10. | శ్రీ సోమయాజుల వెంకటరమణయ్య, శ్రీమతి గీత - కుల్టి. | 125.00 |
| 11. | శ్రీ కోటేశ్వరరావు, శ్రీమతి విజయ - కుల్టి | 125.00 |
| 12. | శ్రీ గుల్లిపల్లి వెంకట భాస్కరరావు, శ్రీమతి శారదాదేవి - జంషెడ్‌పూర్ | 125.00 |
| 13. | శ్రీ మూడద్ల సంజీవి నాయుడు, శ్రీమతి అనూరాధ, జంషెడ్‌పూరు - | 125.00 |
| 14. | శ్రీ గుల్లిపల్లి లక్ష్మీనారాయణమూర్తి | 125.00 |
| 15. | శ్రీ బి. విశ్వేశ్వరావు, శ్రీమతి కళావతి - జంషెడ్‌పూరు | 125.00 |
| 16. | శ్రీ ధనిమిరెడ్డి వెంకటకృష్ణారావు - జంషెడ్‌పూరు | 125.00 |
| 17. | శ్రీ భమిడిపాటి జానకిరామయ్య, శ్రీమతి రత్నం, జంషెడ్‌పూరు | 151.00 |
| 18. | శ్రీ సోమయాజుల లక్ష్మీనరసింహారావు, శ్రీమతి జగన్నాథమ్మ - జంషెడ్‌పూరు | 151.00 |
| 19. | శ్రీ సోమయాజుల శ్రీరామమూర్తి, శ్రీమతి సుధ - జంషెడ్‌పూరు | 125.00 |
| 20. | శ్రీ సోమయాజుల ప్రభాకర్ - జంషెడ్‌పూరు | 125.00 |
| 21. | శ్రీ బి. నీలాచలం, శ్రీమతి రఘు - జంషెడ్‌పూరు | 125.00 |
| 22. | శ్రీ అన్నంరాజు వెంకటాచలం, వారి సతీమణి - జంషెడ్‌పూరు | 125.00 |
| 23. | శ్రీ జి. గోపి - జంషెడ్‌పూరు | 125.00 |
| 24. | శ్రీ ఘండికోట నాగేశ్వరరావు, శ్రీమతి రామలక్ష్మి | 125.00 |
| 25. | శ్రీ వి. కుమారస్వామి - కరవంజ | 125.00 |
| 26. | శ్రీ పాటిబళ్ల వేణుగోపాలరావు - విజయవాడ | 125.00 |

| | | |
|---|---|---|
| 27. | శ్రీ పాటిబళ్ల లక్ష్మీనరసింహమూర్తి, శ్రీమతి కృష్ణవేణి - విశాఖపట్నం | 125.00 |
| 28. | శ్రీ సుభ - హైదరాబాదు | 125.00 |
| 29. | శ్రీ పి. ఎస్. నారాయణ - హైదరాబాదు | 125.00 |
| 30. | శ్రీ సుభాగారి ఇద్దరు స్నేహితులు - హైదరాబాదు | 250.00 |
| 31. | శ్రీ నరసింగరావు - విశాఖపట్నం | 20.00 |
| 32. | శ్రీ రాళ్లపల్లి సత్యనారాయణ, శ్రీమతి సుబ్బలక్ష్మి - విశాఖపట్నం | 101.00 |
| 33. | శ్రీ కన్నేపల్లి దయాకరరావు, శ్రీమతి రాధాభాయి - విశాఖపట్నం | 125.00 |
| 34. | శ్రీ కన్నేపల్లి బాలసూర్య ప్రసాదరావు, శ్రీమతి బాలాత్రిపురసుందరి - రౌర్కెలా | 150.00 |
| 35. | శ్రీ గురుచరణదాసు, శ్రీమతి ఝాన్సీ - విశాఖపట్నం | 125.00 |
| 36. | శ్రీ శ్రీపాదరామారావు, శ్రీమతి అన్నపూర్ణ - విశాఖపట్నం | 101.00 |
| 37. | శ్రీ పొణుగుపాటి జగన్నాథం, శ్రీమతి రామలక్ష్మి - విశాఖపట్నం | 125.00 |
| 38. | శ్రీ ప్రభల లక్ష్మీనరసింహమూర్తి, శ్రీమతి బాలాత్రిపురసుందరి - విశాఖపట్నం | 125.00 |
| 39. | శ్రీ సోమయాజుల సంగమేశ్వరశర్మ వారి ధర్మపత్ని, విశాఖపట్నం | 125.00 |
| 40. | శ్రీ పరిమి సన్యాసిరావు, శ్రీమతి సరోజ - విశాఖపట్నం | 116.00 |
| 41. | శ్రీ వేదుల వరహాలు, వారి ధర్మపత్ని - విశాఖపట్నం | 115.00 |
| 42. | శ్రీ పి.ఎస్.ఆర్.ఆర్. భాస్కరరావు - బెంగుళూరు | 125.00 |
| 43. | శ్రీ ఎమ్. కృష్ణ - బెంగళూరు | 150.00 |
| 44. | శ్రీ ఎన్. వి. నరసింహారావు - బెంగళూరు | 150.00 |
| 45. | శ్రీ ఎ. వెంకోబరావు - బెంగళూరు | 150.00 |
| 46. | శ్రీ శనివారపు లక్ష్మణశాస్త్రి, శ్రీమతి శారద - విశాఖపట్నం. | 125.00 |
| 47. | (1) ధర్మ రక్షణ పరిషత్తు (2) సుందర చైతన్య సత్సంగం, విజయనగరం | 850.00 |
| 48. | శ్రీద్వివేదుల సోమనాధశాస్త్రి, వారి ధర్మపత్ని, విజయనగరం | 100.00 |
| 49. | శ్రీ చాడారమణమూర్తి, వారి ధర్మపత్ని - విజయనగరం | 116.00 |
| 50. | శ్రీ వేమూరి రాధాకృష్ణశర్మ, శ్రీమతి రాజ్యం - ఛత్రపురం | 125.00 |
| 51. | శ్రీమతి మండాకామేశ్వరమ్మ - ఛత్రపురం | 30.00 |
| 52. | శ్రీమతి వి. విజయలక్ష్మి - విశాఖపట్నం | 30.00 |
| 53. | శ్రీబుర్రా శివరామమూర్తి - విజయనగరం | 58.00 |

★